శ్రీ ర స్తు.

శ్రీమదుమారమణ చరణ సరోజసేవాపరతంత్రుడును అహమ్మదనగర

నివాసియునగు మాణికభట్టు అనువారికిపుత్రుడగు మోరేశ్వరుడను

వై ద్య శి ఖా మ ణి చే ర చి యిం ప బ డి న

# వైద్యామృతము.

గీర్వాణాద్యనేక భాషానిపుణులును ఆయుర్వేదశాస్త్రానుభవజ్ఞులునగు

జయకృష్ణదాసు వేంకటదాసుగారి సహాయమువలన



లేట్ పిడుగు - సుబ్బరామయ్యగారిచే తెనుగర్థమువ్రాయబడి

ములుకుట్ల - విశ్వనాథశాస్త్రులవారిచే బరిష్కరింపబడి

పి డు గు - వెం క ట కృ ష్ణా రా వు పం తు లు గా రి

హిందూరత్నాకరముద్రాక్షరశాలయందు

ఎనిమిదవతూరి

ముద్రింపించి ప్రచురింపంబడియె.

చెన్నపట్టణము.

1920.

 Price 1 4 0




చెన్నపురి :

వి వ గు - వేంకటకృష్ణారావు పంతులుగారి

హిందూరత్నాకర ముద్రాక్షరశాలయందు

ముద్రితము. 1920.




శ్రీరస్తు.



ప్రథమాలంకారము.

ద్వితీయాలంకారము.

## తృతీయాలంకారము.

విషయసూచిక ముగిసెను.

# ప్రకటన.

ఆస్మద్దేశీయులారా! నేనీక్రిందబొందుపరచిన యంశంబులను సావధానంబుగ జదువంగోరెద.

ఇచ్ఛాపురంబున మత్పితామహుండగు పిడుగు-సుబ్బరామయ్యగారు 1892 వ సంవత్సరంబున «హిందూరత్నాకరం» బను ముద్రాక్షరశాలను స్థాపించి పెక్కు వైద్య ఇతర గ్రంథములను ముద్రింపించి సుమారు 20 సంవత్సరములవరకు తచ్ఛాలా కార్యంబులను నిరభ్యంతరముగానున్ను జాగరూకతతోడనున్ను జరిపించుచూవచ్చి కీర్తిశేషులైరి. పదంపడి సుబ్బరామయ్యగారి పుత్రుండును మజ్జనకుండునైన పిడుగు-వెంకట్రావుగారున్ను నేనున్ను కలసి సదరు ముద్రాక్షరశాలకార్యంబులను జరిపించుచూవచ్చితిమి. అయితే యిప్పుడు మా తండ్రిగారు నాయందు నిష్కారణంబుగ పుత్రుడనైన నన్ను విడనాడి మాకుగల పిత్రార్జితపు సొత్తులను విభజించుకొనిరి. ఈ విభజనలో సదరు ముద్రాక్షరశాల నాయధీనంబయ్యె.

చదువరులారా! ఇక మీదట నేనే సదరు ముద్రాక్షరశాలను జరిపించుదును. ఇదివరలో అచ్చుపడిన గ్రంథములుగాక యితర సంస్కృతాంధ్ర గ్రంథములనుకూడా బాగుగా ముద్రింపించి మంచిబైండ్లుతోటి సులభమైన వెలలకే స్వల్పలాభముతోటి విక్రయించ నిశ్చయించియున్నవాడను. కనుక నాయందు కరుణవహించి వారివారికి వలయు గ్రంథములకును అచ్చుపనులకును ఆర్డర్లను పంపుదురని వేడుచున్నాడను. ప్రకృతము కాగితము కాటికలు బైండు సామానులు వీటి ధరలు అధికముగా హెచ్చి దొరుకుటకు కష్టమగుచున్నవి. ఇటు లెంత ధరలు హెచ్చినను మునుపటివెలలకే సాధ్యమైనంతవరకు పంపుచుందును. కొన్నిటికి వెలలు హెచ్చింపవలసివచ్చినయెడల వెలలు హెచ్చింపదలంచినాడను. గ్రంథములు కోరువారీయంశంబులను గమనించి క్షమింతురుగాక.

వలయువారలు ఈ క్రింద చేవ్రాలుచేసియుండు నాపేరటికివ్రాసి తెప్పించుకొని నన్ను గౌరవింతురని తమ ఘనతను మిగుల ప్రార్థించుచున్నాడను.

ఇట్లు,

పిడుగు-వెంకటకృష్ణారావు పంతులు

సోల్ ప్రొప్రయిటర్ - హిందూరత్నాకర ముద్రాక్షరశాల

40 పెద్దునాయునివీధి, మద్రాసు.

శ్రీరస్తు.

# వైద్యామృతము.

## మంగళాచరణము.

శ్లో॥ నత్వాబ్రహ్మమహేశవిష్ణుగిరిజానాగాస్యధన్వంతరీన్పూజ్యాన్!
సుశ్రుతవాగ్భటప్రభృతికాన్ సర్వాంశ్చవైద్యాన్గురూన్ ।
శ్రీమన్మాణికభట్టవైద్యతనయో మోరేశ్వరాఖ్యోభిషక్సైనా
వైద్యమతంవిలోక్యకురుతే వైద్యామృతంసుందరం ॥

తా॥ మాణికభట్టు అనువైద్యునికి సుతుడగు మోరేశ్వరుడను వైద్యవర్యుడు ముందుగా బ్రహ్మాదిష్ట దేవతానమస్కారంబుచేసి పిదప సుశ్రుతాది వైద్యవరులకు మ్రొక్కి అనేక వైద్యగ్రంథముల నాలోకించి సుందరమగు వైద్యామృతమను గ్రంథమును చేయుచున్నాడు.

శ్లో॥ ఆత్రేయపారాశరసుశ్రుతాద్యైర్వైద్యైర్హితా గ్రంథసృపాఃప్రసిద్ధాః ।
స్వయోగ్యకార్యప్రవిధానదక్షో గ్రంథోఽస్తుమేసేవజఏవ తేషామ్ ॥

తా॥ ఆత్రేయుడు పారాశరుడు సుశ్రుతుడు మొదలగువారలనేకులు శ్రేష్ఠములగు వైద్యగ్రంథముల జెప్పియున్నారు. నేను ఆ ఆత్రేయాదులకు శిష్యుడనుగానున్నందున నేచేసిన ఈగ్రంథముకూడ చికిత్సలకు యోగ్యమైన క్రియలను తెలుపుటకు సమర్థమగును.

శ్లో॥ యద్యస్యనార్యమిదమస్తివచోమదీయం వైద్యాస్తథాపిభవతాం
హితహేతురేవ । యస్మాదముష్యకరణేకరణంమదీయశ్శ్రీమత్స
దాశివపదాంబుజభక్తియోగః ॥

తా॥ ఓవైద్యవరులారా! శివపదాంబుజములయందు నాకుగలభక్తి ఈగ్రంథరచనయందు సాధనముగానున్నందున నేజెప్పెడివాక్యమబద్ధమైనను అశ్లీలవాక్యమైనను మీకు హితమునే కలుగజేయును.

శ్లో॥ శాస్త్రప్రవీణాఃక్రియయావిహీనాఃక్రియాప్రవీణాఃకలశాస్త్రహీనాః।
ఏతాదృశాయద్యపిసంతికింతైర్వైద్యాస్తవేవోభయథాప్రవీణాః॥

తా॥ లోకమునందు శాస్త్రమునుచదివినవారికి చికిత్సలు తెలియకయు చికిత్సలనుచేయునట్టి విషయములను తెలిసినవారికి శాస్త్రము తెలియకయు నుండును కావున శాస్త్రచికిత్సలు రెండును తెలిసినవారినే వైద్యులని చెప్పవలయు.

శ్లో॥ సమస్తామయముఖ్యత్వాజ్జ్వరస్యప్రథమంమయా।
ప్రతీకారస్సుధాతుల్యోయథామతినిగద్యతే॥

తా॥ జ్వరము అన్నిరోగములలో ముఖ్యమైనదగుటవలన ముందుగా దానికి అమృతతుల్యమగు ప్రతిక్రియజెప్పెద.

## అష్టస్థానపరీక్షా

శ్లో॥ రోగాఃక్రాంతశరీరస్యస్థానాన్యష్టౌనిరీక్షయేత్।
నాడీంమూత్రమలంజిహ్వాంశబ్దస్పర్శదృగాకృతీః॥

తా॥ వైద్యుడు ముందుగా రోగియొక్క అష్టస్థానములను (అనగా నాడి మూత్రము మలము నాలుక మాట స్పర్శము నేత్రములు ఆకారము) వీటిని పరీక్షచేయవలయు.

శ్లో॥ దోషకోపేఘనేఽల్పేచ పూర్వంనాడీంపరీక్షయేత్।
అంతేచాద్యస్థితిస్తస్యావిజ్ఞేయాభిషజాస్ఫుటమ్॥

తా॥ వైద్యుడు ముందుగా వాతపిత్తశ్లేష్మములలో ఇది ప్రబలముగానున్నది ఇది స్వల్పముగానున్నది అను విషయమును తెలిసికొనుటకై నాడిని పరీక్షచేసి వైద్యుడు ఆనాడియొక్క ఆద్యంతస్థితిని తెలిసికొనవలయు.

శ్లో॥ యథావీణాగతాతంత్రీసర్వాన్రాగాన్ప్రభాషతే।
తథాహస్తగతానాడీసర్వాన్రోగాన్ప్రకాశయేత్॥

తా॥ లోకమున వీణయందుండు తంతులను మ్రోయించుటచేత సమస్తరాగములు పలుకునట్లు హస్తగతమగునాడి సమస్తరోగములను ప్రకటనచేయును.

శ్లో॥ సర్వేషామేవరోగాణాంనిదానంకుపితామలాః ।
తత్ప్రకోపస్యతుప్రోక్తంవివిధాహితసేవనమ్ ।
నిదానార్థకరోరోగోరోగస్యాప్యుపలభ్యతే ॥

తా॥ దేహమందుండునట్టి మలము చెడుటవలన రోగముపుట్టును. మలము చెడుటకు అపథ్యపదార్థభక్ష్యపానాదులే కారణము. రోగము తెలియుటకు నిదానమును నిదానము తెలుసుకొనుటకు రోగంబును కారణములైయున్నవి.

శ్లో॥ ఆదౌసర్వేషురోగేషునాడీంజిహ్వాంచమూత్రతాం ।
పరీక్షాంకారయేద్వైద్యః పశ్చాద్రోగిచికిత్సయేత్ ॥

తా॥ ముందుగా సర్వరోగములయందు వైద్యుడు నాడి నాలుక మూత్రము వీటిని పరీక్షచేసి పిదప రోగమునకు చికిత్సచేయవలయు.

శ్లో॥ నాడ్యామూత్రస్యజిహ్వాయా లక్షణంయోనవిదంతి ।
మారయత్యాశువైజంతూన్సవైద్యోనయశోలభేత్ ॥

తా॥ లోకమున ఏ వైద్యునికి నాడి నాలుక మూత్రము వీటియొక్క నిదానము తెలియకయుండునో అట్టివాడు జనులను చంపుటయేగాక చికిత్సలుచేయుటవల్ల కీర్తిని పొందనేరడు.

శ్లో॥ లక్షయిత్వాదేశకాలంజ్ఞాత్వారోగబలాబలమ్ ।
చికిత్సామారభేద్వైద్యోయశఃకీర్తిమవాప్నుయాత్ ॥

తా॥ వైద్యుడు దేశకాలములను రోగముయొక్క బలాబలములను తెలిసికొని పిదప చికిత్సచేసినయెడల అట్టివైద్యుడు యశస్సును కీర్తిని పొందును.

నాడీపరీక్షా క్రమము.

శ్లో॥ నాడీమంగుష్ఠమూలాధస్స్పృశేద్దక్షిణేకరే ।
జ్ఞానార్థంరోగిణోవైద్యోనిజదక్షిణపాణినా ॥

తా॥ వైద్యుడు రోగిసంబంధమైన కుడిచెయ్యియొక్క అంగుష్ఠమూలమును (అనగా మణికట్టుకు వెనకనుండు మూడుఅంగుళముల ప్రదేశమును) తనకుడిచేతితో నిదానమును చూడవలయు.

శ్లో॥ స్థిరచిత్తః ప్రశాంతతాత్మా మనసా చ విశారదః ।
స్పృశేదంగుళిభిర్నాడీం జానీయాద్దక్షిణే కరే ॥
ప్రాయస్ఫుటా భవతి వామకరే మృగాక్షీనాం పుంసాం చ దక్షిణకరే తదియం పరీక్షా ॥

తా॥ నేర్పరియగు వైద్యుడు నాడిని చూచునపుడు స్వస్థచిత్తుడై ఆత్మను మనస్సును శాంతిపరిచికొని రోగియొక్క సవ్యహస్తమును తనయొక్క మూడువేళ్లతో పట్టి దోషమును తెలిసికొనవలయును. అందు స్త్రీలకు యెడమహస్తమునందును పురుషులకు సవ్యహస్తమునందును నాడి స్పష్టముగనుండు.

శ్లో॥ ఈషద్వినామితకరం వితతాంగుళీయం ।
బాహుం ప్రసార్య రహితం పరిపీడనేన ॥

తా॥ హస్తనిదానమును తెలిసికొనునపుడు రోగియొక్క హస్తమును పిసికి మెటికలువిరిచి చెయ్యిచాపించి వ్రేళ్లయొక్క పట్టునువదలించి వైద్యుడు నిదానమును చూచి రోగమును తెలిసికొనవలయు.

## నాడీపరీక్షా కాలము.

శ్లో॥ ఈషద్వినమ్రకృతకూర్పరవామభాగహస్తే ప్రసారితసదంగుళిసంధికే చ । అంగుష్ఠమూలపరిపశ్చిమభాగమధ్యే నాడీం ప్రభాతసమయే ప్రథమం పరీక్షేత్ ॥

తా॥ వైద్యుడు ప్రాతఃకాలమందు రోగిసంబంధమైన చాచినట్టి చెయ్యియందు మణికట్టుకు వెనకతట్టున నాడిని పరీక్ష చేయవలయు.

శ్లో॥ వారత్రయం పరీక్షేత ధృత్వా ధృత్వా విముంచయేత్ ।
విమృశ్య బహుధా బుధ్యా రోగవ్యక్తిం వినిర్దిశేత్ ॥

తా॥ రోగియొక్క నాడిని మాటిమాటికి పట్టి విడుచుచు బుద్ధిచేత బాగుగ మూడుసార్లు పరీక్షించి రోగము ఫలానిదని తెలిసికొనవలయు.

శ్లో॥ అంగుళిత్రితయైస్స్పృష్ట్వా క్రమాద్దోషత్రయోద్భవైః ।
మందాం మధ్యగతాం తీక్ష్ణాం త్రిభిర్దోషైస్తు లక్షయేత్ ।

తా॥ రోగియొక్క నాడిని వైద్యుడు తనయొక్క మూడువ్రేళ్లచేత స్పృశించి వాత పిత్త కఫములయొక్క గతులను క్రమముగ మంద మధ్యమ తీవ్రములనుగా తెలిసికొనవలయును. వాతపిత్తకఫములే త్రిదోషములు. వీటిని వైద్యుడు సూక్ష్మదృష్టి చేత తెలిసికొనవలయును.

శ్లో॥ వాతంపిత్తంకఫంద్వంద్వం త్రితయంసన్నిపాతకం।
సాధ్యాసాధ్యవివేకంచసర్వంనాడ్యాప్రకాశ్యతే॥

తా॥ నాడి వాత పిత్త కఫములను ద్వంద్వములగు వాతపిత్త పిత్తకఫ కఫవాతములను దోషత్రయములు యేకీభవించుటచే పుట్టినట్టి సన్నిపాతమును సాధ్యాసాధ్యములను స్పష్టముగ తెలుపును.

## నాడియొక్క పర్యాయశబ్దములు.

శ్లో॥ స్నాయుర్నాడీతథాహింస్రాధమనీధారిణీధరా।
తంతుకీజీవనజ్ఞానశబ్దాఃపర్యాయవాచకాః।

తా॥ స్నాయుః నాడీ హింస్రా ధమనీ ధారణీ ధరా తంతుకీ జీవనజ్ఞానా అనునవి నాడికి పర్యాయశబ్దములు.

## అజ్ఞాతనాడీ లక్షణము.

శ్లో॥ సద్యస్స్నాతస్యభుక్తస్యతథాస్నేహావగాహినః।
క్షుత్తృషార్తస్యసుప్తస్యనాడీసమ్యఙ్నబుధ్యతే॥

తా॥ స్నానముచేసినవానికి భోజనముచేసినవానికి చమురుపూసికొనినవానికి ఆకలి దప్పికలవానికి నిదురపోవువానికి నాడిస్పష్టముగ కనుబడదు.

శ్లో॥ అంగుష్ఠమూలభాగేయా ధమనీజీవసాక్షిణీ।
తచ్చేష్టయాసుఖందుఃఖంజ్ఞేయంకాయస్యపండితైః॥

తా॥ మనుష్యులయొక్క అంగుష్ఠమూలమందు (అనగా మణికట్టుకువెనుక మూడంగుళప్రదేశమందు) జీవసాక్షిగనుండు ధమనియను నాడికలదు. దానియొక్క నడక చేత శరీరమునకుగల సుఖదుఃఖములను నాడీజ్ఞాతలు తెలిసికొనియెదరు.

## స్త్రీనాడీ లక్షణము.

శ్లో॥ స్త్రీణాంభిషగ్వామహస్తేవామేపాదేచయత్నతః ।
శాస్త్రేణసంప్రదాయేనతథాస్వానుభవేనవై ।
పరీక్షేద్రత్నవచ్చాసావభ్యాసాదేవజాయతే ॥

తా॥ వైద్యుడు స్త్రీలయొక్క యెడమహస్తమందును యెడమకాలియందును శాస్త్రసంప్రదాయ స్వానుభవములచేత పరీక్షింపవలయును. రత్నపరీక్షాజ్ఞానము అభ్యాసమువలననే కలుగునట్లు నాడీపరీక్షాజ్ఞానము సదా అభ్యాసమువలననే కలుగును.

## నాడీదేవతలు.

శ్లో॥ వాతనాడీభవేద్బ్రహ్మా పిత్తనాడీచశంకరః ।
శ్లేష్మనాడీభవేద్విష్ణు స్త్రిదేవానాడిదేవతాః ॥

తా॥ వాతపిత్తకఫనాడులకు క్రమముగ బ్రహ్మ శివ విష్ణువులు దేవతలుగా నుందురు.

## వాతాదినాడీస్థానములు వాటిగతులును.

శ్లో॥ అగ్రేవాతవహానాడీ మధ్యేవహతిపిత్తలా ।
అంతశ్లేష్మవికారేణ నాడీజ్ఞేయాబుధైస్సదా ।
వాతాద్వక్రగతిర్నాడీపిత్తాదుత్ప్లుత్యగామినీ ।
కఫాన్మందగతిర్జ్ఞేయా సన్నిపాతాదతిద్రుతమ్ ॥

తా॥ అగ్రమునందు వాతనాడి వాతప్రకోపమగునపుడు వంకరగా నడుచును. పిత్తనాడి మధ్యమందుండి పిత్తప్రకోపమందు కప్పవలె యెగిరెగిరి నడుచును. కఫనాడి కడపటినుండి కఫప్రకోపమగునపుడు మందముగా నడుచును. సన్నిపాతమందు ఈ చెప్పిన మూడునాడులున్ను అతిత్వరగా నడుచును.

శ్లో॥ సర్పజలూకాదిగతింవిదంతివిబుధాఃప్రభంజనేనాడీమ్ ।
పిత్తేనకాకలావకమండూకాదేస్తథాచపలామ్ ॥

తా॥ వాతప్రకోపమందు నాడి పాము జలగ వీటియొక్క నడకకలిగి యుండును. పిత్తప్రకోపమందు నాడి కాకి లావకము కప్ప వీటియొక్క గతిగలిగి చపలముగానుండును.

శ్లో॥ రాజహంసమయూరాణాం పారావతకపోతయోః ।
కుక్కుటస్యగతింధత్తేధమనీకఫసంగినీ ।
పిత్తేవ్యక్తామధ్యమాయాంతృతీయాంగుళికాకఫే ।
వాతేఽధికేభవేన్నాడీ ప్రవ్యక్తాతర్జనీతలే ॥

తా॥ శ్లేష్మప్రకోపమగునపుడు నాడి రాజహంస నెమలి పావురము గువ్వ కోడి వీటియొక్క గమనముగలిగియుండును. పిత్తనాడి నడిమివ్రేలిక్రిందను శ్లేష్మనాడి అనామికముక్రిందను వాతనాడి తర్జనివ్రేలిక్రిందను నడుచును.

## వాతపిత్తనాడీ లక్షణము.

శ్లో॥ ముహుస్సర్పగతింనాడీ ముహుర్భేకగతింతథా ।
తర్జనీమధ్యమామధ్యేవాతపిత్తేఽధికేస్ఫుటా ॥
వక్రముత్ప్లుత్యచలతిధమనీవాతపిత్తతః ॥

తా॥ వాతపిత్తప్రకోపమందు నాడి తర్జని మధ్యమాంగుళముల మధ్యమందు మాటిమాటికి సర్పము కప్ప వీటియొక్క నడకకలిగియు వంకరగా ఎగిరెగిరియు నడుచును.

## వాతశ్లేష్మనాడీలక్షణము.

శ్లో॥ సర్పహంసగతింతద్వద్వాతశ్లేష్మవతీంవదేత్ ।
అనామికాయాంతర్జన్యాంవ్యక్తావాతకఫేభవేత్ ।
వహేద్వక్రంచమందంచవాతశ్లేష్మాధికత్వతః ॥

తా॥ అనామికయందును తర్జనీయందును స్ఫుటముగా కనుపడుచు సర్పహంస గతులు కలిగి మందముగాను వంకరగాను నడుచునట్టినాడి వాతశ్లేష్మనాడియని చెప్పవలయు.

## పిత్తశ్లేష్మనాడీలక్షణము.

శ్లో॥ హరిహంసగతింధత్తేపిత్తశ్లేష్మాన్వితాధరా ।
మధ్యమానామికామధ్యేస్ఫుటాపిత్తకఫేఽధికే ।
ఉత్ప్లుత్యమందంచలతినాడీపిత్తకఫేఽధికే ॥

తా॥ నాడి కప్ప హంస వీటియొక్కగతికలిగి మధ్యమానామికలయొక్క మధ్యమందు సంచరించుచు ఎగిరెగిరి మందముగా నడచిన పిత్తశ్లేష్మనాడియని తెలియవలయు.

## సన్నిపాతనాడీలక్షణము.

శ్లో॥ కాష్ఠకుట్టోయథాకాష్ఠంకుష్ఠతేచాతివేగతః।
స్థిత్వాస్థిత్వాతథానాడీసన్నిపాతేభవేద్ధ్రువమ్।
అంగుళీత్రితయేపిస్యాత్స్ఫ్రవ్యక్తాసన్నిపాతతః॥

తా॥ వృక్షమునుతొలుచునట్టి పిట్ట (అనగా లకుముకిపిట్ట) వృక్షమును అతివేగముగా నిలిచినిలిచి ఎట్లుకొట్టునో అదేరీతిగ నిలిచినిలిచి మూడువేళ్లక్రింద నడుచుచు స్ఫుటముగానుండునది సన్నిపాతనాడియని తెలియవలయు.

శ్లో॥ స్పందతేచైకమానేనత్రింశద్వారంయదాధరా।
స్వస్థానేనతదాసూనంరోగీజీవతినాన్యథా।
స్థిత్వాస్థిత్వావహతియాసాజ్ఞేయాప్రాణఘాతినీ॥

తా॥ రోగియొక్క నాడి ఏకగతిగా 30 తృటికాలములు నడిచినయడల ఆ రోగి జీవించును. నాడి నిలిచినిలిచి అదేరీతిగ నడిచినయడల అట్టి రోగి మరణమును పొందును.

## అసాధ్యనాడీలక్షణము.

శ్లో॥ మందంమందంశిథిలశిథిలం వ్యాకులంవ్యాకులంవా।
స్థిత్వాస్థిత్వావహతిధమనీయాతిసూక్ష్మాచసూక్ష్మా।
నిత్యంస్పందేత్స్ఫురతిపునరప్యంగుళీస్సంస్పృశేద్వా।
భావైరేవంబహువిధతరైస్సన్నిపాతాదసాధ్యా॥
తస్యమృత్యుంవిజానీయాద్యస్యేదంనాడిలక్షణమ్॥

తా॥ నాడి మెల్లమెల్లగా నడచినను మిక్కిలి శిథిలముగానడచినను అతిచంచలముగను నిలిచినిలిచియును కనుపడి కనుపడకయునుండినయడల అట్టి సన్నిపాతరోగి యసాధ్యమని తెలియవలయు. ఎవనికి ఇట్టినాడియుండునో అట్టివాడు మరణమును పొందునని తెలియవలయు.

శ్లో॥ పూర్వంపిత్తగతింప్రభంజనగతింశ్లేష్మాణమాబిభ్రతీం ।
స్వస్థానాద్భ్రమణం ముహుర్విదధతీంచక్రాదిరూఢేవయా ।
భీమత్వందధతీకదాచిదపివాసూక్ష్మత్వమాతన్వతీ ।
నోసాధ్యాంధమనీంవదంతిమునయోనాడీగతిజ్ఞానినః ॥

తా॥ నాడిముందుగ పిత్తగతినిపొంది నడుచుచు మధ్యయందు వాతశ్లేష్మముల యొక్క గతులనుపొంది మాటిమాటికి అనేకరీతులుగ (చక్రముమీద కూర్చున్నవా డెట్లు తిరుగునో అట్లు) స్వస్థానమునువిడిచి అంతలోనే భయంకరమునుపొంది ఒక ప్పుడు సూక్ష్మత్వమునుపొందినయెడల అట్టిరోగి బ్రతుకడని నాడీజ్ఞానులగు మునులు చెప్పెదరు.

## మాంసగతనాడీలక్షణము.

శ్లో॥ గంభీరాయాభవేన్నాడీసాభవేన్మాంసవాహినీ ।
జ్వరవేగేనధమనీసోష్ణావేగవతీభవేత్ ॥

తా॥ నాడి చాలాలోతుగా నడుచుచున్నయెడల మాంసగతనాడియని చెప్ప వలయు. జ్వరవేగము చేత నాడి ఉష్ణముగను తొందరగను నడుచును.

శ్లో॥ అసృక్పూర్ణాభవేత్కోష్ణాగుర్వీసామాగరీయసి ।
లఘ్వీవహతిదీప్తాగ్నేస్తథావేగవతీమతా ॥
చపలాక్షుధితస్యాపితృప్తస్యవహతిస్థిరా ॥

తా॥ నాడీరక్తపూర్ణముగనుండినయెడల ఉష్ణముగను మందముగను నుండును. మఱియు ఆమయుక్తముగనుండిన జడముగనుండు. దీపనముగలవానికి నాడి చులకన గాగాని వేగముగాగాని నడుచును. ఆకలికలవానికి నాడి చపలముగా నడుచును. భోజనాదులచేత తృప్తుడగువానికి నాడి స్థిరముగ నడుచును.

శ్లో॥ కామక్రోధాద్వేగవహాక్షీణాచింతాభయాన్వితా ।
మందాగ్నేఃక్షీణధాతోశ్చనాడీమందతరాభవేత్ ॥

తా॥ కామక్రోధములు కలిగియున్నమనుజునికి నాడి వేగముగానుండును. చింతయు భయమునుకల మనుజునికి నాడిక్షీణముగానుండును. మందాగ్ని క్షీణధాతువు ఇవికలవానికి నాడి మిక్కిలి మందముగానుండు.

శ్లో॥ మరణేడమ్రకాకారాభవేదేకదినేనచ ॥

తా॥ ఒకదినములోపల మరణముకలిగేయెడల అట్టివానియొక్క నాడి డమరకమువలెనుండు.

శ్లో॥ కంపతేస్పందతేఽత్యంతం పునస్స్ప్రశతిచాంగుళి ।
తామసాధ్యాంవిజానీయాన్నాడీందూరేణవర్జయేత్ ॥

తా॥ నాడి ఒకప్పుడు మిక్కిలి వణకుచును ఒకప్పుడు కొద్దిగా కదలుచును అంతలోనే కనుపడకను తిరిగి కనుపడుచును ఉండినయెడల వైద్యుడట్టిరోగమసాధ్యమనియెంచి దూరముగానుండవలయు.

శ్లో॥ స్థిరానాడీభవేద్యస్యవిద్యుద్యుతిరివేక్షతే ।
దినైకంజీవితంతస్యద్వితీయేమృత్యురేవచ ॥

తా॥ రోగియొక్క నాడి చాలాసేపు స్థిరముగానుండి మెరుపువలె ఒక్కసారి తళుక్కుమని కనుపడెనేని అట్టివాడొకదినము జీవించి రెండవదినమున మృతినొందు.

శ్లో॥ శీఘ్రానాడీమలోపేతా శీతలావాతదృశ్యతే ।
ద్వితీయేదివసేమృత్యుర్నాడీవిజ్ఞాత్రుభాషితమ్ ॥

తా॥ రోగియొక్క మలోపేతమగు నాడి శీఘ్రగతికలిగియు శీతలముగను కనుపడినయెడల రెండవదినమందు మృత్యువు సిద్ధమగునని నాడీజ్ఞానులు వచించిరి.

శ్లో॥ ముఖేనాడీవహేత్తీవ్రాకదా చిచ్ఛీతలావహేత్ ।
ఆయాతిపిచ్ఛిలస్వేదస్సప్తరాత్రంనజీవతి ॥

తా॥ వాతనాడి మిక్కిలి తీవ్రగతికలిగియుండి ఒకప్పుడు శీతలముగనుండి శరీరమునకు బంకగా చెమటబట్టినయెడల అట్టిరోగి 7 దినములోపల మృతినొందు.

శ్లో॥ దేహేశైత్యంముఖేశ్వాసోనాడీతీవ్రావిదాహినీ ।
మాసార్థంజీవితంతస్యనాడీవిజ్ఞాత్రుభాషితమ్ ॥

తా॥ శరీరమునకు చలవకలగడము ముఖమునుండి విశేషముగా శ్వాసపుట్టడము మరియు నాడితీవ్రముగా దాహమును కలిగించెనేని అట్టిరోగి 15 దినములు బ్రతుకునని నాడీజ్ఞానులు వచించిరి.

శ్లో॥ ముఖేనాడీయదాదాస్తిమధ్యేశైత్యంబహిఃక్లమః ।
యదామందావహేన్నాడీత్రిరాత్రంనైవజీవతి ॥

తా॥ వాతనాడి కదలక లోపలచల్లగానుండి పైన నాడి మందమందముగా నడిచినయెడల అట్టిరోగి మూడుదినములలో మృతినొందు.

శ్లో॥ అతిసూక్ష్మాతివేగాచశీతలాచభవేద్యది ।
తదావైద్యోవిజానీయాత్సరోగిత్వాయుషఃక్షయా ॥

తా॥ రోగియొక్క నాడి అతిసూక్ష్మముగను అతివేగముగను శీతలముగను నడచినయెడల అట్టిరోగి క్షీణాయుష్యముకలవాడని తెలియవలయు.

శ్లో॥ విద్యుద్వద్రోగిణోనాడీదృశ్యతేనచదృశ్యతే ।
అకాలవిద్యుత్పాతేవసగచ్ఛేద్యమసాదనమ్ ॥

తా॥ రోగియొక్క నాడి మెరుపువలెకనుపడి కనుపడకనుండినయెడల అట్టిరోగి మృతినొందు.

శ్లో॥ తిర్యగుష్ణాచయానాడీసర్పగావేగవత్తరా ।
కఫపూరితకంఠస్యజీవితంతస్యదుర్లభమ్ ॥

తా॥ రోగియొక్క నాడి వెచ్చనై వంకరగానడుచుచు సర్పగతికలిగి మిక్కిలి వేగముగనడుచుచు కంఠమునందు కఫముకట్టినయడల అట్టిరోగి బ్రతుకుట దుర్లభము.

శ్లో॥ చలాచలితవేగాచనాసికాధారసంయుతా ।
శీతలాదృశ్యతేయాచయామమధ్యేచమృత్యుదా ॥

తా॥ రోగియొక్క నాడి ముక్కులయొక్క శ్వాసోచ్ఛ్వాసముల ఆధారమువలన వణుకుచునేని చంచలముగనేని నడుచుచు శీతలముగనుండినయడల అట్టిరోగి వొకఝాములోపల మృతినొందు.

శ్లో॥ శీఘ్రానాడీమలోపేతామధ్యాహ్నేగ్నిసమోజ్వరః ।
దినైకంజీవితంతస్యద్వితీయేహ్నిమ్రియేతసః ॥

తా॥ రోగియొక్క త్రిదోషనాడి మలయుక్తమై శీఘ్రముగనడుచుచు మధ్యాహ్నకాలమందు అగ్నితుల్యమగు జ్వరమువచ్చినయడల అట్టిరోగి మరుదినమున మృతినొందు.

శ్లో॥ దృశ్యతేచరణేనాడీ కరేనైవాభిదృశ్యతే ।
ముఖంవికాసితంయస్యతందూరంపరివర్జయేత్ ॥

తా॥ రోగియొక్క నాడి పాదమునందు కనుపడుచు హస్తమందు కనుపడక ముఖము వికాసముగనున్నయెడల అట్టిరోగి మరణమును పొందునని వైద్యుడు తెలిసికొనవలయు.

శ్లో॥ వాతపిత్తకఫాశ్చాపిత్రయోయస్యాంసమాశ్రితాః ।
కృచ్ఛ్రసాధ్యమసాధ్యంవాప్రాహుర్వైద్యవిశారదాః ॥

తా॥ రోగియొక్క నాడియందు వాతపిత్తకఫములు ఆశ్రయించియుండినయెడల ఆరోగియొక్క రోగము కష్టసాధ్యమనియు లేక అసాధ్యమనియు వైద్యవేత్తలు వచించిరి.

వాతజ్వరనాడీపరీక్షా.

శ్లో॥ వక్రాచచపలాశీతస్పర్శావాతజ్వరేభవేత్ ॥

తా॥ వాతజ్వరమునందు నాడి వంకరగను చంచలముగను నడుచుచునుండి హస్తము చల్లగనుండును.

పిత్తజ్వరనాడి.

శ్లో॥ ద్రుతాచసరళాదీర్ఘాశీఘ్రాపిత్తజ్వరేభవేత్ ॥

తా॥ పిత్తజ్వరమునందు నాడి శీఘ్రముగను సరళముగను నడుచును.

శ్లేష్మజ్వరనాడి.

శ్లో॥ మందాచసుస్థిరాశీతాపిచ్ఛిలాశ్లేష్మలేభవేత్ ॥

తా॥ శ్లేష్మజ్వరమునందు నాడి అతిస్థిరముగను మందముగను చల్లగను మనుపుగను నడుచును.

వాతపిత్తనాడి.

శ్లో॥ వక్రాచఈషచ్చపలాకఠినావాతపిత్తజా ॥

తా॥ వాతపిత్తనాడి వంకరగను కొంచము చపలముగను కఠినముగను నడుచును.

శ్లేష్మవాతనాడి.

శ్లో॥ ఈషచ్చదృశ్యతేవ్యక్తాంమందాస్యాచ్ఛ్లేష్మవాతజా ॥

తా॥ కఫనాడి మెల్లగానడుచుచు కొంచముగ కనుపడుచు మందముగనుండు.

పిత్తశ్లేష్మనాడి.

శ్లో॥ సూక్ష్మాశీతాస్థిరానాడీపిత్తశ్లేష్మసముద్భవా ॥

తా॥ పిత్తకఫనాడి సూక్ష్మముగను చల్లగను స్థిరముగను నడుచును.

ఆరోగ్యనాడి.

శ్లో॥ హంసగాస్తై నయానాడీతస్తై వగజగామినీ ॥
ముఖప్రసన్నంచభవేత్తస్యారోగ్యంభవేత్సదా ॥

తా॥ నాడి హంసయొక్కయు ఏనుగయొక్కయు నడకకలిగి ముఖము ప్రసన్నముగానుండిన అట్టిరోగికి ఆరోగ్యముగలుగును.

శ్లో॥ యోరోగిణఃకరంస్పృష్ట్వాస్వకరంక్షాళయేద్యది ।
రోగాస్తస్యవినశ్యంతిపంకప్రక్షాళనాద్యథా ।

తా॥ రోగియొక్క నాడిని వైద్యుడుచూచి తనహస్తమును కడుగుకొన్నయెడల ఆరోగియొక్క వ్యాధులు నశించు.

## మూ త్ర ప రీ క్షా.

శ్లో॥ అథాతస్సంప్రవక్ష్యామిమూత్రస్యచపరీక్షణం ।
యేనవిజ్ఞాతమాత్రేణరోగచిహ్నంప్రకాశ్యతే ॥

తా॥ ఏమూత్రపరీక్షను వైద్యుడు తెలిసికొని రోగముఫలానిదని తెలిసికొనునో అట్టి మూత్రపరీక్షను వచించెద.

మూత్రపరీక్షాకాలము.

శ్లో॥ నిశాంతయామేఘటికాచతుష్టయేఉత్థాప్యవైద్యఃకిలరోగిణంచ ।
మూత్రంధృతంకాచమయేచపాత్రేసూర్యోదయేతత్సతతంపరీక్షేత్ ॥

తా॥ వైద్యుఁడు తెల్లవారిఝామున నాలుగుగడియల ప్రొద్దువుండగా రోగిని లేపించి గాజుపాత్రలో మూత్రమును విడిపించి ఉదయమైనవెనుక ఆమూత్రమును పరీక్షించవలయును.

## మూత్రధారణాప్రకారము.

శ్లో॥ తస్యాద్యధారాంపరిహృత్యమధ్యధారోద్భవంతత్పరిధారయిత్వా ।
సమ్యక్పరిజ్ఞాయగదస్యహేతుం కుర్యాచ్చికిత్సాంసతతంహితాయ ॥

తా॥ వైద్యుఁడు రోగిసంబంధమయిన మూత్రముయొక్క మొదటిధారను పరిహరించి రెండవధారనుమూత్రముపట్టి పరీక్షచేసి రోగకారణమును బాగుగా తెలిసికొని పిదప చికిత్సచేయవలయును.

## మూత్రవర్ణము.

శ్లో॥ వాతేచపాండురంమూత్రంసఫేనకఫరోగిణామ్ ।
రక్తవర్ణంభవేత్పిత్తే ద్వంద్వజేమిశ్రితంభవేత్ ।
సన్నిపాతేచకృష్ణంస్యాదేతన్మూత్రస్యలక్షణమ్ ॥

తా॥ వాతరోగమునందు మూత్రము తెలుపురంగుగలిగియు కఫరోగమునందు నురుగుగలిగియు పిత్తరోగమందు యెఱుపురంగుగలిగియు ద్వంద్వరోగమునందు మిశ్రవర్ణముగలిగియు సన్నిపాతరోగమునందు నలుపురంగుగలిగియునుండును.

## మూత్రపరీక్షాలక్షణము.

శ్లో॥ పరీక్షావిధివత్కార్యా రోగిమూత్రస్యతత్వతః ।
తృణేనదాపయేత్తైలబిందుంతత్రాతిలాఘవాత్ ॥

తా॥ వైద్యుఁడు రోగియొక్క మూత్రమునందు అతినేర్పుకలిగి ఒకతృణముతోటి నువ్వులనూనె బిందువునుంచవలయును.

## తైలబిందులక్షణము.

శ్లో॥ వికాశిచేత్తైలమథాశుమూత్రేసాధ్యస్సరోగీనవికాసితంచేత్ ।
స్యాత్కష్టసాధ్యస్తలిగేత్వసాధ్యోనాగార్జునేనైవకృతాపరీక్షా ॥

తా॥ మూత్రమునందుంచిన తైలబిందువు శాగా వికసించినయడల అట్టి రోగి యొక్క వ్యాధి సాధ్యము తైలబిందువ వికసించకపోయినయడల అట్టిరోగము కుదురుట కష్టసాధ్యము. తైలబిందువ మునిగినయెడల అట్టిరోగము కుదురుట అసాధ్యమని నాగార్జునుడు చెప్పెను.

శ్లో॥ నీలంచరూక్షంకుపితేచవాయా పీతారుణంతైలసమంచపిత్తే ।
స్నిగ్ధంకఫేపల్వలవారితుల్యం స్నిగ్ధోష్ణరక్తంరుధిరప్రకోపే ॥

తా॥ రోగియొక్క మూత్రము వాతప్రకోపమగునపుడు నల్లగను రూక్షము గనునుండును. పిత్తప్రకోపమగునపుడు పసుపువర్ణముగను ఎఱ్ఱగను నూనెతో సమము గనునుండును. కఫప్రకోపమందు మూత్రము బంకగను బురదనీళ్లతో సమముగను నుండును. రక్తప్రకోపమునందు వెచ్చగను బంకగను ఎరుపుగను నుండును.

అజీర్ణరోగిమూత్రలక్షణము.

శ్లో॥ మాతులింగరసాభాసంసౌవీరాభంజలోపమం ।
ప్రపాకరహితానాంచ మూత్రంచన్దనసన్నిభం ।

తా॥ అన్నము జీర్ణముకానియడల అట్టివానియొక్క మూత్రము మాదీఫలరసము వలెను పుల్లనీళ్లవలెను నీళ్లవలెను మంచిగంధముకలిపిన నీళ్లవలెను వుండును.

శ్లో॥ అజీర్ణప్రభవేరోగేమూత్రంతండులతోయవత్ ।
నవజ్వరేధూమ్రవర్ణంబహుమూత్రంప్రజాయతే ॥

తా॥ అజీర్ణమువలనకలిగిన వికారమునందు మూత్రము బియ్యపుకడిలివలెను నవజ్వరమందు మూత్రము పొగవంటిరంగుకలిగి మిగుల మూత్రముకలుగును.

శ్లో॥ పిత్తానిలేధూమ్రజలాభముష్ణం శ్వేతంమరుచ్ఛ్లేష్మణిబుద్బుదాభం।
సశ్లేష్మపిత్తేకలుషంసరక్తంజీర్ణజ్వరేస్పృక్సదృశంచపీతం ।
స్యాత్సన్నిపాతాదపిమిశ్రవర్ణంతూర్ణంవిజ్ఞేనవిచారణీయం ॥

తా॥ పిత్తవాతప్రకోపమందు మూత్రము పొగయొక్క రంగుగలిగియు నీళ్ల వలెను వెచ్చగానుండును. వాతకఫప్రకోపమందు నురుగుకట్టియు కఫపిత్తప్రకోప

మందు రక్తవర్ణముకలిగియు కలుషముగను జీర్ణజ్వరమునందు ఎరుపుగను పసపుగను సన్నిపాతమునందు మిశ్రవర్ణముగనుండునని చికిత్సకులు తెలిసికొనవలయును.

## సాధ్యమూత్రపరీక్షా.

శ్లో॥ పూర్వాశాంవర్ధతేబిందుర్యదాశీఘ్రంసుఖీభవేత్ ।
దక్షిణాశాంజ్వరోజ్ఞేయస్తథారోగ్యంక్రమాద్భవేత్ ॥

తా॥ మూత్రమునందుంచిన తైలబిందువ తూర్పుదిక్కునకు ప్రసరించిన ఆరోగి యొక్క వ్యాధి శీఘ్రముగా నివారణమగును. దక్షిణదిక్కునకు ప్రసరించినయెడల అట్టి రోగియొక్క వ్యాధి ఔషధసేవనవలన క్రమముగ నివారణమగును.

శ్లో॥ ఉత్తరస్యాంయదాబిందుప్రసరస్సంప్రజాయతే ।
అరోగితాతదానూనంపురుషస్యనసంశయః ॥

తా॥ మూత్రమునందుంచిన తైలబిందువు ఉత్తరపుదిక్కునకు ప్రసరించిన యడల ఆరోగియొక్క రోగము రహితమైనయదియ. ఇందుకు సందియములేదు.

శ్లో॥ వారుణాంప్రసరేద్బిందుస్సుఖారోగ్యంతదాదిశేత్ ॥

తా॥ మూత్రమునందుంచిన తైలబిందువ పడమటిదిక్కునకు ప్రసరించినయడల అట్టి రోగియొక్కరోగము శీఘ్రములో నివారణమగును.

## అసాధ్యమూత్రపరీక్షా.

శ్లో॥ ఈశాన్యాంవర్ధతేబిందుర్ధ్రువంమాసేనసశ్యతి ।
ఆగ్నేయాంతుతథాజ్ఞేయంనైరృత్యాంప్రసరేద్యది ।
ఛిద్రితంచభవేత్పశ్చాద్ధ్రువంమరణమాదిశేత్ ॥

తా॥ మూత్రమునందుంచిన తైలబిందువ ఈశాన్యదిశకు ప్రసరించినను ఆగ్నేయదిశకు ప్రసరించినను ఒకమాసములోపల మరణము కలుగుననియు నిర్మృతిదిశకు ప్రసరించి తూట్లుకలిగియున్నయడల అట్టి రోగికి మరణముకలుగునని వైద్యుడు తెలిసికొనవలయును.

శ్లో॥ వాయవ్యాంప్రసరేద్బిందుస్సుస్థోప్యసజీవతి ॥

తా॥ మూత్రమునందుంచిన తైలబిందువు వాయవ్యదిశకు వ్యాపించినయడల ఆరోగము సుసాధ్యమైనను ఆ రోగి జీవించడు.

శ్లో॥ వికాసితంహలంకూర్మంసైరిభాకారసంయుతం ।
కరండమండలంవాపిసరంమూర్ధవివర్జితం ।
గాత్రఖండంచశస్త్రించఖడ్గంముసలపట్టిసం ।
శరంచలగుడంచైవతథైవత్రిచతుఃపథం ।
బిందుమూపంసరోదృష్ట్వానకుర్వీతక్రియాంక్వచిత్ ॥

తా॥ మూత్రమునందుంచిన తైలబిందువు నాగేలు తాబేలు దున్నపోతు డబ్బి తలలేనినరుడు శరీరములోనిత్తునక ఆయుధము ఖడ్గము రోకలి పట్టసము బాణము దుడ్డుకఱ్ఱ 3, 4 వీధులు కలిసినత్రోవ వీటియొక్క ఆకారములుగానుండెనేని ఆరోగికి వైద్యుడు చికిత్సంజేయకూడదు.

## ఆరోగ్యమూత్రపరీక్ష.

శ్లో॥ హంసకారండతాడాగంకమలంగజచామరం ।
ఛత్రంవాతోరణంహర్మ్యంసుపూర్ణందృశ్యతేయది ।
ఆరోగ్యతాధ్రువంజ్ఞేయాతదాకుర్యాత్ప్రతిక్రియాం ॥

తా॥ మూత్రమునందుంచిన తైలబిందువు హంస నీటికోడి చెరువు తామరపువ్వు ఏనుగు వింజామరము గొడుగు తోరణము మేడ వీటియొక్క ఆకారముగా వ్యాపించినయడల ఆరోగికి ఆరోగ్యముగలుగును. కావున వైద్యుడు చికిత్స చేయవలయును.

## ప్రేతగ్రస్తమూత్రపరీక్ష.

శ్లో॥ తైలంబిందుర్యదామూత్రేచాలనీసదృశోభవేత్ ।
కులదోషేధ్రువంజ్ఞేయఃప్రేతదోషసముద్భవః ॥

తా॥ మూత్రమునందుంచిన తైలబిందువు జల్లెడవలె తూట్లుతూట్లుగా వ్యాపించెనేని ఆ రోగికి వానిగృహంబున ప్రేతదోషముచేకలిగిన జాడ్యమని తెలుసుకొనవలయును.

## భూతమూత్రపరీక్షా.

శ్లో॥ నరాకారంప్రజాయేతకింవాస్యాన్మస్తకద్వయం ।
భూతదోషంవిజానీయాద్భూతవిద్యాంతదాచరేత్ ॥

తా॥ మూత్రమునందుంచిన తైలబిందువ నరాకారముగానేని 2 తలలుగనేని వ్యాపించినయడల వైద్యుడు భూతదోషమని తెలిసి భూతచికిత్సను చేయించవలయు.

శ్లో॥ మంజిష్ఠాభంధూమ్రవర్ణంచనీలంస్నిగ్ధంమూత్రంవారితుల్యంచశీలం।
జ్ఞాత్వాచిత్తేబుద్ధిమాన్మానుషాణాంకుర్యాత్త్వంతంభేషజంరోగి
ణాంచ ॥

తా॥ మూత్రము మంజిష్ఠఛాయవలెను పొగవలెను నల్లగను స్నిగ్ధముగను నీటివలెను చల్లగనునుండినయెడల వైద్యుడు అట్టిరోగికి చికిత్స చేయవలయు.

శ్లో॥ సర్పాకారంభవేద్వాతాచ్ఛత్రాకారంచపిత్తతః ।
ముక్తాకారంభవేచ్ఛ్లేష్మణఇత్యేతన్మూత్రలక్షణం ॥

తా॥ మూత్రమునందుంచిన తైలబిందువ వాతరోగంబున సర్పాకారముగను పిత్తరోగంబున ఛత్రాకారముగను శ్లేష్మరోగంబున ముత్యముయొక్క ఆకారముకలిగియునుండును.

## పిత్తప్రకోపాదులయందు లక్షణాంతరము.

శ్లో॥ అచ్ఛంచరూక్షంచసితంచవాతాదుష్టారుణంపీతమథోఽతిపిత్తాత్ ।
స్నిగ్ధంఘనంశుక్లతరంకఫాచ్చ మిశ్రైస్తుమిశ్రంసకలస్యచిహ్నం ॥

తా॥ మూత్రము వాతాధిక్యంబున నిర్మలముగను రూక్షముగను తెలుపువర్ణము గలదిగను పిత్తాధిక్యంబున మిగులవేడిమిగలదిగను రక్తమిశ్రితపీతవర్ణముగలదిగను శ్లేష్మాధిక్యంబున స్నిగ్ధంబుగను బరువుగను మిగులతెలుపువర్ణముగలదిగను ద్వంద్వరోగంబున మిశ్రవర్ణముగలదిగను సన్నిపాతంబున సమస్తచిహ్నంబులు గలదిగనుండు.

శ్లో॥ వాతేనమణ్డాంబధ్నాతి పిత్తతోబుద్బుదాయతే ।
కఫేఽబిందుమాయాతినిమజ్జతిత్రిదోషకే ॥

తా॥ మూత్రమునందువైచిన తైలబిందువు వాతరోగంబున మండలాకారంబుగను పిత్తరోగంబున బుద్బుదాకారంబుగను కఫరోగంబున చిన్నచిన్న బిందువులుగను త్రిదోషంబున మునుంగునదిగనునుండు.

శ్లో॥ భద్రపీఠపృథుకదర్పణపద్మచ్ఛత్రశఙ్ఖసచామరవీణాః ।
కుండలాకృతియదిభవేత్తైలంరోగిణోహియస్యసతుసాధ్యః ॥
పక్షికూర్మవృషసింహసూకరైస్సర్పవానరవితానవృశ్చికైః ।
కుక్కుటైశ్చసదృశంతు రోగిణోయస్యమూత్రపతితింసగతాయుః॥

తా॥ రోగియొక్క మూత్రంబునవైచిన తైలబిందువు భద్రపీఠము అటుకులు దర్పణము పద్మము ఛత్రము శంఖము చామరము వీణ కుండలము అనువానిలో దేని ఆకారంబుగ పరిణమిల్లెడినో అట్టివానియొక్క రోగము సాధ్యంబని తెలిసికొనవలయు. మూత్రంబున వైచిన తైలబిందువు పక్షి తాబేలు వృషభము సింహము వరాహము సర్పము వానరము ధ్వజము వృశ్చికము కుక్కుటము వీని ఆకారంబుగ పరిణమిల్లెనేని ఆరోగి గతాయువు గతాయువుగలవాడని నెఱుంగవలయు.

శ్లో॥ శ్వేతధారామహోధారాపీతధారాతదాజ్వరః ।
రక్తధారాదీర్ఘరోగఃకృష్ణాచమరణంధ్రువం ॥
సౌవీరేణసమంసస్తంమాతులుఙ్గసమప్రభం ।
పానీయస్యసమం మూత్రమపక్వరసతోభవేత్ ॥

తా॥ మూత్రము తెలుపువర్ణముగను పీతవర్ణముగను మహాధారగను నగుచుండిన జ్వరంబనియు రక్తవర్ణంబుగనుండిన దీర్ఘరోగంబనియు నలుపువర్ణముగనుండిన మరణముగలుగుననియు నెఱుంగవలయు. రోగి సౌవీరతుల్యంబుగనేని మాతులుంగఫల రసతుల్యంబుగనేని శుద్ధోదకమువలెనేని మూత్రోత్సర్జనముజేసిన తన్మూత్రము అపక్వరసమువలన గలిగినదని నెఱుంగవలయు.

శ్లో॥ అధోబహుళమారక్తంమూత్రమాలోక్యతేయదా ।
పదంతితదతీసారంలింగంతులింగివేదినః ।
జలోదరసముద్భూతంమూత్రంఘృతకణోపమం ।

ఆమవాతేవసాతుల్యం తక్రతుల్యం తుజాయతే ॥
వాతజ్వరసముద్భూతం మూత్రం కుంకుమపింజరం ।
మలేనపీతవర్ణం చబహుళం చప్రజాయతే ॥

తా॥ మూత్రమున కధోభాగమున మిగుల రక్తవర్ణముగనుండిన అతిసారరోగ లక్షణమనియు నేతికణములవలెనుండిన జలోదరంబనియు వసతో సమానంబుగ నేని మజ్జిగతో సమానంబుగ నేనియుండిన ఆమవాతరోగంబనియు కుంకుమవలె నెఱ్ఱగ నేని మలముతో గలసి పీతవర్ణముగ నేని అధికముగ వెడలుచుండిన వాతజ్వరంబనియును తెలియంగవలయు.

శ్లో॥ పీతస్వచ్ఛం చజాయేత మూత్రం పిత్తోదయే సతి ।
సమధాతౌపునఃకూపజలతుల్యం ప్రజాయతే ॥
మూత్రం చకృష్ణతాం యాతి క్షయరోగాకులస్య చ ।
క్షయరోగోద్భవే తస్య తమసాధ్యం వినిర్దిశేత్ ।
ఊర్ధ్వం పీతమధో రక్తం మూత్రం వై ద్యపరస్తదా ॥
పిత్తప్రకృతిసంభూతం సన్నిపాతస్య లక్షయేత్ ।
యస్యేక్షురససంకాశం మూత్రం నేత్రే చ పింజరే ॥
రసాధిక్యం విజానీయాన్నిర్దిశేత్తస్య లంఘనమ్ ॥
పీతం చ బహుళం చైవ ఆమవాతాత్ప్రజాయతే ॥
రక్తం స్వచ్ఛం చ యస్య మూత్రం తజ్జ్వరాధిక్యలక్షణమ్ ॥
ధూమ్రవర్ణం యదా మూత్రం జ్వరాధిక్యం వదేత్తదా ॥
కృష్ణమచ్ఛం చ జానీయాత్సన్నిపాతజ్వరోద్భవమ్ ॥

తా॥ మఱియు పసపువర్ణముగలదై స్వచ్ఛముగనుండిన పిత్తజ్వరమనియు కూపజలతుల్యముగనుండిన సమధాతువనియు కృష్ణవర్ణంబుగనుండిన క్షయరోగంబనియును తెలియంగవలయు. అట్టిక్షయరోగము అసాధ్యము. మఱియు నాపాత్రలోని మూత్రము పైభాగంబున పీతవర్ణముగలదిగను అధోభాగంబున రక్తవర్ణముగలదిగను యుండిన పిత్తప్రకృతిసంభూత సన్నిపాతరోగంబనియు చెరుకురసతుల్యంబై నేత్రములు పింజరవర్ణము గలవిగ నుండిన రసాధిక్యరోగంబనియు తెలిసి లంఘనము చేయవలయు. మూత్రము పీతవర్ణముగనుండి అధికమూత్రోత్పన్నముగనుండిన ఆమవాతరోగంబనియు

తేటగలదై రక్తవర్ణముగనుండిన ఆమవాతజ్వరాధిక్యలక్షణంబనియు ధూమ్రవర్ణంబుగ నుండిన జ్వరాధిక్యలక్షణమనియు నిర్మలమై కృష్ణవర్ణముగనుండిన సన్నిపాతజ్వరంబని యును నెఱుంగదగు.

శ్లో॥ పీతంతథోపరికృష్ణచ్ఛాయంబుద్బుదసంయుతమ్ ।
మూత్రంప్రసూతిదోషేణసంశయోనాత్రవైద్యరాట్ ॥
అపీతరక్తఫేనాదిమస్తుచేక్షురసోపమమ్ ।
పిత్తేనిలేకఫేమూత్రంనిరామేచప్వరేభవేత్ ॥

తా॥ మూత్రము అధోభాగంబున పీతవర్ణముగలదిగను పైభాగంబున కృష్ణవర్ణముగలదిగనుండి బుడగలప్పళిల్లిన ప్రసూతిరోగంబని నెఱుంగవలయు. మూత్రము పిత్తరోగంబున పీతవర్ణముగలదిగను వాతరోగంబున రక్తవర్ణముగలదిగను శ్లేష్మరోగంబున నురుగుతోగలసినదిగను నిరామమున మీగడవలెను జ్వరంబున చెరకు రసంబువలెను నుండును.

శ్లో॥ తైలబిందుర్యదామూత్రేవికారాన్కురుతేస్వయమ్ ।
స్వరూపంతస్యవక్ష్యామిశుభాశుభచికిత్సితమ్ ॥

తా॥ మూత్రమునందువైచిన తైలబిందువుజెందునట్టి వికారస్వరూపంబులను వాని శుభాశుభఫలంబులను చికిత్సలను వచించెద.

## మలపరీక్ష.

శ్లో॥ త్రుటితంఫేనిలంరూక్షంధూమ్రంమలంవాతకోపతః ।
వాతశ్లేష్మవికారేచజాయతేకపిశంమలం ॥

తా॥ వాతప్రకోపమునందు మలము పెంటికలుగను నురుగుగను రూక్షముగను ధూమ్రముగనునుండును. వాతశ్లేష్మప్రకోపమునందు మలము పసపురంగుగలిగియుండును.

## పిత్తవాతాదిమలపరీక్షా.

శ్లో॥ బద్ధంసార్ద్రంసితంపీతంశ్యామంపిత్తానిలాద్భవేత్ ।
[illegible]శ్లేష్మపిత్తాదిషుదాగ్ధింబంపిచ్ఛిలం ॥

తా॥ పిత్తవాతప్రకోపమునందు మలముబద్ధమై పసపువర్ణముగను నల్లగను గట్టిగ నునుండును. శ్లేష్మపిత్తమునందు పసపు నలుపురంగులుకలిగి కొంచెము ద్రవయుక్తమై బంకగనుండును.

## త్రిదోషమల లక్షణము.

శ్లో॥ శ్యామంత్రుటితపీతాభంబద్ధం శ్వేతంత్రిదోషతః ॥

తా॥ త్రిదోషప్రకోపమగునపుడు మలము నలుపు పసపు తెలుపుకలిగి పెంటికలుగానుండి శుష్కించి పచ్చనిరంగుగలిగి బద్ధమైయుండును.

శ్లో॥ దుర్గంధశిథిలశ్చైవవిష్టోత్సర్గోయదాభవేత్ ।
తదాజీర్ణంమలంవైద్యైర్దోషజ్ఞైఃపరిభాష్యతే ॥

తా॥ అజీర్ణమునందు మలము దుర్గంధముగను శిథిలముగనునుండును.

శ్లో॥ కపిలంగుంఠియుక్తంచయదివర్చోవలోక్యతే ।
ప్రక్షీణమలదోషేణదూషితఃపరికథ్యతే ॥
సితంమహాత్పూతిగంధంమలంజ్ఞేయంజలోదరే ॥

తా॥ వాతాదిదోషములు క్షీణించినయెడల మలము పసపువర్ణముగలిగి పెంటికలుగా నుండును. జలోదరమందు మలము తెల్లఛాయగలిగియు దుర్గంధము కలిగియునునుండు.

## క్షయాదిమల లక్షణము.

శ్లో॥ శ్యామంక్షయేత్వామవాతేపీతంసకటివేదనం ।
అతికృష్ణంచాతిశుభ్రమతిపీతంతథారుణం ।
మరణాయమలంకింతుభృశోష్ణంమృత్యవేధ్రువం ॥

తా॥ క్షయరోగమునందు మలము నల్లగను ఆమవాతమునందు కటివేదనాయుక్తమై పీతవర్ణముగను మరణ సన్నిపాతకాలమునందు మిక్కిలి నల్లగను లేక మిక్కిలి తెల్లగను లేక మిక్కిలి పసపుగను లేక మిక్కిలి ఎఱ్ఱగను లేక ఉష్ణముగను విడుచును. వీటిని వైద్యుడు తెలిసికొనవలయు.

శ్లో॥ వాతస్యచమలంకృష్ణం తతఃపిత్తస్యపీతవిట్ ।
రక్తవర్ణమలంకించిన్మలం శ్వేతకఫోద్భవం ॥

తా॥ వాతప్రకోపమునందు మలము నలుపువర్ణముగలిగియు పిత్తప్రకోపము నందు పసపురంగుగాని లేక ఎరుపురంగుగాని శ్లేష్మప్రకోపమునందు తెలుపురంగుగలిగి యుండును.

## ద్వంద్వదోషాదిమల లక్షణము.

శ్లో॥ ఆమంవాస్వేతజంప్రాహుర్మిశ్రితంద్వంద్వజేవదేత్ ।
అపక్వంస్యాదిజీర్ణేతుపక్వంస్వస్థమలంభవేత్ ॥

తా॥ ద్వంద్వరోగియొక్క మలము బంకగను తెల్లగను మిశ్రమముగను నుండు ను. అజీర్ణమునందు అపక్వముగను స్వస్థునికి పక్వముగను మలము వెడలును.

శ్లో॥ అత్యగ్నౌపీడితంశుష్కంమందాగ్నౌతుద్రవీకృతం ।
దుర్గంధంచంద్రికాయుక్తమసాధ్యంమలలక్షణం ॥

తా॥ విశేషదీపనముకలవానియొక్క మలము శుష్కముగను మందాగ్నిగల వానికి ద్రవయుక్తముగనునుండును. దుర్గంధముగను చంద్రికయుక్తముగను మలము విడిచినయడల అట్టిరోగ మసాధ్యమని తెలియవలయు.

శ్లో॥ బద్ధంశ్యామంమరుతకుపితేపిత్తకోపేతుపీతంపానీయాభంసఫేనం కఫరుషీచమలం సాంద్రపాండూరవర్ణం ।
రక్తేకృద్దేనరక్తంజలనిభమథతద్ద్వంద్వకోపేద్విలింగం ।
సర్వైర్దోషైస్సరోషైర్భవతికిలమలంరోగిణస్సర్వలింగం ॥

తా॥ వాతప్రకోపమునందు మలము బద్ధముగను నల్లగను విడుచును. పిత్తప్ర కోపమునందు పసపుగను కఫప్రకోపమునందు నీటివలెను నురుగుతోకూడియు గట్టిగను తెల్లగనువిడుచును. రక్తప్రకోపమునందు మలము రక్తవర్ణముకలిగియు నీటితో సమ ముగను ద్వంద్వగుణ ప్రకోపమునందు రెండుచిహ్నములుకలిగియు త్రిదోషప్రకోపము నందు అన్నిరంగులుకలిగియు విడుచును.

మరణమల లక్షణము.

శ్లో॥ దుర్గంధంశ్యామవర్ణంమలమరుణనిభంపాండురాభంవిచిత్రం ।
మాంసాభంమేచకంతత్ప్రభవతి మరణాయైవరోగాన్వితస్య ।
విస్రంశైథిల్యయుక్తంముహురతినిపతత్సాన్ద్రదజీర్ణాచ్చవర్చో ।
దిక్సూత్రంచైతదేవంనిగదితమగదైర్లక్షణంవర్చసోపి ॥

తా॥ మలము దుర్గంధముగను నల్లగను కొంచెము యెఱ్ఱగను తెల్లగను అనేక వర్ణములు కలిగియు మాంసతుల్యముగను బూడిదెవలెను బడిచినయడల అట్టిరోగి మరణమును పొందును. అజీర్ణమునందు మలము పెంటికలుగను శిథిలముగను అనేకసార్లు విడుచును. వైద్యులగువారు ఆకారమును దిక్సూత్రలక్షణమును చూడవలయు.

జిహ్వా పరీక్షా.

శ్లో॥ జిహ్వాశీతాఖరస్పర్శాస్ఫుటితామారుతాధికే ।
రక్తాశ్యామాభవేత్పిత్తేకఫేశుభ్రాంతిపిచ్ఛిలా ॥
కృష్ణాసకంటకాశుష్కాసన్నిపాతాధికేతుసా ॥
మిశ్రితేమిశ్రితాజ్ఞేయాసర్వలక్షణవర్జితా ॥

తా॥ వాతప్రకోపమునందు నాలుక చల్లగను కరకరగను పగిలియునుండును. పిత్తప్రకోపమునందు ఎరుపు నలుపువర్ణము కలిగియు శ్లేష్మప్రకోపమందు తెలుపుగను బంకకలిగియు సన్నిపాతమునందు నలుపువర్ణములు కలిగియు ముండ్లుకలిగియు యెండియు మిశ్రరోగమునందు మిశ్రవర్ణము కలిగియునుండును.

శ్లో॥ శాకపత్రప్రభాదుష్టాస్ఫుటితారసవానిలాత్ ।
రక్తాశ్యామాభవేత్పిత్తాల్లిప్తార్ద్రాధవళాకఫాత్ ॥
పరిదగ్ధాఖరస్పర్శాకృష్ణాదోషత్రయాధికే ।
సైవదోషద్వయాధిక్యేదోషద్వితయలక్షణా ॥

తా॥ వాతప్రకోపమునందు నాలుక పెరుగు తోటకూర (మొక్కకూర)యొక్క ఆకువలెనున్న రూక్షగను పిగిలియు పిత్తప్రకోపమునందు ఎరుపునలుపువర్ణములు కలిగియు శ్లేష్మప్రకోపమునందు ద్రవయుక్తమై తెల్లగను దోషత్రయప్రకోపమువలన ద్రవములేకయు కరకరగను నల్లగనునుండును. ద్విదోషప్రకోపమునందు రెండురంగులు కలిగియునుండును.

## శబ్దపరీక్షా.

శ్లో॥ గురుస్స్వరోభవేచ్ఛ్లేష్మిణ్యస్ఫుటవక్తాచపిత్తలః ।
ఉభాభ్యాంరహితోవాతస్స్వరతశ్చైవలక్షయేత్ ॥

తా॥ శ్లేష్మప్రకోపమునందు శబ్దము (మాట) గంభీర్యస్వరముకలిగియు పిత్తప్రకోపమునందు స్ఫుటముగను వాతప్రకోపమునందు గంభీర స్ఫుటత్వములు లేక ఘర్ఘరస్వరము కలిగియుండును.

## స్పర్శపరీక్షా.

శ్లో॥ పిత్తరోగీభవేదుష్ణోవాతరోగీచశీతలః ।
పిచ్ఛిలశ్లేష్మరోగీస్యాత్త్రిలింగస్సన్నిపాతవాన్ ॥
ఆర్ద్రికస్సభవేచ్ఛ్లేష్మస్పర్శతశ్చైవలక్షయేత్ ॥

తా॥ పిత్తప్రకోపమునందు శరీరము ఉష్ణముగను వాతప్రకోపమునందు చల్లగను శ్లేష్మప్రకోపమునందు బంకగను సన్నిపాతమునందు వెనకచెప్పిన మూడుగుణములును ఆర్ద్రత్వమును కలిగియుండును. కావున వైద్యుడు పరీక్షించవలయు.

## వాతనేత్ర లక్షణము.

శ్లో॥ నేత్రంస్యాత్సవనేరూక్షం ధూమ్రవర్ణంతథారుణం ।
కోటరాంతఃప్రవిష్టంచతథాస్తబ్ధవిలోకనం ॥

తా॥ వాతప్రకోపమునందు కన్నులు రూక్షగలిగియు ధూమ్రవర్ణముకలిగియు కొంచము యెరుపురంగుకలిగియు నేత్రాంతములయందు చమటకలిగియు కన్నులు లాగినట్లుండును.

## పిత్తనేత్ర లక్షణము.

శ్లో॥ హారిద్రాఖండవర్ణంవారక్తంవాహరితంతథా ।
దీపద్వేషీసదాహంచనేత్రంస్యాత్పిత్తకోపతః ॥

తా॥ పిత్తప్రకోపమువలన కన్నులు పసపుయొక్కయు ఎరుపుయొక్కయు ఆకుపసరుయొక్కయు వర్ణములుకలిగి దీపమును చూడలేక వేడిమికలిగియుండును.

## శ్లేష్మనేత్రలక్షణము.

శ్లో॥ చక్షుర్బలాసబాహుళ్యాత్స్నిగ్ధంస్యాత్సలిలప్లుతం ।
తథాధవళవర్ణరుచజ్యోతిర్హీనంకఫాన్వితం ॥

తా॥ శ్లేష్మప్రకోపమువలన కన్నులు జిడ్డుగాను నీటితో నిండియును తెలుపు రంగుకలిగియు తేజస్సులేకయు నుండును.

## ద్విదోషత్రిదోషదూషితనేత్రలక్షణము.

శ్లో॥ నేత్రంద్విదోషబాహుళ్యాత్స్యాద్దోషద్వయలక్షణం ।
త్రిదోషలింగంసంఘేవతన్మారయతిరోగిణం ॥
త్రిదోషదూషితంనేత్రమంతర్మగ్నంభృశంభవేత్ ।
త్రిలింగంసలిలప్లావిప్రాంతేనోన్మీలయత్యపి ॥

తా॥ ద్విదోషప్రకోపమగునపుడు కన్నులకు రెండుదోషములు కలిగియుండును. మూడుదోషములు కన్నులయందు కనుపడినయడల అట్టిరోగి మృతినొందు. సన్నిపాతమునందు (వాతపిత్తశ్లేష్మప్రకోపమునందు) కన్నులీడ్చుచు ఒకప్పుడు తెరపుడు పడినను వెంటనే మూతపడుచు వుండును.

## మరణనేత్రలక్షణము.

శ్లో॥ ఏకంరౌద్రంచభుగ్నంవికసితమపరంమీలితంయస్యచక్షుస్తాగా
వాయస్యపశ్యన్నకిమపికుటిలంచోర్ధ్వగంయస్యవాస్యాత్ ।
రౌద్రంయఃప్రేక్షతేవాభ్రమయుతమథవాకంపయుక్తాగకోవా
దృష్టిర్యస్యాత్రసాధ్యోనభవతిమనుజోరోగయుక్తఃకదాచిత్ ॥

తా॥ రోగియొక్క నేత్రము తెరచియుండి భయంకరముగను వికారముగను వంకరగను చూచుచు రెండవకన్ను మూతపడి ఒకవేళ తెరచినయడల నల్లగుడ్డు కనుపడకపోయినను మరిన్ని వంకరగను పైకి ఈడిచినట్టును భయంకరముగను నల్లగ్రుడ్డును వణుకుకలిగియు చూచినయడల అట్టిరోగ మసాధ్యము.

శ్లో॥ ఏకదృష్టిరచైతన్యోభ్రమిమస్ఫురితతారకః ।
ఏకరాత్రేణనియతంపరలోకపథంవ్రజేత్ ॥

తా॥ రోగి నేత్రములయొక్క రెప్పవాల్చకనుండి భ్రమచేత నల్లగుడ్లు కదలుచు కొలుకులయందు ఉబ్బియున్నయెడల అట్టిరోగి రెండవదినమున మృతినొందు.

శ్లో॥ రూక్షంధూమాభమంతర్జ్వలదలనిలరుషిస్యాచ్చలంచక్షురుగ్రం
పిత్తాత్పీతంహరిద్రానిభమరుణనిభందీపవిద్వేషిదాహి ।
శ్వేతంస్రావితేజోరహితమతికఫాద్ద్వంద్వకోపీద్విలింగంనిర్భుగ్నం
రక్తవర్ణంకలుషమసితంభీషణంసన్నిపాతాత్ ॥

తా॥ వాతప్రకోపమందు కన్నులు రూక్షకలిగియు ధూమముతో సమముగను కన్నులయందు మంటకలిగియు చంచలముగను భయంకరముగనునుండును. పిత్తప్రకోపమందు పసపు యెరుపువర్ణముకలిగి దీపమును చూడనివ్వక మంటలు కలిగియ్యునుండును. శ్లేష్మప్రకోపమునందు కన్నులు తెలుపుకలిగియు నీళ్లుకారుచు తేజస్సులేకయుండును. ద్విదోషయుక్తమగునపుడు రెండు దోషములుకలిగియుండును. మరిన్ని సన్నిపాతదోషమునందు కన్నులు యెరుపు పసపువర్ణములుకలిగి వంకరకలిగి భయంకరముగనుండును.

శ్లో॥ ద్వంద్వదోషేభవేన్మిశ్రంతూర్ణంతూర్ణంవిలోచనం ।
శ్యామవర్ణంచనిర్భుగ్నంతంద్రామోహసమన్వితం ।
రౌద్రంచరక్తవర్ణంచభవేచ్చక్షుస్త్రిదోషతః ॥

తా॥ ద్విదోషయుక్తమగునపుడు కన్నులు ద్విదోషమిశ్రమముగనుండును. త్రిదోషయుక్తమగునపుడు నలుపుగలిగి నీరుకారుచు తంద్ర మోహము ఇవికలిగి భయంకరముగనుండి కొంచము యెరుపువర్ణము కలిగియుండును.

శ్లో॥ ఏకంచక్షుర్యదాభీమంద్వితీయంమీలితంభవేత్ ।
త్రిభిర్దినైస్తదారోగీసయాతియమమందిరం ॥

తా॥ ఒకనేత్రము భయంకరముగానుండి రెండవనేత్రము మూతపడియున్న మనుజునికి 3 దినములలో యమపట్టణము ప్రాప్తమగు.

శ్లో॥ జ్యోతిర్విహీనంసహసారోగిణోయస్యలోచనం ।
ఈషత్కృష్ణంసనియతంప్రయాతియమసాదనమ్ ॥

తా॥ రోగియొక్క నేత్రము తేజస్సులేక కొంచము నలుపుకలిగియున్నయెడల అట్టిరోగి మృతినొందు.

శ్లో॥ సరక్తంకృష్ణవర్ణంచరౌద్రంయఃప్రేక్షతేయదా ।
ఇతలింగైర్విజానీయాన్మృత్యురేవనసంశయః ॥

తా॥ ఏరోగియొక్క నేత్రములు యెరుపు నలుపురంగులుకలిగి భయంకరముగ నుండునో అట్టిరోగి మృత్యువునొందునని తెలిసికొనవలయు.

## ముఖపరీక్షా.

శ్లో॥ వాతేచమధురాస్యత్వంపిత్తేచకటుకంతథా ।
మధురామ్లంకఫేచైవసర్వలింగంత్రిదోషజే ।
అజీర్ణేఘృతపూర్ణంస్యాత్కషాయంచాగ్నిమాంద్యకే ॥

తా॥ వాతప్రకోపమునందు నోరు తియ్యగను పిత్తప్రకోపమునందు చేదుగను శ్లేష్మప్రకోపమగునపుడు తీపు పులుసుకలిగియు వాతపిత్తశ్లేష్మప్రకోపమగునపుడు అన్నిచిహ్నములుకలిగియు అజీర్ణమునందు నెయ్యివంటి రుచికలిగియు అగ్నిమాంద్యమునందు వగరుగనుసుండు.

## స్వరూపపరీక్ష.

శ్లో॥ విభుత్వాదాశుకారిత్వాద్బలిత్వాదన్యకోపనాత్ ।
స్వాతంత్ర్యాద్బహురోగత్వాద్దోషాణాంప్రబలోఽనిలః ॥

తా॥ పిత్తశ్లేష్మములలో సమర్థముగానున్నందువలనను శీఘ్రగామియగుటవలనను బలిష్ఠమగుటవలనను పిత్తశ్లేష్మములను ధిక్కరించునట్టి శక్తిగలుగుటవలనను స్వతంత్రియగుటవలనను అనేకరోగములకు ప్రభువగుటవలనను దోషములలో వాతము ప్రబలమయినదని యెరుంగవలయు.

## వాతస్వరూపలక్షణము.

శ్లో॥ ప్రాయస్తపవపవనాధ్యుషితామనుష్యాదోషాత్మకాస్స్ఫుటితధూసరకేశగాత్రాః । శీతద్విషచ్చలధృతిస్మృతిబుద్ధిచేష్టాసౌహార్ద్రదృష్టిగతయోఽపిబహుప్రలాపాః ॥

తా॥ వాతదోషదూషితులగు జనులకు అనేకదోషములుకలిగి వొడలుపగిలి దూసరవర్ణముకలిగి వెంట్రుకలు ఊడిపోయి చలికిజడియుచు ధైర్యము స్మృతి బుద్ధి చేష్ట మైత్రి దృష్టి గమనము ఇవిచెడిపోయి వుపయోగములేకుండ విశేషముగా వదురుచుందురు.

శ్లో॥ పిత్తంవహ్నిర్వహ్నిజంవాయదస్మాత్పిత్తోద్రిక్తస్తీవ్రతృష్ణాబుభుక్షుః। గౌరోష్ణాంగస్తామ్రహస్తాంఘ్రివక్త్రశ్శౌర్యోమానీపింగకేశోల్పరోమః॥

తా॥ పిత్తమే అగ్నియని యెరుంగవలయు. అగ్నివల్ల గలుగునట్టిరోగమే పిత్తరోగము. అట్టి పిత్తరోగమునందు దాహము ఆకలి శరీరమునకు గౌరవర్ణము ఇవికలిగి ఉష్ణయుక్తమై చేతులు కాళ్లు ముఖము యెఱ్ఱబడి శౌర్యము మానముకలిగి కొంచము వెంట్రుకలుకలిగి ఆవెంట్రుకలు పచ్చనైయుండును.

## శ్లేష్మస్వరూపలక్షణము.

శ్లో॥ శ్లేష్మాసోమశ్శ్లేష్మలస్తేనసౌమ్యోగూఢస్నిగ్ధశ్శ్లిష్టసంధ్యస్థిమాంసః। క్షుత్తృట్దుఃఖక్లేశధర్మైరతప్తోబుద్ధ్యాయుక్తస్సాత్వికస్సత్యసంధః॥

తా॥ శ్లేష్మము చంద్రస్వరూపము అందువలన శ్లేష్మప్రకృతి శరీరము చల్లగానుండును. అట్టివానియొక్క సంధులు గూఢముగను నునుపుగనువుండును. మఱిన్ని ఆకలి దప్పి దుఃఖము క్లేశము వీటివలన ఆయాసమును పొందజాలడు. మఱిన్ని బుద్ధిమంతుడుగను సాత్వికుడుగను సత్యవంతుడుగనునుండు.

## ఆయుర్విచారము.

శ్లో॥ భిషగాదౌపరీక్షేతరుగ్ణస్యాయుఃప్రయత్నతః।
యతఆయుషివిస్తీర్ణేచికిత్సాసఫలాభవేత్॥

తా॥ వైద్యుడు ముందుగా రోగియొక్క ఆయుషను పరీక్షించవలయు ఆయుష విస్తారముగానున్నయడల చికిత్స సఫలమగును.

## ఆయుర్లక్షణము.

శ్లో॥ సౌమ్యాదృష్టిర్భవేద్యస్యశ్రోత్రంవక్త్రంతథైవచ।
స్వాదుగంధంవిజానాతిససాధ్యోనాత్రసంశయః॥

తా॥ రోగియొక్క కన్నులు చెవులు ముఖము ఇవి సౌమ్యముగానుండి మంచివాసన తెలియుచున్నయడల అట్టిరోగి బ్రతుకును.

శ్లో॥ పాణిపాదౌచయస్యోష్ణౌదాహస్స్వల్పతరోభవేత్ ।
జిహ్వాసుకోమలాయస్యసరోగీనవినశ్యతి ॥

తా॥ రోగియొక్క కాళ్లు చేతులు వెచ్చగనుండి స్వల్పదాహయుక్తముగనుండి నాలుక అతిమృదువుగనున్నయెడల అట్టిరోగి బ్రతుకును.

శ్లో॥ స్వేదహీనోజ్వరోయస్యశ్వాసోనాసికయాసరేత్ ।
కంఠశ్చకఫహీనస్స్యాత్సరోగీజీవతిధ్రువమ్ ॥

తా॥ రోగికి జ్వరమువచ్చినపుడు చెమటలేకయుండినను. ఊపిరి ముక్కువల్ల యథాస్థితిగ వచ్చుచున్నను కంఠము కఫహీనముగానున్నను అట్టిరోగి జీవించును. (సత్యము).

## కాలవివరణము

శ్లో॥ కాలజ్ఞానంకాలయుక్తంశంభునాయత్ప్రభాషితమ్ ।
మాసైష్షడ్భిర్గుహోయోజ్ఞైర్జ్ఞాయతేమరణంనృణామ్ ॥
కాలస్తువిధోజ్ఞేయస్త్వతీతోనాగతస్తథా ।
వర్తమానస్తృతీయోన్యస్తంవక్ష్యేశృణుపుత్రక ॥
కాలఃకలయతేవిశ్వంకాలశ్చసృజతిప్రజాః ।
కాలఃకలయతేలోకాంస్తేనకాలోవిధీయతే ॥

తా॥ కాలయుక్త కాలజ్ఞానమును శ్రీమజ్జగద్రక్షకుండగు పరమేశ్వరుడు కుమారస్వామికి వచించినతెఱంగున నారుమాసంబులలో నరులకు సంప్రాప్తంబయ్యెడి మరణలక్షణంబుల దెలియంజేసెద ఓకుమారా వినుము! కాలము భూతభవిష్యద్వర్తమానంబులన త్రివిధంబులు అది ప్రపంచంబును ప్రజలను సృజింపుచుండుటంజేసి కాలంబని జెప్పంబడు.

### కాలప్రశంస.

శ్లో॥ కాలస్సృజతిభూతానికాలస్సంహరతేప్రజాః ।
కాలస్స్వపతిజాగర్తికాలోహిదురతిక్రమః ॥
కాలేదేవావినశ్యంతికాలేచాసురపన్నగాః ।

నరేన్ద్రాశ్చ పన్నగాశ్చైవ సర్వంకాలేచనశ్యతి ॥
కాలోహిభగవాన్విష్ణుస్స్వయంకాలోమహేశ్వరః ।
బ్రహ్మాపికాలరూపీచవర్తంతేకాలసంజ్ఞయా ॥

తా॥ కాలము సర్వభూతంబుల సృష్టించునదిగను ప్రజలను సంహారంబుజేయు నదిగను నిదురజెందునటుల జేయునదిగను మేల్కాంచియుండునటులం జేయునదిగ నుండు కావున కాలము నతిక్రమించుట కెవ్వానికి శక్యముగాకయుండు. మఱియు దేవతలు అసురులు సర్పములు రాజులు సకలజంతువులు కాలవశముచే నాశనము జెందెదరు. మఱియు భగవంతుడగు విష్ణువు మహేశ్వరుడు బ్రహ్మ వీరలు కాలస్వరూపులుగాన కాలులని జెప్పంబడుచున్నారు.

శ్లో॥ కాలేచఫలతేవృక్షః కాలేధాన్యంప్రజాయతే ।
కాలేచద్రవతేనారీసోపికాలోవిధీయతే ॥
విరించిదినమధ్యేతుపతంతీంద్రాశ్చతుర్దశ ।
సచాపిదినమానేషుస్వేషుగచ్ఛత్సునశ్యతి ॥

తా॥ కాలంబునుబట్టి వృక్షంబులుఫలించు. ధాన్యంబులుత్పన్నంబులగు. స్త్రీలు ఋతువంతులగుదురుగాన సకలంబునకు కాలమేకారణము. సకలజగత్సృష్టికర్తయగు బ్రహ్మదేవునియొక్క నొకదినమునందు పదునలుగురుదేవేంద్రులును తన దినములు గడచినపిదప ఆబ్రహ్మయును కాలాధీనమువలన నశించెదరు.

శ్లో॥ మానుషశ్శతజీవీచపురావేదేషుభాషితమ్ ।
వికర్మణఃప్రభావేనశీఘ్రికాలేవినశ్యతి ॥
వర్షాశ్శీతంతథావోష్ణంప్రత్యూషోమధ్యమందినమ్ ।
అపరాహ్ణస్తథారూపకాలఃకాలేనకథ్యతే ।
క్రోధలోభప్రసంగేనకాలఃక్షలతిప్రాణినామ్ ।
జ్ఞానయోగసదాభ్యాసైఃకాలోరక్షతిసర్వదా ॥

తా॥ మనుజులకు నూరువత్సరంబులాయువని వేదములయందు పఠింపబడియున్నది. అయినను పాపకర్మప్రభావముచే జనులకు శీఘ్రికాలంబుననే నాశనముగలుగుచున్నది. కాలంబువలననేగదా వర్షము శీతము గ్రీష్మము ఇత్యాదిఋతువులును ఉషః

ప్రాతర్మధ్యాహ్న సాయమాది సమస్తకాలంబులును గలుగుచున్నయవి. కాలమే కామ క్రోధలోభ మోహాదులచే మనుజులను వశింపంజేయుచున్నయది. అయినను జ్ఞానయోగాభ్యాసములచే మనుజుల రక్షింపుచున్నయది.

శ్లో॥ కాలేపానీయమశనం కాలేబీజంతువాపయేత్ ।
కాలేకర్మసముద్దిష్టం విపరీతేవిపర్యయః ॥
నాకాలేమ్రియతేకశ్చిన్నాకాలేజాయతేతథా ।
యోయస్మిన్మ్రియతేకశ్చిద్విద్ధశ్శరశ్శతైరపి ।
కాలప్రాప్తస్యకౌంతేయవజ్రాయన్తేతృణాన్యపి ।
ఏకోత్తరంమృత్యుశతంబ్రువతేవేదవేదినః ॥
తత్రైకఃకాలసంయుక్తశ్శేషాస్త్వాగంతవస్మృతాః ॥

తా॥ జలపానము ఆహారము బీజావాపము సంధ్యాదికర్మలు కాలము ననుసరించే విధింపబడియున్నవి. అట్టికాలమునందే ఆయాక్రియలజేసిన సుఖాదులకు హేతువగు. కాలమును వదిలిజేసిన నిష్ఫలంబులగు. మఱియు లోకంబున నెవ్వాడును కాల సంప్రాప్తముగాకనే జనన మరణాదుల నొందకుండు. ఆకాలంబున శతబాణంబులచే వేధించినను మరణముగలుగదు. కాలము సంప్రాప్తం బయ్యెడివానికి తృణంబే వజ్రాయుధసమానంబగు. లోకమున మృత్యువులు 101 సంఖ్యగలవని వేదవేత్తలు వచించెదరు. వారిలో నొకడు కాలమృత్యువనంబడు. తదితరులు ఆగంతుక (అకాల) మృత్యువులనంబడుదురు.

శ్లో॥ యథావర్షమకాలేషుయథాపుష్పంయథాఫలమ్ ।
యథాస్యాద్దీపనిర్వాప మకాలేమరణంతథా ॥
జలమగ్నిర్విషంశస్త్రం స్త్రియోరాచకులానిచ ।
అకాలమృత్యవో హ్యేతే తేభ్యోబిభ్యతిపండితాః ॥

తా॥ అకాలమున వర్షము వర్షించుట పుష్పఫలాదులుద్భవిల్లుట వెలుంగుచుండెడి దీపజ్యోతి అకస్మాత్తుగ జల్లారుట వీటిచందంబున మనుజులు అకాలమున మరణంబు నొందెదరు. జలము అగ్ని విషము ఆయుధంబులు స్త్రీలు రాజులు వీరు అకాలమృత్యువులని చెఱుంగవలయు. ఇట్టి అకాలమృత్యువులకు సర్వశాస్త్రసంపన్నులగు పండితులుసగా భయంబునొందెదరు.

శ్లో॥ అస్తమేతియథావాతాద్దీపస్తైలాదిసంయుతః ।
నిర్వాతారక్షణాద్దేహితథైవాగంతుమృత్యుభిః ॥
యేచాప్యాగంతవఃప్రోక్తాస్తేప్రశామంతిభేషజైః ।
వినశ్యేర్మంత్రమాంగల్యైర్యకాలమృత్యుఃప్రశామ్యతి ॥
నాయుధైర్విషవిప్రాద్యైరౌషధైరాశ్రమశ్వినా ।
ఉపక్రమేయంనభవేదకాలమరణంయది ॥

తా॥ మిగుల తైలంబులతోగూడి యతిప్రకాశమానంబై వెలుంగుచుండెడి దీపము గాలివలన రక్షింపబడకపోవుటచే నకస్మాత్తుగజల్లారుచందంబున అకాలమృత్యువువలన నకస్మాత్తుగ ప్రాణులు నశించెదరు. మఱియు పైజెప్పంబడిన ఆగంతుకమృత్యువులు చికిత్స నానావిధమంత్రజపములు నానావిధమంగళాచారములు వీట్లచే శాంతినిజెందు. ఆయుధప్రహారములు విషబాధ విప్రశాపములు వీటిచేగలిగెడు అపమృత్యువును అశ్వినీదేవతలునగా అస్త్రము ఔషధములు మంత్రము మొదలగువానిచే నివృత్తింపంజేయుట కశక్యులుగ నుండెదరు.

## శరీరక్షణోపదేశము.

శ్లో॥ సర్వమన్యత్పరిత్యజ్యశరీరమనుపాలయత్ ।
తదభావేహిభావానాంసర్వాభావశ్శరీరిణామ్ ।
నగరీనగరస్యేవరథస్యేవరథీసదా ।
స్వశరీరస్యమేధావీకృత్యేష్వవహితోభవేత్ ।
హితమభ్యస్యతఃపుంసోనాకాలేకాలవృష్ణినా ।
సంజాయతేపరామన్యోబలోత్సాహేన్ద్రియాయుషమ్ ॥

తా॥ మనుజులు సర్వకార్యంబులవిడనాడి శరీరంబును గాపాడుకొనవలయు. అటుల శరీరంబును రక్షించుటకుపేక్షచేసిరేని సర్వ శుభాశుభకార్యంబులు నశించు. నగరాధిపతి నగరమును రథికుడు రథమును గాపాడుచందంబున బుద్ధిమంతుడగువాడు స్వదేహరక్షణకృత్యములయందు మిగుల జాగరూకుండైనుండవలయు. ఇటుల శరీరసంరక్షణచేయుచుండువానికి అకాలమృత్యువు గలుగకుండుటయేగాక బలము ఉత్సాహము ఇంద్రియములు ఆయువు ఇవినగా వృద్ధినిజెందు.

శ్లో॥ హితాహారవికారాణాం సదాచారనిషేవిణామ్ ।
లోకద్వయమపేక్షాణాం జీవితంత్వమృతాయతే ॥
విరుషాన్త్వశ్శరీరస్థా న్నిత్యంసన్నిహితానరీన్ ।
జిత్వావర్జ్యానివర్జానిచిరంజీవితుమిచ్ఛతా ॥

తా॥ హితమైన ఆహారములు విహారములు శాస్త్రీయమైన ఆచారములు ఇహపరలోకాపేక్ష ఇవిగలవారియొక్క జీవితకాలము అమృతతుల్యంబుగనుండు (అనగా దీర్ఘాయుష్మంతుడుగనుండు). చిరకాలము జీవించుటకు యిచ్ఛగల బుద్ధిమంతుడు తన శరీరమందు నిత్యముగవసించెడి ప్రబలశత్రువులగు కామక్రోధాద్యరిషడ్వర్గములను జయించి వర్జించదగిన పాపకృత్యముల వర్జింపవలయు.

శ్లో॥ కాలాగ్నిర్జఠరేయాతి తస్యవాఞ్ఛాచతుర్విధా ॥
ఆహారఉదకంనిద్రా కామంచైవచతుర్థకమ్ ।
అన్నహీనాద్దహేద్ధాతుమమ్బుహీనాశ్చశోణితమ్ ।
కామహీనాద్దహేచ్చక్షురనిద్రారోగకారిణీ ॥

తా॥ కాలాగ్ని మనుజుని జఠరాంతర్గతంబై కాలమున ఆహారము ఉదకము నిద్ర కామము యీనాలుగింటిని కోరుచుండు. మఱియు నది అగ్నివిహీనమగునపుడు ధాతువును ఉదకవిహీనమగునపుడు రక్తమును కామవిహీనమగునపుడు నేత్రంబులును దహింపుచుండు దానివలన నిద్రాభంగము రోగము ఇవిసగాగలుగు.

కాలాసన్న పురుషలక్షణము.

శ్లో॥ ఆత్మాశరీరంశ్రుత్యుక్తమంతరాత్మామనోభవేత్ ।
పరమాత్మాభవేత్ప్రాణఃపంచతత్వానిధారయేత్ ॥
వర్ణహీనంయదాత్మానం పశ్యత్యాత్మాకథంచన ।
నాసౌజీవతిలోకేస్మిన్ కాలేనైవావలోకితః ॥

తా॥ శరీరము ఆత్మయనియు మనస్సు అంతరాత్మయనియు ప్రాణము పరమాత్మయనియు వేదమునందు జెప్పంబడియె. మఱియు నాప్రాణము పంచతత్వాత్మకమగు నీశరీరమును ధరించియుండు మనుజుడు బుద్ధిచే తనశరీరమును వర్ణవిహీనము (అనగా వికృతముగ) నెపుడు జూచెడినో నపుడుకాలముచే వీక్షింపబడినవాడై లోకాంతరగతుండగు.

## పాక్షికమృత్యులక్షణము.

శ్లో॥ ప్రకృతిస్థస్సదాజీవోవికృతించైవగచ్ఛతి ।
సచవై కాలదృష్టస్తుక్రియతేజ్యోతివర్జితః ॥
సంపూర్ణోవహతేసూర్యస్సోమశ్చైవనదృశ్యతే ।
పక్షేనజాయతేమృత్యుఃకాలజ్ఞానేనభాషితమ్ ॥

తా॥ స్వభావముగనుండెడి జీవుడు వికృతిజెందెనేని యామనుజుడు మృత్యువుచే జూడబడినవాడై జ్యోతిర్విహీనుడుగ జేయంబడు అదియెటులనిన సూర్యుడు సంపూర్ణముగను చంద్రుడు అసంపూర్ణముగను గానంబడియెదరో అట్టిపురుషు డొక పక్షములో మృత్యువుపాలగునని కాలజ్ఞానులు వచించెదరు.

శ్లో॥ యస్యవస్త్రేస్వకేగన్ధోవాగ్గాత్రాననయోరపి ।
తస్యార్ధమాసికంజ్ఞేయంయోగినాందేవిజీవనమ్ ॥

తా॥ ఎవనియొక్క వస్త్రమునందును శరీరమునందును ముఖమునందును దుర్గంధపువాసన గలిగియుండునో అట్టివాడు యోగియైనను పదియైదుదినంబులలో మృత్యువుపాలగు.

శ్లో॥ మాసేనషడ్భిర్మాసైశ్చపక్షేణైవత్రిమాసికమ్ ।
పంచరాత్రేణమాసైకంమృత్యోశ్చైవహిలక్షణమ్ ॥
ఉదయస్సూర్యమార్గేణ చంద్రేణాస్తగతంయది ।
దదాతిగుణసంఘాతంవిపరీతేవిపర్యయః ॥

తా॥ ఒకమాసము ఆఱుమాసములు ఒకపక్షము మూడుమాసములు అయిదుమాసములు ఐదుదినములు ఈక్రమంబున గలిగెడు మృత్యులక్షణంబుల వచించెద. ఎవనికి సూర్యచంద్రుల యుదయాస్తమనంబులు సూర్యచంద్రకళలు క్రమంబుగ గనుపడునో అట్టివానికి శుభముగలుగుననియు యవి విపరీతములయ్యెనేని విపరీతములగుననియు నెఱుంగవలయు.

శ్లో॥ చంద్రోదయేయదాసూర్యశ్చంద్రస్సూర్యోదయేతథా ।
అశుభంహానిరుద్వేగశ్శుభంసర్వంనిజోదయే ॥

తా॥ చంద్రోదయమున సూర్యకళయు సూర్యోదయంబున జంద్రకళయు నగుపడిన అశుభము హాని భయము అనునవి గలుగు. సహజంబుగ నగుబడిన శుభంబు గలుగు.

సూర్యచంద్రస్వరలక్షణము.

శ్లో॥ శుక్లపక్షే భవేద్వామా కృష్ణపక్షే చ దక్షిణా ।
ఉభయోస్త్రిదినాన్యాహుర్దృశ్యతే చంద్రసూర్యయోః ॥
పంచభూతాత్మకో దీపశ్శశిస్నేహేన సంయుతః ।
వాతస్య రక్షితా సూర్యస్తేన జీవః స్థిరో భవేత్ ॥
ఆత్మా దీపశిఖా తేన ఆయుస్స్నేహకలామతః ।
కాలః కజ్జళసంభారో వర్తిరేషా తనుస్మృతా ॥

తా॥ సూర్యచంద్రులకళలలో శుక్లపక్షంబున వామకళయు కృష్ణపక్షంబున దక్షిణకళయు మూడుదినంబులు క్రమముగ నగుపడెనేని నట్టివాడు మృతుడగునని తెలియంగవలయు. పంచభూతాత్మక శరీరరూపదీపము చంద్రుండను చమురుతోగూడి సూర్యునిద్వారా గాలిచే జల్లారకుండునటుల రక్షింపబడుటచే జీవుడు స్థిరంబుగనుండును. జీవరూపదీపమునకు ఆయువు చమురుగానున్ను కాలమనునది దీపముయొక్క ధూమముగానున్ను దేహము వత్తిగానున్ను వుండును.

మానసలక్షణము.

శ్లో॥ శబ్దేన్వర్శేత థా ఘ్రాణే స్వాదే రూపే తథైవచ ।
మనశ్చహరతే యేన రహా మానస ఉచ్యతే ॥
తీర్థస్నానే గురౌదేవే ధ్యానే దానే తపస్సుచ ।
మనశ్చహరతే యత్ర కర్తా మానస ఉచ్యతే ॥
కాయా భవనమధ్యే చ శాంతిః కమానికారణమ్ ॥
మనశ్చహరతే యేన రహా మానస ఉచ్యతే ॥

తా॥ శబ్దము స్పర్శ వాసన రుచి రూపము వీటిలో దేనియందు మనస్సు క్రమంబుగ లయించునో అది రహమానసమనంబడు. తీర్థస్నానము గురువు దేవత ధ్యానము దానము తపస్సు వీటిలో దేనియందు మనములయించెడినో అది మానసకర్త యనంబడు. కాయమనెడు గృహవిషయమై శాంతికర్మలుజేయు నిమిత్తము మనస్సు దేనియందు లయించెడినో యది రహోమానసమనంబడు.

## ప్రాణసంఖ్యాప్రమాణము.

శ్లో॥ ఏకవింశతిసహస్రాణిశతానీషట్తథైవచ ।
నిశాహేచలతఃప్రాణస్సచకాలేవినశ్యతి ॥
కాయాభవనమధ్యేచమారుతోరక్షపాలకః ।
ప్రవేశేదభిఃప్రోక్తోద్వాదశాంగుళనిర్గమే ॥
మనశ్చైవస్థిరంకుర్యాన్మనసామారుతస్థిరః ।
మారుతేనస్థిరంతేజఃకాలస్సదృశ్యతేతథా ॥

తా॥ మనుజులకు ప్రతిదిన మహోరాత్రములయందు 21600 ఉచ్ఛ్వాసంబులు గలిగియుండు. అట్టి యుచ్ఛ్వాసంబులు కాలాధీనంబై నశించు. దేహంబనెడు గృహమధ్యంబున వాయువు రక్షపాలకుడుగనుండు. అట్టివాయువు ప్రవేశకాలంబున దశాంగుళప్రమాణంబుగలదిగను నిర్గమనకాలంబున ద్వాదశాంగుళప్రమాణంబు గలదిగనుండు. పురుషునకు మనంబు స్థిరంబుగనుండపలయు. అందుచే వాయువును వాయువుచే నగ్నియును స్థిరంబుగనుండు. అట్టి అగ్నిసదా కాలమునే నిరీక్షింపుచుండు.

## వాతాదిస్వరలక్షణము.

శ్లో॥ వాతఃపిత్తంకఫశ్చైవజ్ఞాయతేధాతుదర్శనాత్ ।
భేదాభేదనిబంధేసకాలజ్ఞానేసథాధ్రువమ్ ॥
గంభీరశ్చభవేచ్ఛ్లేష్మాస్ఫుటవక్త్రాచపిత్తలః ॥
ఉభాభ్యాంహీనతోవాతస్తేషాంచస్వరలక్షణమ్ ॥
త్వరితాజ్ఞోభవేత్పిత్తేవాతేచైవతుమందతా ।
స్థిరగామీభవేచ్ఛ్లేష్మాగతేరేతచ్చచేష్టితమ్ ॥

తా॥ భేదాభేదయుక్త కాలజ్ఞానవిషయమయి వాతపిత్తకఫరూప సమస్తధాతు దర్శనముచే నిశ్చయజ్ఞానముగలుగు. శ్లేష్మయుక్తపురుషుడు గంభీరస్వరముగలవాడుగను పిత్తయుక్తపురుషుడు స్పష్టమైనమాటలుగలవాడుగను వాత యుక్తపురుషుడు సమస్వరముగలవాడుగనుండు. ఉభయధాతుయుక్తపురుషుడు స్ఫుటమందస్వరయుక్తుడుగనుండు. పిత్తయుక్తపురుషుడు త్వరితగతిగలవాడుగను వాతయుక్తపురుషుడు మందగతిగలవాడుగను శ్లేష్మయుక్తపురుషుడు స్థిరగతిగలవాడుగనుండు.

## వాతాదిప్రకృతిదేహలక్షణము.

శ్లో॥ పిత్తరోగీభవేదుష్ణో వాతరోగీచశీతలః ।
శ్లేష్మరోగీతథార్ద్రశ్చ దేహస్తస్యైవలక్షణమ్ ॥
ఆదౌచజాయతేరోగస్సాధ్యోఽసాధ్యస్తథైవచ ।
సకలంనిష్ఫలంచాపిజీవితంమరణంధ్రువమ్ ॥
సకలంకాలహీనంచనిష్ఫలంకాలసంయుతమ్ ।
ఇంద్రియాణాంవికారైశ్చజ్ఞాయతేమృత్యుజీవితమ్ ॥

తా॥ పిత్తరోగికి దేహముష్ణంబుగను వాతరోగికి శీతలముగను శ్లేష్మరోగికి ఆర్ద్రంబుగనుండు. రోగోద్భవ కాలంబుననే రోగసాధ్యాసాధ్యంబుల నెఱుంగందగు. కాలజ్ఞానవిహీనునికి సకలకార్యంబులు నిష్ఫలంబులగుటయేగాక జీవించువాని మరణము నకునగా వాడే కారణంబుగనుండు. మఱియు కాలము ఇంద్రియముల వికారము వీని నెఱింగినవానికి జీవితమృత్యుజ్ఞానంబులునగా గలుగు.

## రోగనివృత్తిలక్షణము.

శ్లో॥ పాణిపాదాభవేదుష్ణాదీర్ఘస్స్వల్పస్తథైవచ ।
జిహ్వాకోమలతాంయాతిసరోగీనవినశ్యతి ॥
స్వేదహీనోజ్వరోయస్యనాసాశ్వాసఃప్రవర్తతే ।
కంఠోఽపికఫహీనస్తుసరోగీజీవతిధ్రువమ్ ॥

తా॥ హస్తపాదంబులుష్ణంబులుగను దీర్ఘంబులుగను లేక స్వల్పంబులుగను నాలుక మృదువుగనుండెడి రోగికి నాశనముగలుగకుండు. ఎవనికి స్వేదహీనంబగు జ్వర

ముజనించి ముక్కులనుండి శ్వాసంబువెడలుచు కంఠము కఫహీనంబుగనుండెడినో నట్టి రోగి నిశ్చయంబుగ జీవించు.

శ్లో॥ నిద్రాసౌఖ్యంభవేద్యస్యశరీరస్యోద్యమస్తథా ।
ఇంద్రియాణిప్రసన్నానిసరోగీనవినశ్యతి ॥
చైతన్యంసకలంయస్యగంధస్వాదుస్ఫుటంభవేత్ ।
కలాపూరితకంఠస్తుసజీవేన్నాత్రసంశయః ॥

తా॥ ఎవనికి నిద్రాసౌఖ్యంబును శరీరమునందుత్సాహంబును ఇంద్రియంబులు ప్రసన్నంబులుగనుండెడినో నట్టిరోగి నాశమునుజెందకుండు ఎవని సర్వేంద్రియములు చైతన్యయుక్తంబులై గంధాస్వాదగ్రహణశక్తిగలవిగనుండెడినో కంఠనాదము క్షీణింపకుండెడినో నట్టివాడు నిశ్చయంబుగ జీవించు.

అసాధ్యలక్షణము.

శ్లో॥ అనిలోయాతిపిత్తస్యపిత్తంయాతికఫంగృహే ।
కఫశ్చకంఠమాయాతిదుర్లభంతస్యజీవితమ్ ॥
రాత్రౌదాహంభవేద్యస్యదివాశీతంచజాయతే ।
కఫపూరితకంఠస్తుతస్యమృత్యుర్భవేద్ధ్రువమ్ ॥
హీనస్వరోభ్రష్టగుదఃకాసశ్వాససమాకులః ।
హిక్కాశోషసమాయుక్తఃకుక్షిశూలీనజీవతి ॥

తా॥ ఎవనికి వాతము పిత్తస్థానంబును పిత్తము కఫస్థానంబును కఫము కంఠస్థానంబును జెందెడినో నట్టిరోగిజీవించుట దుర్లభంబని తెలియంగవలయు. ఎవని శరీరము రాత్రులయందుష్ణంబుగను పగటియందు శీతలంబుగను కంఠము కఫపూరితంబుగనుండెడినో నట్టివానికి నిశ్చయముగ మరణముగలుగు. ఎవడు హీనస్వరముగలవాడుగను భ్రష్టగుదముగలవాడుగను కాస శ్వాసయుక్తుడుగను ఎక్కిళ్లు శోషగలవాడుగను కుక్షిశూలగలవాడుగనుండెడినో నట్టివాడతిశీఘ్రంబుగ మృత్యువుపొందునని తెలియంగవలయు.

శ్లో॥ హృదయంచతథానాసాపాదౌపాణీచశీతలౌ ।
శిరస్తాపోభవేద్యస్యతస్యమృత్యుర్భవేద్ధ్రువమ్ ॥
పూపాభమరుణశ్యావహారితంనీలపీతకమ్ ।
ష్ఠీవతిశ్వాసకాసార్తోనజీవతిఅతస్వరః ॥
అంగకంపోగతేర్భంగోవర్ణభ్రంశ స్తథైవచ ।
గంధాస్వాదంనజానాతిసగచ్ఛేద్యమశాసనే ॥

తా॥ ఎవనికి హృదయంబును నాసికయును హస్తపాదంబులును శీతలయుక్తంబై శిరస్సు తాపయుక్తంబుగనుండెడినో యట్టివాడు నిశ్చయంబుగ యమపురి నివాసి యగు. ఎవనికి కారిమూయునపుడు కఫము అపూపంబువలెను ఎఱుపువర్ణముగలదిగను శ్యామవర్ణముగలదిగను ఆకుపసుపువర్ణముగలదిగను నీలవర్ణముగలదిగను పీతవర్ణము గలదిగనుండెడినో హీనస్వరము శ్వాస కాస ఇవిగలిగియుండెడినో అట్టివాడు మృత్యువుపాలగునని నెఱుంగవలయు. ఎవని అంగము కంపయుక్తముగను గతిభంగము గలదిగను వర్ణహీనముగనుండెడినో ఎవనికి వాసన రుచి తెలియకుండెడినో అట్టివాడు కృతాంత గేహ ప్రవిష్టుండగునని ఎఱుంగవలయు.

శ్లో॥ శిరస్స్వేదోభవేద్యముఖేశ్వాసఃప్రవర్తతే ।
అష్టనాడీఅనిర్వాహంసోఽపికాలేనవీక్షితః ।
అరుంధతీంధ్రువంచైవవిష్ణోస్త్రీణిపదానిచ ।
ఆయుర్హీనానపశ్యంతిచతుర్థంమాతృమండలం ।
అరుంధతీభవేజిహ్వాధ్రువోనాసాగ్రమేవచ ।
భ్రువౌవిష్ణుపదేవిద్యాత్తారకామాతృమండలమ్ ।

తా॥ ఎవని శిరస్సు స్వేదయుక్తంబుగను ముఖము శ్వాసయుక్తంబుగను అష్టనాడులకనిర్వాహంబుగను గలిగియుండెడినో యట్టివాడు కాటికికాలుచాచియున్నాడని నెఱుంగవలయు. అరుంధతి ధ్రువుడు విష్ణుసంబంధమైన మూడుపదంబులు మాతృమండలము ఇవి ఆయుర్హీనులకగుపడవు. అరుంధతియన జిహ్వాయనియు ధ్రువుడన నాసాగ్రమనియు విష్ణుపదంబన కనుబొమలనియు మాతృమండలమన కంటిపాపయనియును నెఱుంగవలయు.

శ్లో॥ మతిభ్రంశస్తలేద్వాణీ ధనురంధ్రీంసవీక్షతే ।
రాత్రౌచంద్రద్వయంవాపి రాత్రౌచంద్రదివాకరౌ ।
దివావాతారకాచంద్రంరాత్రౌవ్యోమవితారకమ్ ।
యుగపచ్చచతుర్దిక్షుశక్రకోదండమండలమ్ ॥
భూదరోభూధరాగ్రేవా గంధర్వనగరాలయమ్ ।
దివానిశిచంద్రశంబురేతేపంచత్వహేతవః ॥

తా॥ మనుజునికి మతిభ్రంశముగలుగుట మాటలడ్డపడుట వింటిరంధ్రము గనుబడకయుండుట రాత్రియందు చంద్రద్వయంబగుపడుట సూర్యచంద్రులగుబడుట పగటియందు చంద్రనక్షత్రములగాంచుట రాత్రియందు నక్షత్రదర్శనము లేకుండుట ఏకకాలంబున నలుదిక్కులయందును ఇంద్రధనస్సులగుబడుట పర్వతమునందైనను పర్వతాగ్రమునందైనను గంధర్వనగరమును దర్శించుట పగటియందు చంద్రునిగాంచుట రాత్రియందు శంబూకాకారసముదాయచంద్రుని వీక్షించుట ఇవి మరణచిహ్నంబులని తెలియంగందగు.

## నక్షత్రలగ్నతిథివారసాధ్యలక్షణము.

శ్లో॥ అహిర్బుధ్న్యే త్రిష్యసంజ్ఞేఽర్యపర్క్షే ప్రాజాపత్యాదిత్యయోస్సప్తరాత్రాత్ । రోగోత్పత్తిర్జాయతేయూనవానాంనిస్సందిగ్ధం జల్పితంగర్గముఖ్యైః । నందాచవృశ్చికేమేషే భద్రామిథునకన్యయోః॥ కర్కాటైవజయామాసింహేకుంభేరిక్తాతుపేస్సృషే ॥ ధనోమీయుగ్మేచమకరేపూర్ణాతిథిరుదాహృతా ॥ విరుద్ధోరోగిణాంమానవంనందాదిస్తిథిపంచకః ॥

తా॥ ఉత్తరాభాద్ర పుష్యమి పుబ్బ రోహిణి పునర్వసు నక్షత్రములయందు జనించిన రోగము నేడుదినంబులలో నిస్సంశయముగ నివర్తించు. నందయను పాడ్యమి షష్ఠి ఏకాదశి తిథులయందు మేషవృశ్చికలగ్నంబులయందు భద్రయను విదియ సప్తమి ద్వాదశితిథులయందు మిథున కన్యాలగ్నములయందు జయయను తదియ అష్టమి త్రయోదశితిథులయందు కర్కాటకసింహాలగ్నంబులయందు రిక్తయను చవితి నవమి

చతుర్దశితిథులయందు తులావృషభ కుంభలగ్నంబులయందు పూర్ణయను పంచమి దశమి పౌర్ణమితిథులయందు ధనుర్మీనమకరలగ్నంబులయందు రోగముజనించిన రోగికి మిగుల సంకటమును గలుగంజేయు.

శ్లో॥ భౌమకృత్తికయోర్నందాభద్రాచబుధనాగయోః ।
జయాగురౌమఘాయాంచరిక్తాశుక్రధనిష్ఠయోః ।
భరణ్యాంశనివారేచపూర్ణాచతిథిపంచకే ।
యోగేస్మిన్వ్యాధిరుత్పన్నఃనసిధ్యతికదాచనా ॥

తా॥ భౌమవారము కృత్తికానక్షత్రము నందయనుతిథులు బుధవారము ఆశ్లేషానక్షత్రము భద్రతిథులు గురువారము మఘానక్షత్రము జయయనుతిథులు శుక్రవారము ధనిష్ఠానక్షత్రము రిక్తయనుతిథులు శనివారము భరణీనక్షత్రము పూర్ణతిథులు వీనిసంయోగ దినములయందు రోగపీడితుడైనవాడు కాలుని నిలయంబున కేగు.

నక్షత్రైర్మృత్యురోగ - నివృత్తోర్లక్షణము.

శ్లో॥ స్వాత్యాశ్లేషార్ద్రపూర్వాసుశాక్రే రోగోత్పత్తిర్జాయతేయస్య పుంసః । తద్వైభిషజ్యంనైవదేయదకదాపిజ్ఞాత్వామృత్యుంవైద్యరాజేనపుంసా ॥ వాద్యుత్పత్తిర్యస్యపౌష్ణేసమైత్రేప్రాణత్యాగం జాయతేతస్యకృఛాత్ । వైశ్వేసౌమ్యేరోగయుక్తిస్తుమాసాద్వింశత్యాస్స్యాద్వాసరాణాంమఘాసు ॥ పక్షార్ధస్తే వాసవేసద్విశాఖే వేమూలాశ్విన్యోర్వగ్నిధిష్ట్యేనవాహాత్ ॥

తా॥ స్వాతి ఆశ్లేష ఆర్ద్ర పూర్వాషాఢ పూర్వాభాద్ర పూర్వఫల్గుణీ జ్యేష్టనక్షత్రములజనించిన రోగము రోగిని మార్తాండనందనునిగృహంబున కేగునటులంజేయునని నెరింగి వైద్యుండు చికిత్సను వర్జింపవలయు. రేవతి అనూరాధ నక్షత్రములజనించిన రోగము రోగికి కడుకష్టంబులుగలుగంజేసి వానిప్రాణంబు లపహరింపంజేయు. ఉత్తరాషాఢ మృగశిర నక్షత్రంబుల జనించిన రోగము ఏకమాసములోను మఘానక్షత్రమున జనించినరోగము ఇరువదిదినంబులలోను హస్త ధనిష్ఠ విశాఖ నక్షత్రంబుల జనించినరోగము ఒకపక్షములోను మూల అశ్విని కృత్తికా నక్షత్రంబుల జనించిన రోగము తొమ్మిదిదినంబులలోను నివృత్తియగు.

## నక్షత్ర జన్మఫలము.

శ్లో॥ కృత్తికాయాంయదావ్యాధిరుత్పన్నోభవతిస్వయమ్ ।
నవరాత్రంభవేత్పీడాత్రిరాత్రంరోహిణీషుచ ॥
మృగశీర్షేసప్తరాత్రమార్ద్రాయాంముచ్యతేఽసుభిః ।
పునర్వసౌతథాపుష్యేసప్తరాత్రేణమోచనమ్ ।
నవరాత్రంతథాశ్లేషేశ్మశానాన్తంమఖాసుచ ।
ద్వామాసౌపూర్వఫల్గుణ్యాముత్తరాసుత్రిపంచకమ్ ॥
హస్తేచసప్తమేమోక్షశ్చిత్రాయామర్ధమాసకమ్ ।
మాసద్వయంతథాస్వాత్యాంవిశాఖేదినవింశతి ।
మైత్రేచైవదశాహానిజ్యేష్ఠాయామర్ధమాసకమ్ ।
మూలేనజాయతేమోక్షః పూర్వాషాఢేత్రిపంచకమ్ ।
ఉత్తరేదినవింశత్యాద్వామాసౌశ్రవణేతథా ।
ధనిష్ఠాయామర్ధమాసోవారుణేచదశాహకమ్ ॥
పూర్వాభాద్రపదేదేవిఊనవింకతివాసరమ్ ॥
త్రిపక్షంచాహిర్బుధ్న్యేచరేవత్యాందశరాత్రకమ్ ।
అహోరాత్రంతథాశ్విన్యాంభరణ్యాంతుగతాయుషః ।
ఏవంక్రమేణజానీయాన్నక్షత్రేషుయథోచితమ్ ॥

తా॥ కృత్తికానక్షత్రమున బనించినరోగము తొమ్మిదిరాత్రులును రోహిణీ నక్షత్రమున జనించిన రోగము మూడురాత్రులును మృగశీర్షానక్షత్రమున జనించిన రోగము ఏడురాత్రులును పీడించు. ఆర్ద్రానక్షత్రమున జనించిన రోగంబును పునర్వసు పుష్యమి నక్షత్రములజనించిన రోగంబును రోగి ప్రాణంబులబోకడుచు. ఆశ్లేష మఖనక్షత్రములజనించిన రోగము తొమ్మిదిరాత్రులలో రోగిని శ్మశానవాసిగజేయు. పుబ్బ ఉత్తరనక్షత్రముల జనించినరోగము క్రమముగ రెండుమాసములు లేక ఒకపక్షములో రోగిని వైపస్వతపట్టణంబున కేగునటులంజేయు. హస్తానక్షత్రమున జనించిన రోగము ఏడుదినంబులలోను చిత్తానక్షత్రమున జనించినరోగము అర్ధమాసంబులోను స్వాతీనక్షత్రమున జనించినరోగము రెండుమాసంబులలోను విశాఖనక్షత్రమున జనించినరోగము ఇరువదిదినంబులలోన అనూరాధానక్షత్రమున జనించినరోగము పది

దినంబులలోను జ్యేష్ఠ మూలా నక్షత్రముల జనించినరోగము అర్థమాసంబులోను పూర్వాషాఢానక్షత్రమున జనించినరోగము ఒకపక్షములోను ఉత్తరాషాఢానక్షత్రమున జనించినరోగము ఇరువదిదినంబులలోను శ్రవణనక్షత్రమున జనించిన రోగము రెండుమాసంబులలోను ధనిష్ఠానక్షత్రమున జనించినరోగము అర్థమాసంబులలోను శతభిషానక్షత్రంబున జనించినరోగము పదిదినంబులలోను పూర్వాభాద్ర నక్షత్రమున జనించిన రోగము పందొమ్మిదిదినంబులలోను ఉత్తరాభాద్రనక్షత్రమున జనించిన రోగము మూడుపక్షంబులలోను రేవతీనక్షత్రమున జనించినరోగము పదిదినంబులలోను అశ్వినీనక్షత్రమున జనించినరోగము ఒకదినంబులోను నివర్తించు. భరణీనక్షత్రమున జనించిన రోగము కాలాంతకునికడ కేగునటులంజేయు. కావున పూర్వోక్తఅశ్విన్యాది నక్షత్రముల జనించినరోగము శుభాశుభఫలంబుల యాక్రమంబుగ నెఱుంగందగు.

## జ్వరాది కాలనిర్ణయము.

శ్లో॥ అథాతస్సంప్రవక్ష్యామిజ్వరకాలాదినిర్ణయమ్ ।
కాలంశాస్త్రేణవిజ్ఞాయచికిత్సాంశాన్తిమాచరేత్ ॥

తా॥ ఇక జ్వరాదులకాలన్ణిర్ణయమును వచించెద. కాలమును శాస్త్రిమువలన నెఱింగి తదనుగుణ్యముగ చికిత్సలను నక్షత్రాది శాంతులను జేయువలయు.

శ్లో॥ రేవత్యామనురాధాయాంజ్వరోబహుదినంభవేత్ ।
మూలాశ్వినీకృత్తికాసుద్విమాసంరోగసంభవః ॥

తా॥ రేవతి అనోరాధ నక్షత్రములజనించిన జ్వరము రోగిని బహుదినములు పీడించు. మూల అశ్విని కృత్తిక నక్షత్రముల జనించినరోగము రెండుమాసంబులు పీడించు.

శ్లో॥ భరణ్యాంశ్రవణేచిత్రశతతారాసుయోజ్వరః ।
ఏకాదశందినంజ్ఞేయంమఖాయాంవింశతిస్తథా ।

తా॥ భరణి శ్రవణ చిత్త శతభిషనక్షత్రముల జనించినరోగము పదునోకండు దినంబులును మఖానక్షత్రమున జనించినరోగము ఇరువదిదినంబులును పీడించు.

శ్లో॥ ధనిష్టాసువిశాఖాసుహస్తేపంచదశావధి ।
అథామృతోత్తరాషాఢానక్షత్రేమాససమ్మితే ॥

తా॥ ధనిష్ఠ విశాఖ హస్త నక్షత్రముల జనించినరోగము పదియేనుదినంబులును మృగశీర్ష ఉత్తరాషాఢ నక్షత్రములజనించినరోగము ముప్పదిదినంబులును పీడించు.

శ్లో॥ ఉత్తరాయాంతథాపుష్యేరోహిణ్యాంచపునర్వసౌ ।
తథోత్తరాభాద్రపదానక్షత్రేసప్తవాసరాః ॥

తా॥ ఉత్తర పుష్యమి రోహిణి పునర్వసు ఉత్తరాభాద్ర నక్షత్రముల జనించినరోగము నేడహోరాత్రంబులు పీడించు.

శ్లో॥ ఆర్ద్రాశ్లేషత్రిపూర్వాసుజ్యేష్ఠాస్వాతౌతదంకతః ॥

తా॥ ఆర్ద్ర ఆశ్లేష పుబ్బ పూర్వాషాఢ పూర్వాభాద్ర జ్యేష్ఠ స్వాతి నక్షత్రముల రోగపీడితుడైనవానికా నక్షత్రమెన్నవదియో అన్నిదినంబులుపీడించు.

శ్లో॥ జన్మనక్షత్రరోగాప్తౌమండలందేహపీడనమ్ ॥
జన్మవారేజ్వరోత్పత్తౌమండలార్థంవినిర్దిశేత్ ॥

తా॥ జన్మనక్షత్రమున జనించినరోగము నలుపదిదినంబులును జన్మవారమున జనించినరోగము నిరువదిదినంబులును పీడించు.

శ్లో॥ తథాజన్మదినేరోగోమాసంపీడయతిధ్రువమ్ ।
రోగోత్పత్తౌజన్మలగ్నేద్వాదశాహంబుధావిదుః ॥

తా॥ జన్మదివసమున జనించినరోగము ముప్పదిదినంబులును జన్మలగ్నమున జనించినరోగము పండ్రెండుదినంబులును పీడించు.

శ్లో॥ అమాయాంభరణీయోగేషాణ్మాసంజ్వరమాదిశేత్ ।
కృష్ణాష్టమ్యాంమందవారేరోగంపర్వాంతమాదిశేత్ ॥

తా॥ భరణీనక్షత్రయుక్తామావాస్యయందు జనించినరోగము ఆఱుమాసంబులును స్థిరవారయుక్త కృష్ణాష్టమియందు జనించిన రోగము పైనెల పున్నమవరకును పీడించు.

శ్లో॥ కృష్ణాంగారచతుర్దశ్యాంసార్ధమాసేమహాభయమ్ ।
భానువారేగ్నినక్షత్రేద్వావింశద్దినమీరితమ్ ॥

తా॥ మంగళవారముతో గూడిన కృష్ణచతుర్దశియందు జనించిరోగ మొకటిన్న నెల కడుభయంకరముగనుండు. కృత్తికానక్షత్రయుక్త భానువారంబున జనించిన రో ము ఇరువదిదినంబులు పీడించు.

శ్లో॥ విపన్నైధనతారాసుసప్తాహంరోగపీడనమ్ ।
త్రయోవింశతినక్షత్రేజన్మనక్షత్రతోగదః ॥

తా॥ విపత్తార నైధనతార అనువానియందు జనించినరోగము ఏడుదినంబులు ఇరువదిమూడవనక్షత్రమున జనించినరోగము జన్మనక్షత్రమువలె నలువదిదినంబుల పీడించి తదనంతరము నివృత్తించు.

శ్లో॥ త్రయోవింశద్దినాంతస్యాద్విషనాడీషుయోగదః ।
అష్టాహంబాధతేవ్యాధిర్మహాపాతేషుపాక్షికీ ॥

తా॥ ఇరువదిమూడవతిథి త్యాజ్యకాలము అనువానియందు జనించినరోగము ఎనిమిదిదినంబులును మహాపాతయందుజనించినరోగము పదియేనుదినంబులును పీడించు.

శ్లో॥ రోగోద్భవోరాహుకాలేత్రిదినంక్రూరమాదిశేత్ ।
శనిస్థితర్క్షరోగాప్తౌశేషోవత్సరావధి ॥

తా॥ రాహుకాలమున జనించినజ్వరము మూడుదినములు మిగుల క్రూరముగ నుండును. శనియున్ననక్షత్రమున జనించినరోగము నొకవత్సరము పీడించు.

శ్లో॥ అంగారకస్థితర్క్షేషుసార్ధమాసంవినిర్దిశేత్ ।
పంచాఙ్గశుద్ధిసంయుక్తేక్షిప్రారోగ్యంవినిర్దిశేత్ ॥

తా॥ అంగారకుడున్న నక్షత్రమున జనించినజ్వరము నలుబదియైదుదినంబులు పీడించు. పంచాంగశుద్ధిగల దివసమున జనించినజ్వరము కడుశీఘ్రముగ నివర్తించు.

శ్లో॥ శుభర్క్షేక్షేమతారాదౌగురుచంద్రబలాన్వితే ।
వ్యక్తవ్యంసులభారోగ్యందీర్ఘమాయుర్వినిర్దిశేత్ ॥

తా॥ శుభనక్షత్రమునందును క్షేమతారయందును గురుచంద్రబలములు గలిగి యుండునపుడును జనించిన రోగము సులభముగ నివృత్తించినదై దీర్ఘాయుష్మంతునిగ జేయు.

శ్లో॥ వ్యాయామవనితాసంగయుద్ధచిన్తాభయాదిభిః।
క్షౌరాభ్యంజనవాతాద్యై ర్దీర్ఘజాడ్యంవినిర్దిశేత్ ॥

తా॥ వ్యాయామము స్త్రీసంగమము యుద్ధచింత భయము మొదలగువానివలనను ఆయుష్కర్మము అభ్యంజనము వాతకాలము అనువానివలనను జాడ్యము దీర్ఘమగు.

శ్లో॥ కీటలగ్నే విషప్రాప్తౌ సార్పర్క్షే రాహుకాలగే।
విషంహంతినసందేహో జీవేద్గురుబలోదయే ॥

తా॥ వృశ్చికలగ్నము ఆర్ద్రానక్షత్రము రాహుకాలము అనువానియందు సర్పదష్టముగలవాడు నిస్సంశయముగ మృత్యువుపాలగు. అయినను వానికి బృహస్పతి శుభుడుగానుండిన ఒకానొక సమయమున వాడు జీవించు.

శ్లో॥ సాంఘాతికఃకుంభలగ్నే మందాంశేగుళికోదయే।
భరణ్యామష్టమర్క్షేచకాలచ్ఛిద్రంనజీవతి ॥

తా॥ కుంభలగ్నమందును శనిఅంశయందును గుళికకాలమందును భరణి ఆశ్లేష నక్షత్రములయందును సంధ్యాకాలయందును వాంతిభ్రాంతికలిగిన మృత్యువును జెందు.

శ్లో॥ క్షిత్యుత్కర్షేత్రిమార్గేచశ్మశానేకంటకద్రుమే।
అకస్మికానాంరోగాణాముత్పత్తౌభయమాదిశేత్ ॥

తా॥ పెంటదిబ్బకు సమీపంబునను మూడుమార్గము లొకటిగగూడిన స్థలంబునను కాల్చినపీనుగుయొక్క యెముకల దిబ్బయందును ముండ్లచెట్టుకు సమీపంబునను అకస్మాత్తుగ జనించినరోగంబులు భయంకరములుగనుండు.

శ్లో॥ దుస్స్వప్నందుర్నిమిత్తేచగోదేవద్విజదూషణే।
పైశాచికేసముత్పన్నేరోగస్తంబాధతేచిరాత్ ॥

తా॥ దుస్స్వప్నము దుశ్శకునము గోబ్రాహ్మణ దేవతలదూషణ పిశాచములు సోకుట మొదలగువానివలన జనించినరోగము దీర్ఘకాలము బాధించు.

శ్లో॥ మసూరికాస్ఫోటకాదౌగండదర్దురపేటికా।
గుల్మగ్రంథిషుతాదాత్ముజ్వరంతత్కాలమాదిశేత్ ॥

తా॥ మసూరి స్ఫోటకాదులు కణుతులు దద్దులు గుల్మము గ్రంథి గాయము అనువానిచే జనించిన జ్వరము తత్కాలమున మాత్రము బాధించి నివృత్తియగు.

శ్లో॥ బాలగ్రహనిమిత్తేతుషోడశాహంచముచ్యతే ।
జ్వరాదిసర్వరోగాణామేవంకాలాదినిర్ణయః ॥

తా॥ బాలగ్రహము సోకుటచే జనించు జ్వరము 16 దినంబులు బాధించు ఇటుల జ్వరాదిసర్వరోగకాలనిర్ణయంబుల నెఱుంగందగు.

దూతలక్షణము.

శ్లో॥ ఆతురోపక్రమార్థంచదూతోయాతిభిషగ్గృహే ।
తస్యపరీక్షణంకార్యంయేనసంలక్ష్యతేగదః ॥
ఏకోదూతస్సమాగచ్ఛేద్గృహీత్వావంశయష్టికామ్ ।
మరణంతస్యజానీయాద్దివసేసప్తమేతథా ॥
ఏకోదూతస్సమాగచ్ఛేద్బ్రవీతిచపునఃపునః ।
లిఖితంమరణంతస్యయామైకేనచనిశ్చితమ్ ॥

తా॥ రోగివద్దనుండి వైద్యునికడకేతెంచిన దూతను వైద్యుడు పరీక్షించి రోగ సాధ్యాసాధ్యంబుల నెఱుంగందగు. రోగివద్దనుండి ఏతెంచినదూత వెదుకఱ్రచేత బూని ఒంటరిగనేతెంచిన రోగి ఏడవదినంబున మృత్యువు పాలగునని నెఱుంగవలయు. మరియు దూత వైద్యునికడకేతెంచి తావచ్చినపనిని పలుమారుజెప్పుచుండిన నారోగి ఒకయామంబులో నిశ్చయముగ యమునిగృహంబు జేరునని నెఱుంగపలయు.

శ్లో॥ ద్వౌత్రయశ్చైవచత్వారఃవృద్ధస్త్రీబాలషండకాః ।
దుష్టవాక్యప్రవక్తారోరక్షాగ్నియమదిక్స్థితాః ॥
శస్త్రిణోధారిణోభస్మపాషాణాస్థిసమాశ్రితాః ।
ఏవంగనచ్ఛేత్సుభిషగ్యశఃప్రాప్తిర్నవిద్యతే ॥

తా॥ వైద్యునిపిలుచుటకు ఇద్దరు లేక ముగ్గురు లేక నలుగురుదూతలేగినను స్త్రీ బాల వృద్ధ నపుంసకులేగినను అమంగళకరవాక్యముల వచియింపువారేగినను అగ్ని యమ నిర్రృతిదిక్కులలో దేనియందైనను దూతనిలువంబడి వైద్యుని బిలచినను ఆయుధములచేబూనిగాని బూడిదె రాయి ఎముకలు వీనిపై నిలువంబడిగాని వైద్యుని బిలచినను అశుభంబుగలుగు గావున వైద్యుండట్టిరోగికడకేగంజనదు.

శ్లో॥ షండాంధమూకబధిరంరుజపీడితంబాలం స్త్రియంచవికలంతృషించదీనమ్ । శాంతక్షుధాతురమసిభ్రమితంచజీర్ణం దూతంనశస్తమపి వేదవిదోవదంతి ॥

తా॥ నపుంసకుడు అంధుడు మూగవాడు చెవిటివాడు రోగపీడితుడు బాలుడు స్త్రీ అంగవైకల్యముగలవాడు దప్పిగలవాడు దీనుడు బడలినవాడు ఆకలిగొన్నవాడు ఆతురుడు చిత్తభ్రమగలవాడు కృశించినవాడు ఇట్టివారలు దూతకృత్యమునందప్రశస్తులని వేదవేత్తలు వచించెదరు.

శ్లో॥ అగ్రభాగేపిచాయుష్యంకష్టంపృష్ఠవిభాగతః ॥
వామేచశిరసఃపీడామృత్యుర్భవతిదక్షిణే ।
ఖరోష్ట్రమహిషారూఢఃప్లుతగద్గదకృచ్ఛవాక్ ।
సాపణ్డీస్త్రీచరోగార్తోనశస్తాదూతకర్మణి ॥
నపుంసకస్త్రీబహువశ్చనగ్నాఃపాశాయుధాఃపాణిస్పృషాణినోవా ।
సితేతరైశ్చాపిపరైర్వృతాజ్ఞాస్నిగ్ధార్ద్రదేహాస్తృణమండినశ్చ ।
నన్యాసినఃపాణివిమర్దకాశ్చఘూర్ణనప్రశ్నస్తరచ్ఛేదినశ్చ ।
నఖద్విజోర్ధ్వాంగకఘర్షశీలాశ్చోకాకులాశ్చాపిగదాభిభూతాః ।
చర్మాదిహస్తాపరిషేకకాస్తైతథైవభోజనస్యనిశానుచాపి ।
పృష్ఠప్రదేశేదిశిచాపియామ్యామృచ్ఛన్యభాగేభిమజాంవిశేషాత్ ।
దూతాస్సనూయా న్తినిరర్థమేతేవిపర్యయావ్యాధితప్రశ్నతోవా ।
వైద్యస్యగేహేనహితస్యదృష్టాజీవస్థితిర్జ్ఞానిభిరత్రముక్త్వాః ।
ఆర్ద్రాశ్లేషామఖామూలజ్యేష్టాసుభరణీషుచ ।
ఉపసర్పంతియేవైద్యందూతాస్తేచాపిగర్హితాః ॥

తా॥ వైద్యునివద్దికేతెంచినదూత వానికగ్రభాగంబుననిలచిన రోగి కాయుర్వృద్ధిగలుగుననియు పృష్ఠభాగంబుననిలచిన రోగియొక్క రోగము కష్టసాధ్యంబనియు ఎడమపార్శ్వంబున నిలచిన రోగికి శిరోరోగముగలదనియు దక్షిణపార్శ్వమున నిలచిన మృత్యువుగలుగుననియు నెరుంగవలయు. గాడిదె ఒంటె దున్నపోతు ఇవి వాహనములుగగలవాడై నేతెంచినవాడు ఓయని దీర్ఘధ్వనితో వైద్యునిబిలుచువాడు ప్లుతము

గను దగ్గుత్తికెపడువాడు కష్టవాక్కుగలవాడు పాషండుడు స్త్రీరోగపీడితుడు నపుంసకుడు అనేక స్త్రీలు దిగంబరుడు పాశాయుధుడు శృంగములచే బూనినవాడు తెలుపువర్ణముతప్ప ఇతరవర్ణవస్త్రములధరించినవాడు తైలముబూసికొనినవాడు కనుపుమోపును శిరమున ధరించినవాడు షండులు సన్యాసులు హస్తమును పిసికికొనువాడు ముక్కు స్పృశించువాడు రాళ్లను భేదించువాడు నఖ దంత ఊర్ధ్వాంగముల ఘర్షణసేయుచుండువాడు దుఃఖించువాడు రోగపీడితుడు చర్మాదులు హస్తమునధరించినవాడు తడివస్త్రమును ధరించియుండువాడు ఇట్టివారలు దూతకృత్యమునకప్రశస్తులు. దూత వైద్యుడు భుజించునపుడే తెంచినను రాత్రియందు వైద్యునిబిలుచుటకే తెంచినను వైద్యునిగృహమునకే తెంచిన దూత వానికి పృష్ఠభాగంబుననేని దక్షిణదిక్కునయందేని ఉచ్చస్థానంబుననేని నిలువంబడియుండినను రోగమును విపరీతంబుగ వంచించినను రోగి కాలాంతకుని సదనంబునప్రవేశించి యతనిభటులతో యుల్లాసంబుగ సల్లాపము సలుపుచుండునని బుద్ధిమంతుడగు వైద్యుండెరుంగవలయు. ఆర్ద్ర ఆశ్లేష మఖ పూర్వ జ్యేష్ట భరణినక్షత్రములయందు వైద్యునిపిలుచుట కేగెడుదూతలే నిందితులు.

శ్లో॥ శుక్లాంబరాఃఫలకరాఃదూతాశ్చప్రియవాదినః ।
అద్వితీయాశ్చభక్తాశ్చవైద్యాహ్వానేప్రపూజితాః ॥

తా॥ శ్వేతవస్త్రధారులును పుష్పఫలాదులచే బూనినవారును ప్రియాలాపంబుల బలుకువారును తానువచ్చునపుడు మరియొకనిబిలుచుకొనివచ్చువారును వైద్యభక్తులునునగు దూతలుప్రశస్తులు.

## వైద్యోత్తమ శకునములు.

శ్లో॥ భేరీమృదంగమృదుమర్దళశఙ్ఖవీణావేదధ్వనిర్మధురమంగళగీత
ఘోషాః ॥ పుత్రాన్వితాచయువతీసురభిస్సవత్సాధౌతాంబరశ్చ
రజకోభిముఖప్రశస్తః ॥

తా॥ రోగివద్దికేగుచుండునెడ వైద్యుడు భేరీ మృదంగ మర్దళ శంఖ వీణా వీటి మ్రోతలనాకర్ణించినను వేదధ్వని మధురమై మంగళకరముగనుండు గాన ధ్వని ఇవి వానికభిముఖంబై వచ్చుటనుగాంచినను పుత్రునితోగూడిన స్త్రీ దూడతోగూడిన ఆవు ధౌతవస్త్రియుక్తరజకుడు వీరలెదుర్కొనినను ప్రశస్తము.

శ్లో॥ రాజావిప్రస్సుహృద్వేశ్యాకుమారీవరవర్ణనీ ।
దధిచందనదూర్వాశ్చగజాశ్వసురభివృషాః ॥
మద్యమాంసంమధుఛత్రంచామరాక్షతదర్పణాః ।
గోరోచనలతాపుష్పవస్త్రాలంకరణానిచ ॥
రౌప్యతామ్రమణిస్వర్ణప్రతిమాగోమయధ్వజాః ।
మృత్తికాశస్త్రశాకానిఘృతమీనప్రదీపకాః ।
ఫలంవర్ధాయనంవీణాపంకజానినృపాసనమ్ ।
దృష్ట్వైతానిసరఃకుర్యాద్దక్షిణేనవిశేషతః ॥

తా॥ రోగికడకేగు వైద్యునికభిముఖంబుగ రాజు బ్రాహ్మణుడు స్నేహితుడు భోగముచాన కన్యక ఉత్తమస్త్రీ వీరేతెంచినను దధి చందనము గరిక ఏనుగ గుఱ్ఱము ఆవు వృషభము మద్యము మాంసము తేనె ఛత్రము చామరము అక్షతలు అద్దము గోరోచనము లతలు పుష్పవస్త్రాద్యలంకారవస్తువులు రౌప్యము తామ్రము మణులు స్వర్ణము ప్రతిమలు గోమయము ధ్వజము మృత్తిక ఆయుధములు శాకములు ఘృతము మత్స్యములు మండుచుండెడి అగ్ని ఫలములు వర్ధాయనము వీణె పద్మము సింహాసనము అనునవి నేతెంచినను లేక వానికిదక్షిణపైపుగ నేతెంచినను శుభశకునంబులని తెలియంగ వలయు.

## వైద్యునికి నిషిద్ధశకునములు.

శ్లో॥ తృణతుషఫణిచర్మాంగారకార్పాస పంక్తైర్లవణగుడవసాస్థికీ బత్రై
రౌషధాశ్చ । రిపువికసితధాన్యంవ్యాధిమభ్యక్తతైలైః పతితజటిల
ముండోన్మత్తవార్తైర్నసిద్ధః॥ రజోభస్మతుషాంగారగుడతైలకలో
పలాః । గుర్విణీతైలసిక్తాంగనగ్నముండరజస్వలాః॥ ముక్తకేశాస్థి
కార్పాసమార్జారోరగపన్నగాః। రోదనంమార్గదూనశ్చవాహనస్య
పలాయనమ్॥ ద్వారఘాతోదృశానందీర్ఘవిలంబఃపాణిపాదయోః ।
ఏతానిదుర్నిమిత్తానివర్జనీయానిసర్వదా ॥

తా॥ వైద్యునికభిముఖముగ తృణములు ఊక సర్పము చర్మము పొగయుచుండు నిప్పు ప్రత్తి అడుసు లవణము బెల్లము మాంసములోని క్రొవ్వు ఎముకలు

నపుంసకుడు తైలము ఔషధములు శత్రువు విష్ఠ కృష్ణధాన్యములు రోగి తైలలేపనము జేసికొనియుండువారు మజ్జిగ పతితుడు జడలుధరించినవాడు బోడితలవాడు పిచ్చివాడు ఎదురుగాలి ఇవిఏతెంచిన అశుభముగలుగు. మరియు దుమ్ము బూడిదె ఊక నిప్పు బెల్లము తైలఘటము క్రూరకర్మలసేయువాడు రాళ్లు గర్భిణీస్త్రీ తైలస్నిగ్ధుడు దిగంబరుడు తలబోడిగలవాడు రజస్వలలు తలవిరియబోసుకున్నవాడు ఎముకలు ప్రత్తి మార్జాలము సర్పములు సర్పభేదములు ఓరుమనిరోదనము సేయువాడు అపానవాయువు విడుచువాడు వాహనమునుండివిడబడి బరుగులిడు అశ్వాదులు ఇవిఏతెంచినను వానికి ద్వారబంధనాభిఘాతగలిగినను అంధుడు కుంటివాడు మొండివాడు ఏతెంచినను దుశ్శకునంబులు కావున అట్టితరి రోగికడకు వైద్యుండేగంజనదు.

. ఆయుష్యములేనివానికగుపడనివి.

శ్లో॥ అరుంధతీంధృవంచైవవిష్ణోస్త్రీణిపదానిచ ।
ఆయుర్హీనానపశ్యంతి చతుర్థంమాతృమండలం ॥

తా॥ అరుంధతి ధ్రువుడు విష్ణుసంబంధమయిన మూడుపదములు మాతృమండలము ఈనాలుగును ఆయువులేనివానికగుపడవు. ఇక అరుంధతి మొదలగు నాలుగు నామంబుల యర్థమును వక్కాణించెద.

శ్లో॥ అరుంధతీభవేజ్జిహ్వాధ్రువోనాసాగ్రమేవచ ।
విష్ణుస్తుభ్రూద్వయోర్మధ్యంభ్రూద్వయంమాతృమండలం ॥

తా॥ అరుంధతియనగా నాలుకయనియు ధ్రువంబనగా నాసికాగ్రంబనియు విష్ణుసంబంధమయిన మూడుపదంబులనిన రెండుకనుబొమలకు మధ్యభాగంబనియు మాతృమండలంబనగా రెండుకనుబొమలనియు నెరుంగవలయు.

శ్లో॥ నాసాగ్రంభ్రూయుగంజిహ్వాంముఖంచైవనపశ్యతి ।
కర్ణఘోషంనజానాతిసగచ్ఛేద్యమమందిరం ॥

తా॥ కావున నాసికాగ్రము రెండుకనుబొమలు నాలుక ముఖము ఇవి ఎవనికగుపడవో అట్టివాడును చెవులుమూసికొనిన నెవనికి కర్ణఘోషము వినుపించదో అట్టివాడును యమునిమందిరంబున కేగును.

శ్లో॥ నవభ్రూశ్చపంచచక్షుష్యస్సప్తకర్ణస్త్రినాసికా ।
జిహ్వాచదినమేకంతుకాలచిహ్నందినేదినే ॥

తా॥ తనకనుబొమల కనుగొననివాడు 9 దినంబులలోను కనుబొమల మధ్యభాగము కనుగొననివాడు 5 దినంబులలోను కర్ణఘోషము వినుపించనివాడు 7 దివసంబులలోను నాసికాగ్రముకనుగొననివాడు 3 దినంబులలోను నాలుకకనుగొననివాడొకదినంబునను వైవస్వతుని నగరనివాసియగును గావున ప్రతిదినంబును కాలచిహ్నంబును బరీక్షించుచుండవలయు.

శ్లో॥ అకస్మాద్వృద్ధిభవేత్ స్థూలోహ్యకస్మాచ్చకృశోభవేత్ ।
అకస్మాదన్యథాభావేషణ్మాసైశ్చవినశ్యతి ॥

తా॥ అకస్మాత్తుగ శరీరము బలిసినను లేక శుష్కించినను కోపములేనివానికి కోపముజనించినను కోపముగలవానికి శాంతిగలిగినను ఇట్టివాడారుమాసంబులలో మృత్యువుపాలగు.

శ్లో॥ రసనాయాఃకృష్ణభావోముఖంకుంకుమసన్నిభం ।
జిహ్వాస్పర్శంనజానాతిదుర్లభంతస్యజీవితం ॥

తా॥ నాలుక నలుపువర్ణముగను ముఖము కుంకుమవర్ణముగను జిహ్వాస్పర్శజ్ఞానము లేనిదిగనునుండనేని ఇట్టిలక్షణంబులుగల రోగి జీవించుట దుర్లభంబని నెరుంగవలయు.

రోగివద్దకుపోవుటకు లగ్నశుద్ధి.

శ్లో॥ సూర్యేకేంద్రేజ్వరమతితరాంశీతవాతంచచంద్రే ।
భౌమేరక్తంజ్ఞగురుభృగవోరోగనిర్ముక్తికాఃస్యుః ॥
మందేమందంశిథిలమరణంజీవనాశంచరాహౌ ।
లగ్నంశేస్తంగ్రహబలయుతంయాతువైద్యోవిలోక్య ॥

తా॥ వైద్యుడు రోగివద్దకేగునపుడేలగ్నమో యాలగ్నంబునకు కేంద్రస్థానంబున సూర్యుడుండిన రోగి మిగుల జ్వరయుక్తుడనియు చంద్రుడుండిన కఫవాతంబనియు అంగారకుడుండిన రక్తరోగంబనియు బుధ గురు శుక్రులుండిన రోగవిహీనుండని

యు శనియుండిన బహుకాలము రోగముచే బీడింపబడి సజీవుండగుననియు రాహు వైనను కేతువైనను యుండిన శీఘ్రింబుగ మరణంబునొందుననియు నెరుంగవలయు. గాన వైద్యుండవశ్యంబుగ లగ్నంబును గ్రహబలంబును దెలిసికొని రోగివద్దకేగవలయు. (కేంద్రం బనగా) లగ్నంబునకు 1, 4, 7, 10 వ స్థానంబులు.

## మరణచిహ్నములు.

శ్లో॥ రాత్రౌదాహోభవతిచదివాజాయతేశీతలత్వం ।
కంఠేశ్లేష్మాస్ఫురసవదనఃకుంకుమాకారనేత్రే ॥
జిహ్వాకృష్ణాభవతిచసదాస్థూలసూక్ష్మాచనాడీ ।
తద్వైభైషజ్యంస్మరణమధునారామరామేతినామ ।

తా॥ రాత్రియందు దాహముకలుగుట పగలు శీతలముగనుండుట కంఠమునందు కఫముకట్టుట ముఖము వివర్ణముగనుండుట నేత్రములు రక్తవర్ణముగనుండుట నాలుక నలుపువర్ణముగలిగియుండుట యొకసమయంబున నాడియుబ్బియుండునటులను మఱి యొకసమయంబు నతిసూక్ష్మముగను నడుచుట ఇట్టిలక్షణములుగలరోగి జీవించుట దుర్లభముగాన నారోగి రామరామయని రామస్మరణజేయుచుండిన యిదియే యౌష ధంబని నెఱుంగవలయు.

శ్లో॥ సౌమ్యాదృష్టిర్వదతివిమలంహస్తపాదౌసదోష్ణౌ ।
స్వల్పోదాహస్ఫురసవదనఃకోమలాయస్యజిహ్వా ॥
నాసాశ్వాసోవహతిసరళంస్వేదహీనోజ్వరోసౌ ।
సాధ్యోరోగీభవతినియతంవైద్యభైషజ్యయోగ్యః ॥

తా॥ సౌమ్యదృష్టి నిర్మలమైనమాటలు స్వల్పదాహము ఇవి కలిగియుండుట హస్తపాదములు ఉష్ణంబుగనుండుట యేపదార్థము భుజించినను రుచిగానుండుట జిహ్వ మృదువుగనుండుట సరళముగ శ్వాసము వెలువెడలుట స్వేదహీనమైన జ్వరము గలుగుట ఈలక్షణంబులుగల రోగికి చికిత్సచేయదగును.

శ్లో॥ శుష్కాస్యశ్శ్రమకోష్ఠోప్యసిత రదతశ్శీతనాసాప్రదేశః ।
శోణాక్షశ్చైకనేత్రోలుళితపదకరశ్శ్రోత్రపాతిత్వయుక్తః ॥

శీతశ్శ్వాసోథవోష్ణశ్శ్వసనసముదయశ్శీతగాత్రప్రకంపః ।
సోద్వేగోనీప్స్విపంచఃప్రభవతిమనుజస్సర్వథామృత్యుకాలే ॥

తా॥ ఏరోగికి నోరెండుట పెదిమలు దంతములు నలుపువర్ణముకలిగియుండుట శ్వాసచల్లగావచ్చుట కాళ్లు చేతులు కీళ్లు పదలినట్లుండుట చెవులు ప్రేలాడునట్లుండుట శ్వాసము శీతలంబుగనైనను ఉష్ణంబుగనైనను వచ్చుట శరీరంబెత్తివేయుట కర్తవ్యాకర్తవ్యజ్ఞానములేకయుండుట నిట్టిలక్షణంబులుగలిగెనేని ఆరోగికి మృత్యువాసన్నంబైనదని నెఱుంగవలయు.

శ్లో॥ స్వేదోలలాటేహిభవేన్నరస్యశీతార్ద్రితస్యాపినుపిచ్ఛిలస్య ।
కంఠస్థితోయస్యనయాతిపక్షోమార్గంయమస్యైతిగృహంసమర్త్యః॥

తా॥ ఏరోగికి శరీరమంతయు శీతలమునొంది ముఖమునందు చెమటయును దేహంబున జిగటయును కంఠస్థితంబగు కఫము బయలువెడలకను లోపలదిగకయుండునో అట్టివాడు శమనందనునిపురంబున కతిశీఘ్రంబుగ నేగు.

శ్లో॥ యస్యనిద్రాసుఖేనస్యాత్ శరీరంనోద్యమంభవేత్ ।
ఇంద్రియాణిప్రసన్నానిసరోగీనైవనశ్యతి ॥

తా॥ ఏరోగికి సుఖముగ నిద్రయును పనియందు ఆసక్తియు చక్షురాదింద్రియములను ప్రసన్నత్వంబునుగలుగునో అట్టివ్యాధిపీడితుడు రోగవిహీనుడై సుఖంబును జెందు.

శ్లో॥ శరీరశీలమోర్యస్యప్రకృతిర్వికృతిర్భవేత్ ।
తదరిష్టంసమాసేనవ్యాసతశ్చనిబోధమే ॥

తా॥ ఏరోగికి శరీరము స్వభావము వీటిగుణములు విపరీతంబుగతోచునో అట్టిరోగికికలిగెడు అనిష్టమును సంక్షేపముగను విస్తారముగ చెప్పెద వినుడు.

శ్లో॥ శృణోతివివిధాన్ శబ్దాన్దివ్యానరీతంశృణోతివా ।
నశృణోతివదమానాస్స్వ్యాంగంచదంతినతాంకువం ॥

తా॥ ఆరోగ్యార్థిగ వినవిడి ఇతరులకు వినబడని శబ్దములు నానావిధంబులుగ వినుపించినను లేక శబ్దమే వినిపించకపోయినను అట్టివాని ఆయువు శీఘ్రంబుగ మృత్యువుపాలగునని ఎఱుంగవలయు.

శ్లో॥ యస్తూష్ణమివగృహ్ణాతిశీతముష్ణంచశీతవత్ ॥
ఉష్ణగాత్రోతిమాత్రంయోభృశంశీతేనకంపతే ।
ప్రహారంనైవజానాతియోగచ్ఛేదన్యథాపివా ।
పాంసునేవావకీర్ణానియశ్చగాత్రాణిమన్యతే ॥
వర్ణాన్యతావారాజ్యేవాయస్యగాత్రేభవంతిహి ।
స్నాతానులిప్తంయంచాపిభజంతేనీలమాక్షికాః ।
విపరీతేనగృహ్ణాతిరసాన్యశ్చోపయోజితాన్ ।
యోవారసాన్నంసంవేత్తిగతాయుంతంప్రచక్షతే ॥

తా॥ ఎవనికి ఉష్ణంబుగనుండు పదార్థమును శీతలంబుగను శీతలంబుగనుండు పదార్థమునుష్ణముగను శరీరంబున తాపముకలిగియుండునపుడు విశేషచలియును సెవనైనను తన్ను ప్రహరించినదెలియకను ప్రహరింపకుండునపుడు ప్రహరించినటులను శరీరకాంతి భేదింపబడినటులను శరీరంబున ధూళిధూసరంబులు గ్రమ్ముకొనియుండునటులను స్నానంబొనర్చి శరీరంబునకు గంధంబలదికొనిన తన్ను జోరీగలు కరచినటులను తీపుపదార్థములు చేదుగను చేదుపదార్థములు తీపుగను పదార్థములరుచి తెలియకను ఈలక్షణంబులు నెవనికిగలిగియుండునో అట్టివాడు యమపురనివాసియగునని ఎఱుంగవలయు.

శ్లో॥ సుగంధంవేత్తిదుర్గంధం దుర్గంధంచసుగంధవత్ ।
గృహ్ణాతియోన్యథాగంధంశామ్యేద్దీపోయథానలః ॥

తా॥ ఎవడు దుర్గంధంబును సుగంధంబువలెను సుగంధంబును దుర్గంధంబువలెను లేక గంధంబులను విపరీతంబుగను గాంచునో అట్టివాడు భగభగమండుచుండెడి యగ్నిసక స్మాత్తుగ జల్లారునట్లు తత్క్షణంబున మరణంబుజెందు.

శ్లో॥ రాత్రౌసూర్యంజ్వలంతంవాదివావాచంద్రవర్చసం ।
దివాజ్యోతీంషియశ్చాపిజ్వలితానివపశ్యతి ॥
విమానయానప్రాసాదైర్యశ్చసంకులమంబరం ।
యశ్చానలంమూర్తిమంతమంతరిక్షేవలోకతే ॥

ధూమనీహారవాసోభిరావృతాంయశ్చమేదినీం ।
ప్రదీప్తమివయోలోకంయోవాప్లుతమివాంభసా ॥
భూమిమష్టాపదాకారాంలేఖాభిర్యశ్చపశ్యతి ।
యోనపశ్యతిబుఋషాణియశ్చదేవీమరుంధతీం ।
ధృవమాకాశగంగాంచతంవదంతిగతాయుషం ॥

తా॥ ఏమనుష్యునికి రాత్రులయందు సూర్యుడు ప్రకాశించునటులను పగటి యందు చంద్రుడు నక్షత్రములు ప్రకాశించునటులను అంతరిక్షంబున విమానంబులు గుఱ్ఱంబులు మొదలగువాహనంబులు ప్రాసాదములు ఇవి సమూహంబులుగనుండునటులను అగ్నిమూర్తిమంతుండై అంతరిక్షమునందు కండ్లబడునటులను పొగ మంచు వస్త్రము వీట్లతో భూమి గ్రమ్ముకొనియుండునటులను లోకంబంతయు దహింపంబడినటులను లేక నీళ్లయందు మణిగిబోయినటులను నీభూమి స్వర్ణరేకలతోగూడియుండునటులను నెవడుగాంచునో అట్టివాడును రాత్రియందు ఆకాశంబున నక్షత్రంబులు అరుంధతీనక్షత్రము ధ్రువుడు వీడిలోదేనినైనను కనుగొనినవాడును ఆకాశగంగ కనుగొనినవాడును శీఘ్రంబున యమునిసదనంబునకేగు.

స్వల్పాయుర్లక్షణము.

శ్లో॥ ఆదర్శేంబునిఘర్మేవాఛాయాంయశ్చనపశ్యతి ।
పశ్యతేకాంగహీనాంవావికృతాంవాన్యసత్వజాం ॥
శ్వకాకకంకగృధ్రాణాంప్రేతానాంయక్షరక్షసాం ।
ఆతురోలభతేమృత్యుంస్వస్థోవ్యాధిమయాప్నుయాత్ ॥

తా॥ అద్దము జలము యెండ వీటియందు తనఛాయ జూచునపుడు తనశరీరము అగుపడక పోయినను లేక అంగవిహీనముగ నగుపడినదైనను లేక కుక్కలు కాకులు గ్రద్దలు ప్రేతములు యక్షులు రాక్షసులు వీటిరూపంబులవలెనైనను నగుపడెనేని అట్టివాడు రోగిగనుండెనేని మరణంబును రోగవిహీనుడుగనుండెనేని రోగంబును జెందును.

శ్లో॥ హ్రీంశ్రియౌనశ్యతోయస్యతేజఓజస్మృతిప్రభాః ।
అకస్మాద్యభజంతేవసపరాసురసంశయం ॥

తా॥ అకస్మాత్తుగా నెవనికి లజ్జ లక్ష్మి తేజస్సు బలము ప్రజ్ఞ ప్రభావము కాంతి ఇవి ఏకకాలంబున నశించిపోవునో అట్టివాఁడును లేక పైనజెప్పిన లజ్జ మొదలగువవియన్నియు యేకకాలంబున నెవనికిలభించునో అట్టివాఁడును యమునినిలయంబున నెలకొనియుండు.

శ్లో॥ యస్యాధరోష్ఠః పతితః క్షిప్తశ్చోర్ధ్వంతథోత్తర ।
ఉభౌవాజాంబవాభాసౌదుర్లభంతస్యజీవితం ॥

తా॥ ఏరోగికి క్రింది పెదవి దిగువబడినట్టును పైపెదవి యూర్ధ్వభాగంబున నెగిరిపోయినట్టును లేక రెండు పెదవులను నేరేడుపండువలె యుండినను నట్టివాఁడు జీవించుట దుర్లభంబని నెరుంగందగు.

శ్లో॥ ఆరక్తాదశనాయస్యశ్యావావాస్యుః పతంతివా ।
ఖంజనప్రతిమావాపితంవగంతిగతాయుషం ॥

తా॥ ఏరోగికి దంతములుయెఱ్ఱగనైనను నలుపువర్ణముగనైనను ఖంజనమను పక్షివర్ణంబుగనైననునుండి దిగువబడినట్టులుండునో అట్టివాఁడు మార్తాండపుత్రునిపురంబునకు నతిశీఘ్రంబుగ నయింపబడును.

శ్లో॥ కృష్ణాతథానులిప్తాచజిహ్వాసూనాచయస్యవై ।
కర్కశావాభవేద్యస్యసోచిరాద్విజహాత్యసూన్ ॥

తా॥ ఏరోగికినాలుక నలుపువర్ణముగను జిగటగను ముండ్లుపారినట్టుగను కఠినంబుగను ఉండునో అట్టివాడతిశీఘ్రంబుగ మరణంబునొందు.

శ్లో॥ కుటిలాస్ఫుటితాచాపిశుష్కావాయస్యనాసికా ।
అవస్ఫూర్జతిభగ్నావాసనజీవతిమానవః ॥

తా॥ రోగియొక్క నాసికము వంకరగను పగిలినట్టుగను లేక శుష్కించినట్టుగను భగ్నంబైనట్టుగను పలుమారు యెగచీదినట్టుగను ఉండునో అట్టివాఁడు మృత్యువు పాలగునని ఎరుంగందగు.

శ్లో॥ సంక్షిప్తానివపక్ష్మాణిసోచిరాద్యాతిమృత్యవే ॥

తా॥ ఏరోగికి రెప్పలు లోపలికి యీడ్చుకొనిపోయినట్లుండునో అట్టివాఁడు తీవ్రముగ వైవస్వతుని సదనంబునకేగు.

శ్లో॥ నాహారత్యన్నమాస్యస్థంనధారయతియశ్శిరః ।
ఏకాగ్రదృష్టిర్మూఢాత్మాసద్యఃప్రాణాన్ సముంచతి ॥

తా॥ ఏరోగినోటియందు గ్రహించిన అన్నము మ్రింగలేకపోవునో అట్టివాడును వణికెడిమెడను నిలుపుటకు అశక్తుడైనట్టివాడును నొకపార్శ్వంబుననే దృష్టిగలవాడును ఏ తెలివియునులేనివాడును తత్క్షణంబున మరణంబునొందు.

శ్లో॥ ఉత్థాప్యమానోబహుశస్సంమోహంయోధిగచ్ఛతి ।
బలవాన్ దుర్బలోవాపితంపక్వంభిషగాదిశేత్ ॥

తా॥ ఏరోగిని కూర్చుండబెట్టిన పలుమారు మోహమును జెందునో అట్టివాడును బలిష్ఠుడుగనుండినను దుర్బలుడుగనుండినను అట్టివాడు పండినాడని వైద్యుడు యెరుంగవలయు.

శ్లో॥ నిద్రానిరంతరంయస్యయోజాగర్తిచసర్వదా ।
ముహ్యేద్వావక్తుకామశ్చప్రత్యాఖ్యేయసజానతా ॥

తా॥ నిరంతరము నిద్రకలుగుట లేక నిద్రకలుగక నేయుండుట మాటలాడుచుండునపుడు భ్రమజెందుట నిట్టిరోగిని వైద్యుండు విడువవలయు.

శ్లో॥ ఉత్తరోష్ఠంచయోలిహ్యేదుత్కారాంశ్చకరోతియః ।
ప్రేతైర్వాభాషతేసాయంప్రేతరూపంతమాదిశేత్ ॥

తా॥ ఎవడు పలుమారు నాలికతో పెదిమెలుతుడుపుచు హస్తపాదంబుల విదిలింపుచు సాయంకాలమున భూతప్రేతాదులతో మాటలాడునో అట్టివాడు ప్రేతరూపంబుజెందునని యెరుంగందగు.

శ్లో॥ స్వకేభ్యోరోమకూపేభ్యోయస్యరక్తంప్రవర్తతే ।
పురుషస్యావిషార్తస్యసద్యోజీవితంత్యజేత్ ॥

తా॥ ఎవనికి విషసంపర్కములేకనే శరీరరోమకూపంబులనుండి రక్తముస్రవించునో అట్టివాడు తత్క్షణంబున యమునిపురంబిరంబునకేగు.

శ్లో॥ నమ్యక్ప్రకిత్సమానస్యవికారోయోభివర్ధతే ।
ప్రక్షీణబలమాంసస్యలక్షణంతద్గతాయుషః ॥

తా॥ అమోఘంబులైన ఔషధంబులనొసంగి చికిత్సజేయుచుండినను మిగుల వికారంబులుగలిగి మాంసము బలము క్షీణించునో అట్టివానికాయువుగతించినదని చెరుంగవలయు.

శ్లో॥ భూతాః ప్రేతాః పిశాచాశ్చ రక్షాంసి వివిధానిచ ।
మరణాభిముఖం జంతుముపసర్పంతినిత్యశః ॥

తా॥ ఏరోగికి భూతంబులు ప్రేతంబులు పిశాచంబులు రాక్షసులు యక్షులు యెల్లప్పుడు యెదుటవచ్చి నిలిచినట్టుండునో అట్టివాడతిశీఘ్రింబుగ మృతినొందు.

శ్లో॥ తానిభేషజవీర్యాణిప్రతిఘ్నంతిజిఘాంసయా ।
తస్మాన్మోఘాః క్రియాస్సర్వాభవంత్యేవగతాయుషః ॥

తా॥ భూతములు ప్రేతములు మొదలగునవి రోగిని హింసించుటకు ఇచ్ఛగలవై యుండునపుడు ఔషధముల పరాక్రమమును వశింపంజేయుచుండును గాన ఔషధ క్రియలు వ్యర్థమగును.

ఛాయాపురుషలక్షణము.

శ్లో॥ అథాతస్సంప్రవక్ష్యామిచ్ఛాయాపురుషలక్షణం ।
యేనవిజ్ఞాతమాత్రేణత్రికాలజ్ఞోభవేన్నరః ॥

తా॥ ఇపుడు ఛ్ఛాయాపురుషలక్షణమును చెప్పెద. అది తెలిసికొనిన మనుష్యుడు త్రికాలజ్ఞానియగును.

శ్లో॥ కాలోదూరస్థితస్యాపియేనోపాయేనలక్ష్యతే ।
తంవక్ష్యామిసమాసేనయథోద్దిష్టంశివాగమే ॥

తా॥ కాలము దూరముగానుండినను యే ఉపాయమువలన తెలిసికొనవచ్చునో ఆయుపాయము శివాగమమందు సంక్షేపముగ ఎటులజెప్పంబడియున్నదో అటులనే జెప్పెద.

శ్లో॥ ఏకాంతేవిజనేగత్వాకృత్వాదిత్యంచపృష్ఠతః ।
నిరీక్షేతనిజాంఛాయాంకంఠదేశేసమాహితః ॥

తా॥ మనుష్యసంచారములేనట్టి ఏకాంతస్థలమునకుపోయి తనపృష్ఠభాగమున సూర్యుండుండునట్లు కూర్చుండి తననీడలో కంఠదేశమందు ఏకాగ్రదృష్టిచే చూచుచు ధ్యానింపుచుండవలయు.

శ్లో॥ తతఃశ్ఛాకాశమీక్షేతతతఃపశ్యతిగహ్వరం । (ఓంహ్రీంపరబ్రహ్మణేనమః) అష్టోత్తరశతంజప్త్వాతతోదృశ్యేతశంకరం ॥

తా॥ తర్వాత కొంతకాలము ఛాయతట్టుచూచి ధ్యానించినపిమ్మట ఆకాశమునుచూచిన గుహాదృష్టికి గోచరమగును. అనంతరము పైనజెప్పిన మంత్రమును 108 మార్లు వుచ్చరించిన శంకరుని చూడవచ్చును.

శ్లో॥ శుద్ధస్ఫటికసంకాశంనానారూపధరంహరం ।
షణ్మాసాభ్యాసయోగేనభూచరణాంపతిర్భవేత్ ॥

తా॥ శుద్ధస్ఫటికముపంటి తేజస్సుతోజ్వలింపుచు నానారూపములను ధరించియున్న సాంబమూర్తిని నారుమాసంబులు ధ్యానముచేసినయడల ఆ మనుష్యుడు ప్రాణులకు పతియగును.

శ్లో॥ వర్షద్వయేన హేనాథకర్తాహర్తాస్వయంప్రభుః ।
త్రికాలజ్ఞత్వమాప్నోతిపరమానందమేవచ ॥

తా॥ ముందుజెప్పినటుల రెండుసంవత్సరంబులు అభ్యసించినయడల తనంతట సంహరించువాడుగను రక్షించువాడుగను కాలత్రయమును తెలిసినవాడై ఆనందమును పొందియుండు.

శ్లో॥ సతతాభ్యాసయోగేననాస్తికించనదుర్లభం ।
తద్రూపంకృష్ణవర్ణంయఃపశ్యతివ్యోమ్నినిర్మలే ॥
షణ్మాసాన్మృత్యుమాప్నోతిసయోగీనాత్రసంశయః ॥

తా॥ ఏమనుజుడు నిరంతరము యిటుల యోగాభ్యాసము చేయుటచే వానికి త్రైలోక్యమందేదియు దుర్లభముగనుండదు. మఱియు ఆ స్వచ్ఛాకాశమందు ఛాయాపురుష శరీరము కృష్ణవర్ణముగ కనుబడినయడల నారుమాసములకు మృతినొందు.

శ్లో॥ పీతేవ్యాధిభయంరక్తేనీలేహత్యాంవినిర్దిశేత్ ।
నానావర్ణస్వరూపేస్మిన్మహద్వేగోజాయతేమహాన్ ॥

తా॥ ఛాయాపురుషుడు పసుపువర్ణముగ కనుబడెనేని రోగభయమనియు రక్త వర్ణముగ లేక నీలవర్ణముగ కనుబడెనేని మృత్యువును నానావిధములయిన వర్ణములుగా కనుబడెనేని చిత్తమునకు మిక్కిలియుద్వేగమును కలుగును.

శ్లో॥ పాదేగుల్ఫేచజఠరేవినష్టే మృత్యుమాదిశేత్ ।
అర్ధవర్షేణవర్షేణ క్రమాద్వర్ష ద్వయేనచ ॥

తా॥ ఏమనుజునియొక్క దృష్టికి ఛాయాపురుషుని పాదములు మోకాళ్లు కడుపు ఇవి కనుపడకపోయెనేని ఆమనుజుడు ఆరునెలలకును సంవత్సరమునకును రెండు సంవత్సరములకును క్రమముగ మృతినొందును.

శ్లో॥ వినష్టేదక్షిణేబాహౌస్వబంధుర్మ్రియతేధ్రువం ।
వామేబాహౌతథాభార్యావినశ్యతినసంశయః ॥

తా॥ ఛాయాపురుషుని కుడిభుజము నెవనికి కనుబడకపోవునో అట్టివానికి బంధువు మృతినొందును. యెడమభుజము నెవనికి కనబడకపోవునో వానిభార్య మృతినొందును. ఇందుకు సందేహములేదు.

శ్లో॥ శిరోదక్షిణబాహ్వోస్తువినాశేమృత్యుమాదిశేత్ ।
అశిరామాసిమరణంవినాజంఘేదినేనవా ॥
అష్టభిఃకంధరానాశేచ్ఛాయాలుప్తేచతత్క్షణాత్ ॥

తా॥ ఎవనికి ఛాయాపురుషునియొక్క శిరస్సు కుడిభుజము కనుబడలేదో ఆ పురుషుడు ఆసన్నమృత్యువజెందువాడని యెఱుంగవలయు. తల కనుబడకపోతే నొకమాసమునకు మృతినొందు. పిక్కలు కనుబడకపోతే యొకదినములోపల మృతుడగును. మెడలేనట్టుతోచినయడల యెనిమిదిదినములలో మృతుడగును సర్వాంగముయొక్క ఛాయయేకనుబడకబోయెనేని తత్క్షణమేమృతినొందు.

## రోగలక్షణము.

శ్లో॥ రోగస్తుదోషవైషమ్యందోషసామ్యమరోగతా ।
రోగాదుఃఖస్యదాతారోజ్వరప్రభృతయోహితే ॥

తా॥ మనుష్యునికి వాతాదిదోషములు సమముగనుండెనేని అది ఆరోగ్యమనియు అవి విషమములైతే ఆదేరోగమని జెప్పంబడు. జ్వరాదిరోగములే వుత్తరోత్తరముగ దుఃఖదాయకములగును.

శ్లో॥ నరోదినాదిచర్యాభిర్యోనవర్తేతనిత్యశః ।
సపవలభతేరోగమథరోగస్యలక్షణం ॥
జీవాత్మనోద్దుఃఖయోగకారీవ్యాధిర్నిగద్యతే ।
తస్యజ్వరాదయోభేదాబహవస్సముదాహృతాః॥

తా॥ ఏమనుష్యుడు ప్రతిదినమునందు నియమముగ జరిపించదగిన భోజనాభ్యంజనాదిక్రియలు నియమ కాలముతప్పి జరిపించిన ఆ మనుష్యునికి అదేరోగమునకు హేతువగును. రోగమనగా జీవాత్మకు దుఃఖమును జనింపంజేయునది. అదేవ్యాధియనంబడు. ఆ రోగములు జ్వరాధిభేదములచే నానావిధంబులుగనుండు.

శ్లో॥ తేచస్వాభావికాః కేచిత్కేచిదాగన్తవస్స్మృతాః ।
మానసాః కేచిదాఖ్యాతాః కథితాః కేపికాయికాః ॥

తా॥ ఆరోగములు స్వాభావికములనియు ఆగన్తుకములనియు రెండు విధములుగ జెప్పంబడు. స్వాభావికంబులనగా అభిఘాతజ్వరాదులు మఱియు జెప్పంబడిన రోగములు కాయికంబులనియు మానసికంబులని రెండువిధంబులుగ బరంగు. కాయికంబులనగా శరీరమునందుకలిగెడి రోగములు మొదలయినవి. మానసికంబులనగా కామక్రోధాదులవలన జనించెడి జ్వరతాపాదులు.

వ్యాధులస్వరూపము.

శ్లో॥ కర్మజాఃకథితాః కేచిద్దోషజాస్సన్తిచాపరే ।
కర్మదోషోద్భవాశ్చాన్యేవ్యాధయస్త్రివిధాస్స్మృతాః ॥

తా॥ పూర్వోక్తవ్యాధులు కర్మజన్యంబులనియు, వాతాదిదోషజన్యంబులనియు కర్మదోషజన్యంబులనియు మూడువిధంబులుగనుండు.

శ్లో॥ యథాశాస్త్రంతునిర్ణీతాయథావ్యాధిచికిత్సితాః ।
నశమంయాన్తియేరోగాస్తేజ్ఞేయాఃకర్మజాబుధైః ।

కర్మక్షయాత్కర్మకృతాదోషజాస్స్వస్వభేషజైః ।
కర్మదోషోద్భవాయాన్తికర్మదోషక్షయాత్క్షయం ॥

తా॥ కర్మజన్యంబులనగా నిదానశాస్త్రములవలన రోగస్వరూపములు నిర్ణయింపబడి యథావిధిగా చికిత్సజేయబడినను నివర్తించనిరోగములు కర్మజంబులనంబడు. వాతాదిధాతు వైషమ్యముచే జనించిన రోగంబులు దోషజంబులనంబడు. ప్రారబ్ధకర్మము వాతాదిదోషము ఈ రెంటివలన జనించెడిరోగములు కర్మదోషజంబులనంబడు. అందుకర్మజరోగంబులు ప్రారబ్ధకర్మ క్షయించునపుడు కర్మజరోగంబులు నివర్తించు. వాతాదిదోషంబులవలన జనించెడి రోగములు దోషంబులచే నివర్తించు. ఉభయవిధంబులగు రోగంబులు కర్మక్షయము ఔషధాదిప్రయోగము వీటివలన నివర్తించు.

## సాధ్యాదిభేదములు.

శ్లో॥ సాధ్యాయాప్యాఅసాధ్యాశ్చవ్యాధయస్త్రివిధామతాః ।
సుఖసాధ్యఃకష్టసాధ్యోద్విధఃసాధ్యఉచ్యతే ॥

తా॥ వ్యాధులు సాధ్యములు యాప్యములు అసాధ్యములు అనిమూడువిధములుగ జెప్పంబడు. అందు సాధ్యంబులు సుఖసాధ్యంబులు కష్టసాధ్యంబులని రెండువిధములుగ జెప్పంబడు.

## యాప్యలక్షణము.

శ్లో॥ యాపనీయంతుతంవిద్యాత్క్రియాధారయతేహియం ।
క్రియాయాంతునివృత్తాయాంసద్యోయశ్చవినశ్యతి ॥

తా॥ రోగి ఔషధసేవనజేయువరకు హితముగనుండును. మఱియు ఔషధసేవనిలిపినట్టయితే తత్కాలమే మరణముపొందెడు నానివలెనుండును. అట్టిరోగము యాప్యమనబడును.

శ్లో॥ ప్రాప్తాఃక్రియాధారయతిసుఖినంయాప్యమాతురం ।
ప్రపతిష్యదివాగారస్తంభోయత్నేనయోజతః ॥

తా॥ ఔషధసేవజేయువరకు యాప్యరోగి సుఖముగనుండు. అది యెటులనగా ఇల్లు యిడిశిపడునపుడు యత్నంబుల స్తంభముయిచ్చి ఇల్లునిలిపిన చందంబు.

శ్లో॥ సాధ్యాయాప్యత్వమాయాంతియాప్యాశ్చాసాధ్యతాంతథా ।
ఘ్నంతిప్రాణానసాధ్యాస్తునరాణామక్రియావతాం ॥

తా॥ ఔషధసేవజేయనియెడల సాధ్యరోగమెయాప్యమగును. మఱియు ఏది యాప్యమో అదే అసాధ్యమగును. ఏదిఅసాధ్యమో అదేమారకమని యెఱుంగవలయు.

## ఉపద్రవలక్షణము.

శ్లో॥ రోగారంభకదోషస్యప్రకోపాదుపజాయతే ।
యోన్యోవికారస్సబుధై రుపద్రవఇహోదితః ॥

తా॥ రోగములను పుట్టించెడు వాతాదిదోషప్రకోపముచేత యేరోగముతో రెండవవికారముకలుగునో అదియే ఉపద్రవమనంబడు. (ఉదాహరణము) వాతజ్వరాదులయందు తలపోటు మొదలయినవి.

## అరిష్టలక్షణము.

శ్లో॥ రోగిణోమరణంయస్మాదవశ్యంభావిలక్ష్యతే ।
తల్లక్షణమరిష్టంస్యాద్రిష్టంచాపితదుచ్యతే ॥

తా॥ రోగి యేలక్షణమువలన నిశ్చయముగ మృతినొందునని తెలియబడునో అదే అరిష్టమనియు రిష్టమనియు చెప్పంబడు (ఉదాహరణము) జలాదులయందు ప్రతిబింబము అగుపడకపోవుట.

శ్లో॥ యాక్రియావ్యాధిహారిణీసాచికిత్సానిగద్యతే ।
దోషధాతుమలానాంయాసామ్యకృత్సైవసరోగహృత్ ॥

తా॥ ఏక్రియ వ్యాధినినశింపజేసి రసాదిధాతువులు మలము వీటిని సామ్యము చేసి మఱియు వ్యాధినినశింపజేయునట్టి క్రియయే చికిత్సయనంబడు.

## వైద్యకృత్యము.

శ్లో॥ యాభిఃక్రియాభిర్జాయంతేశరీరేధాతవస్సమాః ।
సాచికిత్సావికారాణాంకర్మతద్భిషజాంమతం ॥

తా॥ రోగియొక్క శరీరమునందు వైషమ్యమునుజెందిన వాతాదిదోషములు ఏక్రియలచే సౌమ్యమునుజెందునో అదే చికిత్సయనంబడు. అదే వైద్యసమ్మతము.

చికిత్సాద్యుపదేశము.

శ్లో॥ జాతమాత్రశ్చికిత్స్యస్స్యాన్నోపేక్ష్యోల్పతయాగదః ।
వహ్నిశత్రువిషైస్తుల్యస్స్వల్పోపివికరోత్యసౌ ॥

తా॥ వ్యాధిపుట్టినతోడనే చికిత్సచేయవలయు. ఆవ్యాధి స్వల్పముగానుండి నను వుపేక్షచేయంతగదు. ఉపేక్షచేసినట్టయితే అది అగ్ని శత్రు విషము వీటితో తుల్యముగాన వికారమును జనింపంజేయు.

వైద్యునికర్తవ్యము.

శ్లో॥ రోగమాదౌపరీక్షేతతతోనంతరమౌషధం ।
తతఃకర్మభిషక్పశ్చాత్ జ్ఞానపూర్వంసమాచరేత్ ॥

తా॥ వైద్యుడు ప్రథమతః రోగముఫలానిదనిపరీక్షించి రోగమునునెరింగి ఔషధప్రయోగములను జేయవలయు. పిదప ప్రతిదినము రోగముయొక్క వృద్ధి క్షయములను తెలిసికొని జ్ఞానపూర్వకముగ చికిత్సచేయవలయు.

వైద్యునియొక్క అజ్ఞానదోషములు.

శ్లో॥ యస్తురోగమవిజ్ఞాయకర్మణాచరతేభిషక్ ।
అప్యౌషధవిధానజ్ఞస్తస్యసిద్ధిర్యదృచ్ఛయా ॥

తా॥ ఏవైద్యుడు రోగస్వరూపమును శాస్త్రానుభవాదులచే నెఱుంగక చికిత్సను ఆరంభించెనేని ఆవైద్యుడు ఔషధవిధానజ్ఞుడైనను అతనికి సిద్ధిదైవాయత్తమని యెరుంగవలయు.

శ్లో॥ ఔషధంకేవలంకర్తుయోజానాతిసచామయం ।
వైద్యకర్మసచేత్కుర్యాద్వధమర్హతిరాజతః ॥

తా॥ ఏవైద్యుడు రోగస్వరూపమునెఱుంగకనే కేవలము ఔషధముమాత్రము తెలిసికొని చికిత్సలుచేయుటకు ప్రవర్తించుచున్నాడో అట్టివైద్యుడు రాజదండనకు పాత్రుడగును.

శ్లో॥ యస్తుకేవలరోగజ్ఞోభేషజేష్వవిచక్షణః ।
తంవైద్యంప్రాప్యరోగీస్యాద్యథానౌర్నావికంవినా ॥

తా॥ ఏవైద్యుడు కేవలము రోగనిదానముమాత్రము తెలిసినవాడై మిగుల ఔషధస్వరూపము తెలియక చికిత్సచేయుటకు ప్రవర్తించుచున్నాడో అట్టివైద్యునివద్దికి రోగి చికిత్సకుపోయెనేని నావికుడులేనినావ సముద్రమునందెటుల నాశనమునొందునో అటులరోగి నాశమునొందును.

శ్లో॥ యస్తుకేవలశాస్త్రజ్ఞః క్రియాస్వకుశలోభిషక్ ।
సముహ్యత్యాతురంప్రాప్యప్రాప్యభీరురివాహవం ॥

తా॥ ఏవైద్యుడు కేవలశాస్త్రమును తెలిసినవాడై ఔషధము యిచ్చుటలో కుశలుడు కాకపోయెనేని అట్టివైద్యుడు రోగినిచూచి మోహమును జెందు. యెటులనగా యుద్ధమందు భయపడినబంటువలె.

శ్లో॥ యస్తురోగవిశేషజ్ఞస్సర్వభైషజ్యకోవిదః ।
దేశకాలవిభాగజ్ఞస్తస్యసిద్ధిర్నసంశయః ॥

తా॥ ఏవైద్యుడు రోగజ్ఞానముకలిగియుండి సంపూర్ణముగ చికిత్సలయందు కుశలుడై మఱియు దేశకాలవిభాగములు తెలిసి చికిత్సచేయుటకు ప్రవర్తించెనేని అట్టివైద్యునికి సిద్ధి అవశ్యముకలుగు.

శ్లో॥ ఆదానంతేరుజాంజ్ఞానేప్రయతేతచికిత్సకః ।
భేషజానాంవిధానేధతతఃకుర్యాచ్చికిత్సితం ॥

తా॥ వైద్యుడు రోగియొక్క రోగమును ఆద్యంతములయందు అవశ్యముగ పరీక్షించవలయు. అనంతరంగున రోగముయొక్క తారతమ్యమును తెలిసి చికిత్సచేయవలయు.

శ్లో॥ వికారనామాకుశలోనజిహ్రీయాత్కదాచన ।
నహిసర్వవికారాణాంనామతోస్తిధ్రువాస్థితిః ॥

తా॥ వైద్యుడు రోగవికారనామంబులు సరిగాదెలియనివాడై నొకప్పుడును లజ్జనొందతగదు. యేలననగా సంపూర్ణముగ వికారములకు నామములకు వైద్యశాస్త్రములయందు చెప్పంబడలేదు.

శ్లో॥ నాస్తిరోగోవినాదోషైర్యస్మాత్తస్మాచ్చికిత్సకః ।
అనుక్తమపిదోషాణాంలింగైర్వ్యాధిముపాచరేత్ ॥

తా॥ దోషములేకనే వ్యాధికలుగదు. ఏదోషము శాస్త్రమందు చెప్పబడ లేదో ఆదోషము రోగికి కలిగియుండెడు ఉపద్రవమువలన వైద్యుడు తెలిసికొని చికిత్స చేయవలయు.

శ్లో॥ యేనకుర్వంత్యసాధ్యానాంచికిత్సాంతేభిషగ్వరాః ।
అతోవైద్యఃశ్రమంకుర్యాత్సాధ్యాసాధ్యపరీక్షణే ॥

తా॥ ఏవైద్యుడు అసాధ్యమగు వ్యాధులయొక్క చికిత్సలయందు ప్రవర్తింపడో అట్టివైద్యుడే శ్రేష్ఠుడని తెలియవలయు. గాన వైద్యుడు ప్రథమమందు రోగముయొక్క సాధ్యత్వాసాధ్యత్వములను నిర్ణయించవలయు.

శ్లో॥ శీతేశీతప్రతీకారముష్ణేతూష్ణనివారణం ।
కృత్వాకుర్యాత్క్రియాంప్రాప్తాంక్రియాకాలంనహాపయేత్ ॥

తా॥ వైద్యుడు శీతలమువలనకలిగిన వ్యాధులకు ఉష్ణోపచారమును ఉష్ణమువలన కలిగెడి వ్యాధులకు శీతోపచారమునుజేసి కాలప్రాప్తమగు చికిత్స చేయవలయు. మఱియు చికిత్స చేయదగిన కాలమందు ఉపేక్ష చేయందగదు.

కువైద్యలక్షణము.

శ్లో॥ ఆమంవిపచ్యమానంచసమ్యక్పక్వంచయోభిషక్ ।
జానీయాత్సభవేద్వైద్యశ్శేషాస్తస్కరవృత్తయః ॥

తా॥ రోగముయొక్క పక్వాపక్వములను తెలిసికొని చికిత్సచేయువాడే వైద్యుడు. అటుల తెలిసికొనుటకు జ్ఞానములేక వైద్యులమనే నామమునువహించెడివారిని వైద్యచోరులుగా నూహింపవలయు.

శ్లో॥ యశ్చినత్త్యామమజ్ఞానాద్యశ్చపక్వముపేక్షతే ।
శ్వపచావివమన్తవ్యౌతావనిశ్చితకారిణౌ ॥

తా॥ అపక్వమని తెలియక రోగమును కుదుర్చుటకు ప్రయత్నపడునట్టియు పక్వమైన పిమ్మట ఉపేక్షించునట్టియు వైద్యులను చండాలురనుగా తెలిసికొనవలెను.

శ్లో॥ వ్యవహారంజ్యోతిషంచభైషజ్యంకర్మకారకమ్ ।
యశ్చశాస్త్రంవినాకుర్యాత్తమాహుర్బ్రహ్మఘాతకమ్ ।
తస్మాత్సర్వప్రయత్నేనవైద్యశ్శాస్త్రంవిచారయేత్ ॥

తా॥ వ్యవహారము జ్యోతిషము వైద్యము యాజ్ఞికము వీటిని శాస్త్రము తెలియకనే చేయరాదు. అటులచేసినయెడల బ్రహ్మహత్యచేసిన పాపము సిద్ధించును గనుక సర్వప్రయత్నములచేత వైద్యుడు శాస్త్రమును తెలిసికొనవలయు.

అతిరిక్తక్రియానిషేధము.

శ్లో॥ వికారేల్పేమహత్కర్మక్రియాలఘ్వీగరీయసీ ।
ద్వయమేతదకౌశల్యంకౌశల్యంయుక్తకర్మతా ॥

తా॥ అల్పవికారములయందు బలమైనక్రియలు బలమైనవికారములయందు అల్పక్రియలు యిటుల వైద్యునియొక్క అజ్ఞానదోషమువలన కలుగుచున్నది గాన యంతరోగమో అంతక్రియయుచేయు వైద్యుడే కుశలుడని తెలియవలయు.

శ్లో॥ క్రియాయాస్తుగుణాలాభేక్రియామన్యాంప్రయోజయేత్ ।
పూర్వస్యాంశాంతవేగాయాంనక్రియాసంకరోహితః ॥

తా॥ రోగికి యొక ఔషధమునిచ్చి గుణముకలుగకపోతే ఆ ఔషధ వీర్యము శాంతిపొందినతర్వాత యింకొకక్రియచేయవలయు. క్రియాసాంకర్యము చేయందగదు.

శ్లో॥ క్రియాభిరల్పరూపాభిర్నక్రియాసంకరోహితః ।
తాభిస్తుభిన్నరూపాభిఃసాంకర్యంనైవదుష్యతి ॥

తా॥ వైద్యుడు అల్పములైన ఏకరూపములయిన చికిత్సలుచేసినేని అది క్రియాసాంకర్యముగలది గాన అహితముకాదు. అదే గొప్పవై భిన్నరూపంబులయినను దానికి క్రియాసాంకర్యములేదు. అది హితమైయుండును.

శ్లో॥ లంఘనంపాచనంకాలేస్వేదనస్యంవిషేచనంతథా ।
అవలేహాంజనంచాపిప్రాక్ప్రయోజ్యంత్రిదోషజే ॥

తా॥ వైద్యుడు త్రిదోషజనితవ్యాధులకు పూర్వమునందు లంఘనమును ఇనుకకాచి వోత్తడము నస్యము అవలేహనము కఫమును బయలువెడలునటుల చేయించడము నేత్రములకు అంజనము ఇటుల క్రియలు చేయించవలయు.

శ్లో॥ నచైకాంతేననిర్దిష్టేశాస్త్రేనిర్విశతేబుధః ।
స్వయమప్యత్రభిషజాతర్క్యణీయాచికిత్సతా ॥

తా॥ శాస్త్రిమునందు సర్వచికిత్సలు నియమముగ నుపదేశించబడినను వైద్యుడు కాల దేశ రోగ శక్తి మొదలయినవాటిని తనబుద్ధితో యోచించి వుచితమైన చికిత్సచేయవలయు.

శ్లో॥ ఉత్పద్యతేచేత్సావస్థాదేశకాలబలంప్రతి।
యస్యాంకార్యమకార్యంస్యాత్కర్మకార్యంవివర్జితమ్ ॥

తా॥ దేశము కాలము బలము ఈఅవస్థలుచూచి వైద్యుడు రోగికి ఔషధము యిచ్చినా అది వికృతినిపొందితే ఆ ఔషధమును వైద్యుడు విడువవలయు.

చికిత్సాఫలము.

శ్లో॥ క్వచిదర్థఃక్వచిన్మైత్రీక్వచిద్ధర్మఃక్వచిద్యశః ।
కర్మాభ్యాసఃక్వచిచ్చేతిచికిత్సానాస్తినిష్ఫలా ॥

తా॥ వైద్యునికి చికిత్సవలనద్రవ్యము స్నేహము ధర్మము యశము మరియు కర్మాభ్యాసము ఇట్టిఫలంబులుగలుగు గాన చికిత్స నిష్ఫలముకాదు.

శ్లో॥ ఆయుర్వేదోదితాంయుక్తింకుర్వాణావహితాశ్చయే ।
పుణ్యాయుర్వృద్ధిసంయుక్తనిరోగాశ్చభవంతితే ॥

తా॥ ఏరోగి మిగులజాగరూకుడై ఆయుర్వేదమునందుచెప్పబడిన యుక్తిజేయుచున్నాడో ఆరోగి శ్రేయస్సు మరియు ఆయుర్వృద్ధి నిరోగత్వము వీట్లనుపొందు.

వైద్యుడు ధనమునార్జించెడి క్రమము.

శ్లో॥ నైవకుర్వీతలోభేనచికిత్సాపుణ్యవిక్రయం ।
ఈశ్వరాణాంవసుమతాంలిప్సేతార్థంతువృత్తయే ॥

తా॥ లోభముచే చికిత్సచేయుటవలన గలిగెడి పుణ్యమునశించుగాన వైద్యుడు చికిత్సావిషయమై ద్రవ్యమునపేక్షించందగదు. అయినను తనజీవనార్థమై మిగుల శ్రీమంతులవద్ద ధనమార్జించందగు.

## రోగి వైద్యునికి ద్రవ్యమివ్వకపోవుటవలన కలిగెడి దోషములు.

శ్లో॥ చికిత్సితంశరీరంయోననిష్క్రీణాతిమర్మతిః ।
నయత్కరోతిసుకృతంసర్వంతద్భిషగశ్నుతే ॥

తా॥ రోగి వైద్యునిచేత నౌషధముపుచ్చుకొనుటవలన తనశరీరము వైద్యునిదే యగుచున్నది. ఆశరీరమును వైద్యునికి ద్రవ్యమిచ్చి పుచ్చుకొనినయడల అట్టివాడే సుకృతముచేసినను వాటిఫలము వైద్యునికే ప్రాప్తమగును.

## ఔషధము యివ్వకుండుటవలన వైద్యునికిదోషము.

శ్లో॥ దీర్ఘతీవ్రామయగ్రస్తంబ్రాహ్మణంగామథాపివా ।
దృష్ట్వాపథినిరాతంకమకృత్వాబ్రహ్మహాశుచిః ॥

తా॥ ఏవైద్యుడు మార్గమందు తీవ్రరోగముచేగ్రస్తుడైన బ్రాహ్మణునిగాని లేక గోవునుగానిచూచి చికిత్సచేయక విడిచిపెట్టిపోయెనేని వాడు బ్రహ్మహత్యాదిపాపముతగిలి అశుద్ధుడగును.

## చికిత్సాంగములు.

శ్లో॥ రోగీదూతోభిషక్ దీర్ఘమాయుర్ద్రవ్యంసుసేవకః ।
సదౌషధంచికిత్సాయాఇత్యంగానిబుధాజగుః ॥

తా॥ చికిత్సకు రోగి దూత వైద్యుడు దీర్ఘాయువు ద్రవ్యము మంచిసేవకుడు వుత్తమయౌషధము ఇట్టిఅంగములు కలిగియుండవలయును.

శ్లో॥ రోగోయస్యాస్తిరోగీసనచికిత్స్యస్తుసాధ్యకః ।
యాప్యశ్చేచ్చికిత్స్యోప్యపివక్ష్యమాణోనిశమ్యతాం ॥

తా॥ రోగముగలవాడు రోగియనంబడును. గాన ఏరోగిచికిత్సకు అర్హుడో ఎవడు అనర్హుడో వార్లను వివరించెద వినుడు.

శ్లో॥ నిజప్రకృతివర్ణాభ్యాంయుతస్సత్వేనచక్షుషా ।
చికిత్స్యోభిషజాంరోగీవైద్యభక్తోజితేంద్రియః ॥

తా॥ తనయొక్క మంచిప్రకృతి మంచితేజస్సు బలము మంచినేత్రములు వైద్యునియందు భక్తి జితేంద్రియత్వము వీట్లతోగూడిన రోగియే వైద్యునియొక్క చికిత్సకు అర్హుడు.

శ్లో॥ ఆయుష్మాన్ సత్వవాన్ సాధ్యోద్రవ్యవాన్ మిత్రవాన్వృషిః ।
చికిత్స్యోభిషజారోగీవైద్యవాక్యకృదాస్తికః ॥

తా॥ ఏరోగి దీర్ఘాయువు ధైర్యము సాధ్యరోగత్వము ద్రవ్యము మిత్రులు ఇంద్రియనిగ్రహము ఇవికలవాడో మరియు వైద్యుడు చెప్పినటుల నడుచువాడో నమ్మికకలవాడో అట్టివానికి వైద్యుడు చికిత్సచేయవలయు.

చికిత్సచేయతగనివారలు.

శ్లో॥ చండస్సాహసికోభీరుఃకృతఘ్నోవ్యగ్రఏవచ ।
శోకాకులోముమూర్షుశ్చహీనఃకరణైశ్చయః ॥
వైరీవైద్యవిదగ్ధశ్చశ్రద్ధాహీనశ్చశంకితః ।
భిషజామవిధేయశ్చనోపక్రమ్యోభిషగ్విధః ।
ఏతానుపచరేద్వైద్యోబహూన్దోషానవాప్నుయాత్ ।
సనసిధ్యతివైద్యస్తుగృహేయస్యనపూజ్యతే ॥

తా॥ క్రూరుడు సాహసికుడు భీతుడు కృతఘ్నుడు వ్యగ్రుడు శోకార్తుడు ఆసన్నమరణముగలవాడు ఇంద్రియపటుత్వములేనివాడు వైరముగలవాడు స్వతహా వైద్యాభిమానముకలవాడు వైద్యునియందు విశ్వాసములేనివాడు శంకించువాడు మరియు వైద్యునిస్వాధీనములోనుండనివాడు అట్టివారికి చికిత్సచేయందగదు. యిట్టివారికి ఔషధమిచ్చినయెడల వైద్యునికి మిగులదోషముకలుగును. మఱియు ఏరోగియొక్క గృహమందు వైద్యునికి మర్యాదలేదో ఆరోగికి సిద్ధిగలుగనేరదు.

శ్లో॥ వ్యాధేస్తత్వపరిజ్ఞానంవేదనాయాశ్చనిగ్రహః ।
ఏతద్వైద్యస్యవైద్యత్వంనవైద్యఃప్రభురాయుషః ॥

తా॥ వ్యాధినిర్ణయమందు మంచిజ్ఞానము ఆవ్యాధియొక్క శమనోపాయము వీటిని యెరిగినవాడే వైద్యుడుగాన ఆయువునుకలుగజేయుటకు ప్రభువుగాడు.

## మృత్యుసంజ్ఞ.

శ్లో॥ ఏకోత్తరంమృత్యుశతమథర్వాణః ప్రచక్షతే ।
తత్రైకఃకాలసంయుక్తః శేషాస్త్వాగంతవస్మృతాః ॥

తా॥ అథర్వణవేదమును తెలిసిన మునులు 101 సంఖ్యగలవారు మృత్యువులనియు అందులో కాలమృత్యువొకడనియు ఇతరులు ఆగంతుకమృత్యువులని వచించెదరు.

## ఆగంతుకమృత్యులక్షణము.

శ్లో॥ అథసత్యపితైలాదౌదీపంనిర్వాపయేన్మరుత్ ।
ఏవమాయుష్యయుక్తంచహింసంత్యాగంతుమృత్యవః ॥

తా॥ దీపము తైలాదిసత్వముకలదయినను గాలివలనయెట్టుల శాంతిని జెందునో అటులనే ఆయుష్యముకలదైనను జంతువును ఆగంతుకమృత్యువు నశింపంజేయు.

శ్లో॥ దోషాగంతునిమిత్తేభ్యోరసమంత్రవిశారదౌ ।
రక్షేతాంస్నృపతింనిత్యంయత్నాద్వైద్యపురోహితౌ ॥

తా॥ యుక్తమైన ఔషధాదిస్వరూపములు మంత్రములు వీటినిగుర్తెరిగిన వైద్యుడు పురోహితుడు వీరలు వాతాదిదోషములు ఆగంతుకమృత్యువులు వీటివలన రాజును రక్షించవలయు గాన వైద్యపురోహితులను రాజు స్వాధీనమందుంచుకొనవలయు.

## దేశజ్ఞానము.

శ్లో॥ దేశోల్పవారిద్రునగోజాంగలస్స్వల్పరోగదః ।
ఆనూపోవిపరీతోస్మాత్సమస్సాధారణస్మృతః ॥

తా॥ ఏదేశమునందు అల్పవుదకము అల్పవృక్షములు అల్పపర్వతములుగలవో అది జాంగలదేశమనబడును. ఆదేశమునందు స్వల్పరోగములుగలవు. మఱియు ఏదేశమునందు విశేషముగనుదకము విశేషవృక్షములు విశేషముగ పర్వతములుగలవో అది అనూపదేశమనబడును. ఆదేశమునందు వ్యాధులు విశేషముగపుట్టును. మఱియు ఈరెండుదేశములకంటె ఏదేశముసమముగనుండునో ఆదేశము సాధారణదేశమనబడు.

## జాంగలదేశము.

శ్లో॥ జాంగలంవాతభూయిష్ఠమనూపంతుకఫోల్బణం ।
సాధారణంసమమలంత్రిధాభూర్దేశమాదిశేత్ ॥

తా॥ జాంగలదేశమందు వాతప్రచురము అనూపదేశమందు కఫప్రచురము సాధారణదేశమునందు సమమయినదోషములు గలదిగనుండు.

## అనూప జాంగల సాధారణ దేశముల లక్షణము.

శ్లో॥ దేశఃప్రచురపానీయోబహువృక్షసమాకులః ।
బహువాతకఫవ్యాధిరనూపఇతికథ్యతే ॥
స్వల్పోదకస్స్వల్పవృక్షో బహుపిత్తాసృగామయః ।
కథ్యతేజాంగలోదేశస్తాభ్యాంసాధారణఃపరః ॥

తా॥ ఏదేశమునందు విస్తారముగ నుదకము విస్తారముగ వృక్షములుగలవో ఆ దేశము అనూపమనంబడును. అందులో మఱియు వాత కఫసంబంధమైన వ్యాధులు విస్తరించియుండు. మఱియు ఏదేశమునందు ఉదకము వృక్షములు కొద్దిగనుండునో ఆదేశము జాంగలదేశమనబడును. అందులో పిత్తరోగములు రక్తవికారములు ఇవి విస్తరించియుండును. ఈరెండుదేశములకంటే అన్యదేశము అనగా యథోచితమైన ఉదకము వృక్షములుకలవో అది సాధారణదేశమనబడును.

## దోషత్రయప్రకోపమాసములలో వాతప్రకోపమాసములు.

శ్లో॥ మార్గేపౌషేతథామాఘేఆషాఢేశ్రావణేపిచ ।
భాద్రపదేచికిత్సజ్ఞైర్వాతోరాజాప్రకీర్తితః ॥

తా॥ మార్గశిరము పుష్యము మాఘము ఆషాఢము శ్రావణము భాద్రపదము ఈనెలలయందు వాతప్రకోపమని చికిత్సజ్ఞులు చెప్పియున్నారు.

### పిత్తప్రకోపమాసములు.

శ్లో॥ అశ్వినేకార్తికేమాసేవైశాఖజ్యేష్ఠయోర్ధ్రువం ।
సర్వశాస్త్రవిచారజ్ఞైఃపిత్తంరాజాప్రకీర్తితం ॥

తా॥ ఆశ్వయుజము కార్తీకము వైశాఖము జ్యేష్ఠము ఈనెలలయందు పిత్త ప్రకోపమని చికిత్సజ్ఞులు చెప్పియున్నారు.

### కఫప్రకోపమాసము.

శ్లో॥ ఫాల్గునేచైత్రమాసేచజంతుపీడాకరోమతః ।
శీతాలంబుసముద్భూతఃశ్లేష్మారాజాప్రకీర్తితః ॥

తా॥ ఫాల్గుణము చైత్రము ఈరెండుమాసములయందు జంతుపీడయుకలుగు. మఱియు ఈరెండుమాసములయందు శీతలాంబు సంబంధముచే సముద్భూతమైన శ్లేష్మ ధాతువు ప్రకుపితమని చికిత్సజ్ఞులు చెప్పియున్నారు.

### ఋతుభేదములవలన ధాతుదోషము.

శ్లో॥ హేమంతవర్షాశిశిరేషువాయోఃపిత్తస్యతోయాంతనిదాఘయోశ్చ
కఫస్యకోపఃకుసుమాగమేచకుర్వీతయద్వహితంతతత్తదైషాం ॥

తా॥ హేమంతఋతువు వర్షఋతువు శిశిరఋతువు వీట్లయందు వాయువు ప్రకోపమగును. మఱియు శరద్రుతువు గ్రీష్మఋతువులయందు పిత్తప్రకోపమగును. మఱియు వసంతఋతువులయందు కఫప్రకోపమగును. వీట్లయందు యేయే హిత వుపచారములుగలవో వాటిని వైద్యుడు చేయించవలయు.

### కాలభేదముసంబంధవాతాదివ్యాప్తి.

శ్లో॥ శ్లేష్మాప్రాయస్తుపూర్వాహ్ణేప్రదోషేచప్రవర్తతే ।
పిత్తప్రాయస్తుమధ్యాహ్నేనిశువాయుశ్చప్రవర్తతే ॥
అపరాహ్ణేనిలప్రాయోనిశీథాంతేప్రవర్తతే ॥

తా॥ పగలు పూర్వాహ్ణమందు ప్రదోషకాలమునందును శ్లేష్మము ప్రబలముగ ను మఱియు మధ్యాహ్నమునందు అర్ధరాత్రియందును పిత్తము ప్రబలముగను మఱియు అపరాహ్ణకాలమునందు అర్ధరాత్రాంత్యమునందును వాయువు ప్రబలముగను నుండు.

## దోషత్రయశమనోపాయము.

శ్లో॥ కఫంతురిపువత్తీక్ష్ణైర్వాతంస్నేహేనమిత్రవత్ ।
పిత్తంజామాతరమివమధురైశ్శీతలైర్జయేత్ ॥

తా॥ శ్లేష్మధాతువును తీక్ష్ణమైన బాణాదులచేత శత్రువువలె తీక్ష్ణమైన ఔషధాదులచే స్వాధీనపరచుకొనవలయు. వాతధాతువును స్నేహముచే మిత్రునివలె స్నేహద్రవ్యములచే స్వాధీనపరచికొనవలయు. పిత్తధాతువును చల్లనై మధురమైన క్రియలచే అల్లునివలె శీతలమై మధురమయిన పదార్థములచే స్వాధీనపరిచికొనవలయు.

## దోషోపచారములు.

శ్లో॥ కఫప్రకోపేవమనంసనస్యంవిరేచనంపిత్తభవేవికారే ।
వాతార్థికేవస్తివిశోధనంచనిసర్గజేచప్రవిమిశ్రమేతత్ ॥

తా॥ కఫప్రకోపమగునపుడు నస్యముతోగూడిన వమనము పిత్తప్రకోపమగునపుడు విరేచనము వాతప్రకోపమగునపుడు వస్తివిశోధనము ఇవిచేయవలయు. మఱియు త్రిదోషాదులకు యథోచితముగ సర్వోపచారములను చేయవలయు.

## వాతప్రకోపకారణము.

శ్లో॥ నీవారస్త్రిపుటస్సతీనచణకశ్శ్యామాకముద్గాఢకీ ।
నిష్పావాశ్చమసూరకశ్చవరటామాంగల్యకఃకోద్రవః ।
యద్రివ్యంకటుకంసతిక్తతువరంశీతంచయూషంలఘు ।
స్వల్పాశోవిషమాశనంనిరశనంభుక్తేప్యజీర్ణేశనం ।
బాహుభ్యాంతరణంతరోఃప్రపతనంమార్గేఽతియానంపదా ।
దండాదిప్రహతిస్తగోశ్చపతనంధాతుక్షయోజాగరః ।
మార్గస్యావరణంవ్యవాయభృశతాఘాతాదివేగాహతిః ।
అత్యర్థంవమనంవిరేచనమతిస్రావోధికశ్చాసృజో ।
రోగాన్మాంసపిహీనతాతిమదనశ్చింతాచశోకోభయం ।
సద్యాస్తైశిశిరేదినస్యరజనేభాగేగతేత్రితయాఘనాః ।
ప్రాగ్వాతస్తుహినంశరీరమదుతోదస్త్వంబుమోహాలసః ॥

తా॥ నీవారధాన్యము పటాణీలు చామలు పెసలు కంధులు అనుములు అడవి పెసలు మసూరు కొఱ్ఱలు ఆరికలు ఇవి చేదుపదార్థములు. కారము వగరు శీతలపదార్థము ఋూక్షము లఘుపదార్థము ఇవి అల్పభోజనము. విషమభోజనము నిరశనము భోజనోత్తరమందు మరల భోజనముచేయడము విశేషశ్రమబడుట పల్లములు మొదలయినవాటిని దాటుట నీటియందుయీదుట చెట్టుమీదనుండి దుముకుట విశేషముగ పాదచారియై మార్గమునడుచుట కఱ్ఱలు మొదలగువాటిచే దెబ్బలుబడుట గొప్పస్వరముతో అధ్యయనముచేయుట ధాతుక్షయము జాగరణము మలమూత్రనిరోధము పలుమారు మైథునము అపానాదివాయురోధము విశేషముగవాంతులు విశేషముగభేదులు మిసలరక్తస్రావము రోగాధికములవలన మాంసక్షయము అతికామము అతిచింతయు అతిశోకము అతిభయము ఇవి వర్షఋతువు శిశిరఋతువు పగలు రాత్రులు వీట్లయొక్క మూడవభాగము మేఘోదయము పూర్వదిక్కుగాలి మంచు ఇవి శరీరమునందు వాయువును వృద్ధిపొందించుటకు కారణములైయున్నవి.

వాతదోషముల లక్షణము.

శ్లో॥ పారుష్యసంకోచనతోదశూలశ్యామత్వమంగవ్యథచేష్టభంగాః
సుప్తత్వశీతత్వఖరత్వశోషాః కర్మాణివాయోః ప్రవదంతితజ్జ్ఞాః ॥

తా॥ శరీరపారుష్యము అవయవసంకోచము నొప్పులు శూలలు ఒడలు నలుపుబారియుండుట పాదహస్తచేష్టానాశము మిక్కిలినిద్రయు శీతత్వము రూక్షత్వము శరీరముశోషించుట ఇవి వాతరోగముయొక్క చిహ్నములని వైద్యులు వచించిరి.

వాతశమనము.

శ్లో॥ స్నిగ్ధోష్ణస్థిరసూక్ష్మవృష్యబల్యలసనా స్వాద్వమ్లసైలాతప ।
స్నానాభ్యంజనసుస్నిగ్ధమాంసమద్యాసవాహానోద్వర్తనం ।
స్నేహాన్స్వేదనిరూహానువాసనశయనస్థానోపనాహాదికం ।
పానాహారవిహారభేషజమిదంవాతప్రశాంతింనయేత్ ।

తా॥ మృదువుగను ఉష్ణముగను స్థిరముగను వీర్యవృద్ధికరముగను బలకరముగ నుండెడి వస్తువులును [illegible] తీక్ష్ణ ఫలములను [illegible] యందు స్నానము అభ్యంజనము [illegible]భోజనము మాంసము మద్యము [illegible] [illegible] నలుగుపెట్టడము నూనె

శ్రీ ర స్తు.

శ్రీమదుమారమణ చరణ సరోజసేవాపరతంత్రుడును అహమ్మదనగర
నివాసియునగు మాణికభట్టు అనువారికిపుత్రుడగు మోరేశ్వరుడను
వైద్యశిఖామణిచే రచియింపబడిన

# వైద్యామృతము.

గీర్వాణాద్యనేక భాషానిపుణులును ఆయుర్వేదశాస్త్రానుభవజ్ఞులునగు
జయకృష్ణదాసు వేంకటదాసుగారి సహాయమువలన



లేట్ పిడుగు - సుబ్బరామయ్యగారిచే తెనుగర్థమువ్రాయబడి
ములుకుట్ల - విశ్వనాథశాస్త్రిలవారిచే బరిష్కరింపబడి
పిడుగు - వెంకటకృష్ణారావుపంతులుగారి

హిందూరత్నాకరముద్రాక్షరశాలయందు

ఎనిమిదవతూరి

ముద్రింపించి ప్రచురింపంబడియె.

చెన్నపట్టణము.

1920.



Price 1 4 0

## పిత్తముయొక్క చర్య.

శ్లో॥ పరిశ్రమస్వేదవిదాహరాగవైగంధ్యసంక్లేదవిపాకకోపాః ।
ప్రలాపమూర్ఛాభ్రమిపిత్తదాహాఃపిత్తస్యకర్మాణివదంతితజ్జ్ఞాః ॥

తా॥ పరిశ్రమము చమట విదాహము వొడలుయెరుపుపారుట దౌర్గంధ్యము వొడలుతడిసినటులయుండుట ముఖపాకము దద్దులు తరుచుమాటలు మూర్ఛ భ్రమ పిత్తమువలన తాపము ఇవిపిత్తముయొక్క చర్యలని యెఱుంగవలయు.

## పిత్తోపశమనము.

శ్లో॥ తిక్తస్వాదుకషాయశీతపవనచ్ఛాయానిశాజీవనం ।
జ్యోత్స్నాభూగృహవారియంత్రజలజస్త్రీగాత్రసంస్పర్శనం ।
సర్పిఃక్షీరవిరేకసేకరుధిరస్రావప్రలేపాదికం ।
పానాహారవిహారభేషజమిదంపిత్తంప్రశాంతింనయేత్ ॥

తా॥ చేదు తీపు వగరు చల్లనిగాలి నీడ రాత్రి ఉదకము వెన్నెల భూగృహము జలయంత్రము తామరపువ్వులు స్త్రీలఆలింగనము నెయ్యి పాలు విరేచనము రక్తస్రావము ప్రలేపనము కషాయాదిపానము పిత్తశాంతికరమయిన ఆహారము విహారము ఈయుపచారములవలన పిత్తము శాంతించును.

## కఫప్రకోపకారణము.

శ్లో॥ గురుపటుమధురామ్లస్నిగ్ధమాషేక్షుపిష్టైశ్చద్రవదధిదివనిద్రాశీతనిశ్చేష్టతాభిః । ప్రథమదినసభాగేరాత్రిభాగేపిచాద్యేభవతిహికఫకోపోభుక్తమాత్రేపినౄణాం ॥

తా॥ గురువుగను ఉప్పుగను మధురముగను పులుసుగను మృదువుగనుండెడి పదార్థములచేతను మినుములు పిష్టాలు ద్రవ్యయుక్తపదార్థములు పెరుగు వీట్లచేతనున్న పగటియందునిద్రపోవుట శీతపదార్థములుసేవించుట నిశ్చేష్టగనుండుట వీట్లచేతనున్న దివసముయొక్క ప్రథమభాగము రాత్రియొక్క మొదటిభాగము భోజనోత్తరకాలము వీట్లయందు శ్లేష్మకోపమెక్కువగును.

శ్లో॥ స్వప్నార్ద్రివామధురశీతలమత్స్య మాంసగుర్వమ్లపిచ్ఛిలతిలేక్షుపయోవికారైః । స్నిగ్ధాతితృప్తిలవణోదకపానభక్ష్యైఃశ్లేష్మాప్రకోపముపయాతితథావసంతే ।

తా॥ పగటియందు నిద్రయు మధురపదార్థము శీతలపదార్థము మత్స్యమాంసము గురుపదార్థము పులుసుపదార్థము జిగటపదార్థము ఇవియును నువ్వులు చెరుకు పెరుగు నెయ్యి మజ్జిగ ఇవియును మృదువుపదార్థములు తృప్తికరమయిన పదార్థములు భక్ష్యములు ఉదకపానము వసంతఋతువు ఇవియును కఫప్రకోపమును గలుగంజేయు.

కఫముయొక్క చర్య.

శ్లో॥ శ్వేతత్వశీతత్వగురుత్వకండూస్నేహోపదేహాస్తిమితత్వలేపాః । ఉత్సేదసంక్రాంతచిరక్రియాశ్చకఫస్య కర్మాణివదంతితజ్జ్ఞాః ॥

తా॥ శరీరము తెలుపుపారియుండుట శీతలముగనుండుట బరువుగనుండుట నవకలుగుట శరీరము జిగటగనుండుట బద్ధగించియుండుట లేపత్వము వాపుకలుగుట పనియందుసావుకాశముకలుగుట ఇవి కఫముయొక్క చర్యలని తెలియవలయు.

శ్లో॥ రూక్షక్షారకషాయతిక్తకటుకవ్యాయామనిష్ఠీవనం ।
స్త్రీసేవాధ్వనియుద్ధజాగర జలక్రీడాపదాఘాతనం ।
ధూమస్తాపశిరోవిరేకవమనంస్వేదోపనాహాదికం ।
పానాహారవిహారభేషజమిదంశ్లేష్మాణముగ్రంజయేత్ ॥

తా॥ రూక్షము క్షారము వగరు చేదు కారము ఇట్టిపదార్థసేవనచేతను వ్యాయామము కఫమునుబయలువెడలునటులజేయుట స్త్రీసేవ ధ్వనిచేయుట యుద్ధముచేయుట జాగరణము జలక్రీడయొనర్చుట పాదములందు రుద్దుట ధూమపానముజేయుట వీటిచేతనున్ను తాపము మస్తకవిరేచకము వాంతియు చమటబయిలువెడలించుట వీటిచేతను పానము విహారము ఆహారము వీట్లచే కఫమును శమింపంజేయందగు.

ఆమవ్యాధిలక్షణము.

శ్లో॥ ఆలస్యతంద్రాహృదయావిశుద్ధిర్దోషాప్రవృత్త్యాకులమూలభావైః । గురూదరత్వారుచిసుప్తతాభిరామాన్వితంవ్యాధిముదాహరంతి ॥

తా॥ ఆలస్యము బద్ధగించియుండుట హృదయము అశుద్ధముగనుండుట మఱియు గాత్రములయందు ఖేదులగుట వ్యాకులముగనుండుట మూలోపద్రవముగలుగుట కడుపు బరువుగనుండుట అరుచి నిద్రయు ఇట్టిలక్షణములచే ఆమయుక్తవ్యాధియని యెఱుంగ వలయును.

శ్లో॥ ఆమంజయేల్లంఘనకోష్ణపేయాలఘ్వన్నరూక్షోదనతిక్తయూషైః।
నిరూహణైస్స్వేదనపాచనైశ్చసంశోధనైరూర్ధ్వమధస్తథాచ ॥

తా॥ లంఘనము మందోష్ణమైనగంజి లఘుఅన్నము రూక్షాన్నము వగరు పెసలు మొదలగువాటిగంజి నిరూహవస్తి ఆవిపట్టడము ఆమము పక్వమగునట్లుచేయుట విరేచనము వాంతి వీటివలన ఆమవ్యాధినశించు.

వయోవిచారము.

శ్లో॥ బాల్యమాషోడశాద్వర్షాత్తతో మధ్యోదిసప్తతిః।
వృద్ధస్తదూర్ధ్వంవిజ్ఞేయోవయోమానమితిత్రిధా ॥

తా॥ జన్మప్రభృతి 16 సంవత్సరములపర్యంతము బాల్యము 17 వ సంవత్సరము మొదలు 70 సంవత్సరములవరకు మధ్యమవయస్సు 71 వ సంవత్సరము మొదలు యావజ్జీవము వృద్ధత్వమని యెఱుంగవలయును.

రోగియొక్క సామాన్యలక్షణము.

శ్లో॥ అత్యంతగర్హితావేతౌ సదాస్థూలకృశౌనరౌ।
శ్రేష్ఠోమధ్యశరీరస్తుకృశస్స్థూలాత్తుపూజితః ॥
కర్షయేద్బృంహయేద్వాపి సదాస్థూలకృశౌనరౌ।
రక్షణంచైవమధ్యస్యకుర్వీతసతతంభిషక్ ॥

తా॥ ఎల్లప్పుడు స్థౌల్యము కార్శ్యము యీ రెండును పురుషునికి అత్యంతనిందకు హేతువులగును గాన అతికృశుడు అతిస్థూలుడు వీరిద్దరు పూజ్యులుకారు. స్థౌల్యకార్శ్య విహీనమైన మధ్యమశరీరముగల పురుషుడు శ్రేష్ఠుడు. గాన కుశలవైద్యుడు స్థౌల్యమునకు కర్షణచికిత్సయు కృశత్వమునకు బృంహణోపచారములుచేయవలయును. మరియు మధ్యమ స్థౌల్యకార్శ్యరూపదోషములు జనింపనటుల సంరక్షణచేయవలయును.

## స్వస్థలక్షణము.

శ్లో॥ సమదోషస్సమాగ్నిశ్చస్సమధాతుమలక్రియః ।
ప్రసన్నాత్మేంద్రియమనాఃస్వస్థఇత్యభిధీయతే ॥

తా॥ వాతపిత్తశ్లేష్మములు జఠరాగ్ని రసాది సప్తధాతువులు మలము ఇవి సమముగనుండుట క్రియలు ఆత్మ ఇంద్రియములు మనస్సు ఇవి ప్రసన్నములుగనుండుట ఇట్టిలక్షణములుగలవాడు స్వస్థుడని నెరుంగవలయు.

## వాతవృద్ధిలక్షణము.

శ్లో॥ వాతేవృద్ధేభవేకార్శ్యంపారుష్యంచోష్ణకామితా ।
గాఢంమలంబలంచాల్పంగాత్రాస్ఫూర్తిర్వినిద్రతా ॥

తా॥ వాతము వృద్ధిజెందినపుడు కార్శ్యము (పారుష్యము) అనగా శరీరము గరగరలాడుట ఉష్ణపదార్థములయందు యిచ్ఛగలుగుట మలముబద్ధగించియుండుట బలములేకయుండుట శరీరము స్ఫూర్తిగనుండకపోవుట నిద్రలేకబోవుట ఇట్టిదోషములు జనించు.

## పిత్తవృద్ధిలక్షణము.

శ్లో॥ విణ్మూత్రనేత్రగాత్రాణాంపీతత్వంక్షీణమింద్రియం ।
శీతేచ్ఛాతాపమూర్ఛాస్స్యుఃపిత్తేవృద్ధేల్పనిద్రతా ॥

తా॥ పిత్తము వృద్ధిజెందినపుడు మలము మూత్రము నేత్రములు శరీరము ఇవి పసపుబారియుండుట ఇంద్రియములు క్షయించియుండుట శీతలపదార్థములయందు ఇచ్ఛగలుగుట సంతాపము మూర్ఛ అల్పనిద్ర ఇవికలుగుట ఇట్టిదోషములు జనించు.

## కఫవృద్ధిలక్షణము.

శ్లో॥ విష్ఠాదిశౌక్ల్యంశీతత్వంగౌరవంచాతినిద్రతా ।
సంధిశైథిల్యముత్క్లేదోముఖసేకఃకఫేధికే ॥

తా॥ కఫము వృద్ధిజెందినపుడు మలము మూత్రము నేత్రములు శరీరము ఇవి తెలుపుపారియుండుట శైత్యగుణముకలుగుట శరీరము బరువుగనుండుట మిగులనిద్రకలుగుట సంధిశైథిల్యము క్లేదము నోటియందునీరూరుట ఇట్టిదోషములు జనించు.

## రసవృద్ధిలక్షణము.

శ్లో॥ రసేవృద్ధేన్నవిద్వేషోజాయతేగాత్రగౌరవం ।
ముఖప్రసేకశ్ఛర్దిశ్చమూర్ఛాప్రసాదోభ్రమఃకఫః ॥

తా॥ రసధాతువు వృద్ధిజెందినేని అన్నద్వేషము శరీరము బరువుగనుండుట నోటియందు నీరూరుట వాంతులు మూర్ఛ కార్శ్యము భ్రమము ఇవి జనించు.

## రక్తవృద్ధిలక్షణము.

శ్లో॥ ప్రవృద్ధంరుధిరంకుర్యాద్గాత్రమారక్తవర్ణకం ।
లోచనంచతథారక్తంసిరాఃపూరయతేపిచ ।
రక్తంతుపరుతేవృద్ధంవిసర్పప్లీహవిద్రధీన్ ।
కుష్ఠంవాతాస్రపిత్తంగుల్మంశిరాపూర్ణత్వకామలే ।
గాత్రాణాంగౌరవంనిద్రామదోదాహశ్చజాయతే ।
వ్యంగాగ్నిసాదసంమోహారక్తత్వక్నేత్రమూత్రతా ॥
గుదమేఢ్రాస్యపాకాదిపిటికామసకాస్తథా ।
ఇంద్రలుప్తాంగమర్దోస్రృగ్దాహస్తాపకరాంఘ్రిషు ।
శమయేద్రక్తవృద్ధింస్రావైరక్తస్యవిరేచనైః ॥

తా॥ శరీరమునందు రక్తము వృద్ధిజెందినేని శరీరము నేత్రములు మూత్రము ఇవి యెరుపుబారి నాడులు రక్తముచే పూరింపబడియుండుటయేగాక విసర్పి ప్లీహము సిరాపూర్ణత్వము విద్రధి కుష్ఠము వాతరక్తము గుల్మము కామల శరీరముబరువుగనుండుట నిద్ర మదము దాహము వంగు అగ్నిమాంద్యము మోహము ఇవికలుగుట మఱియు గుదము శిశ్నము ముఖము వీటియందు వ్రణము అర్శము పిటికములు క్షుద్రరోగము ఇంద్రలుప్తము ఒడలునొప్పు ప్రదరము హస్తపాదములయందు తాపము ఇవికలుగు. రక్తస్రావము విరేచనము వీటిచే శమింపచేయవలయు.

## మాంసవృద్ధి లక్షణము.

శ్లో॥ మాంసంవృద్ధంతుగండోష్ఠస్కంధోదరబాహుషు ।
జంఘయోఃకురుతేవృద్ధింతద్వద్గాత్రస్యగౌరవం ॥

తా॥ శరీరమునందు మాంసవృద్ధిజెందెనేని ఎక్కిళ్లు పెదవులు పిరుదులు ఉపస్థము తొడలు భుజములు పిక్కలు వీట్లయందు వృద్ధిని గలుగంజేయు. మఱియు శరీరము బరువుగనుండు.

మేదోవృద్ధిలక్షణము.

శ్లో॥ ఉదరేపార్శ్వయోర్వృద్ధిఃకాసశ్వాసాదయస్తథా।
దౌర్గంధ్యంస్నిగ్ధతాగాత్రేమేదోవృద్ధాభవేదితి।
ప్రవృద్ధకురుతేమేదశ్శ్రమమల్పేపిచేష్టితే।
తృట్స్వేదగలగండోష్ఠరోగమేహాదిజన్మచ॥
స్ఫిక్జఠరగ్రీవాస్తనానాంనాలంబనంతథా॥

తా॥ శరీరమునందు మేదస్సువృద్ధిజెందెనేని ఉదరము పార్శ్వములు వృద్ధిజెందుటయేగాక దగ్గు ఉబ్బసము శరీరదౌర్గంధ్యము జిడ్డు అల్పచేష్టయందు అతిశ్రమ దప్పిచమట గళగండము పెదవులరోగము మేహము శ్వాసము ఇవికలుగు. మఱియు పిరుదులు కడుపు మెడ స్తనములు ఇవి వ్రేలాడును.

అస్థివృద్ధిలక్షణము.

శ్లో॥ వృద్ధాన్యస్థీనికుర్వంతిఅస్థీన్యన్యానిచాస్థిషు।
ఆచంతిచతథాదంతాన్వికటాన్మహతస్తథా॥

తా॥ అస్థులు వృద్ధిజెందెనేని వాటియందు అస్థ్యంతరములు కలుగుటయు గాక దంతములు వికటములుగను వృద్ధిని జెందినవిగనునుండు.

మజ్జావృద్ధిలక్షణము.

శ్లో॥ మజ్జావృద్ధౌసమస్తాంగనేత్రగౌరవమాచరేత్॥

తా॥ శరీరమునందు మజ్జ వృద్ధిజెందెనేని సంపూర్ణదేహమందున్ను కన్నులయందున్ను బరువుగలిగియుండు.

శుక్రవృద్ధిలక్షణము.

శ్లో॥ శుక్రాశ్మరీశుక్రవృద్ధౌశుక్రస్యాతిప్రవర్తనం॥

తా॥ శుక్రధాతువు మిగుల వృద్ధిజెందెనేని శుక్రాశ్మరి జనించుటయగాక మిగుల శుక్రములు బయలువెడలునటులంజేయు.

మూత్రవృద్ధిలక్షణము.

శ్లో॥ మూత్రేవృద్ధేముహుర్మూత్రమాధ్మానంవస్తివేదనా ॥

తా॥ మూత్రము మిగుల వృద్ధిజెందెనేని పలుమారు మూత్రము బయలువెడలుట పొత్తికడుపుయందు వేదన ఇవి కలిగియుండు.

స్వేదవృద్ధిలక్షణము.

శ్లో॥ స్వేదేవర్ధేతుదౌర్గంధ్యంత్వచికండూశ్చజాయతే ॥

తా॥ శరీరమునందు మిగులచమటగలిగెనేని దౌర్గంధ్యము చర్మమునందు దురద ఇవికలుగు.

ఆర్తవవృద్ధిలక్షణము.

శ్లో॥ ఆర్తవాతిప్రవృత్తిస్స్యాద్దౌర్గంధ్యంచార్తవేభవేత్ ।
అంగమర్దశ్చజాయేతలింగంస్యాదార్తవేధికే ॥

తా॥ స్త్రీలకు ఆర్తవము మిగుల వృద్ధిజెందెనేని దానియందు దౌర్గంధ్యము ఒడలుపిరువు ఇవికలుగు.

స్తన్యవృద్ధిలక్షణము.

శ్లో॥ స్తనయోరతిపీనత్వంక్షీరస్రావోముహుర్ముహుః ।
తోదశ్చాత్రభవతి స్తన్యాధిక్యస్యలక్షణం ॥

తా॥ స్త్రీలకు స్తన్యవృద్ధికలిగెనేని స్తనములు మిగుల బలిసియుండుటయగాక పలుమారు క్షీరస్రావము స్తనములయందు వేదన ఇవికలిగియుండు.

ఉదరవృద్ధిలక్షణము.

శ్లో॥ ఉదరాదిప్రవృద్ధిస్తువృద్ధేగర్భేవిజాయతే ।
స్వేదశ్చగర్భవత్యాస్స్యాత్ప్రసవేవ్యసనంమహత్ ॥

తా॥ గర్భము వృద్ధిజెందెడికాలమున నుదరము మొదలగు అవయవములు మిగుల వృద్ధిజెందెనేని మిగులచమట ప్రసవకాలమునందు మిగులవేదన ఇవికలిగియుండు.

## దోషాదులయొక్క హ్రాసకరణము.

శ్లో॥ తత్తద్ధ్రాసకరాహారవిహారపరివేషణైః ।
దోషధాతుమలానాంహి హ్రాసోనిగదితోనృణాం ।
పూర్వపూర్వోతివృద్ధత్వాద్వర్ధయేద్ధిపరస్పరం ।
తస్మాదతిప్రవృద్ధానాంధాతూనాంహ్రాససంహితం ॥

తా॥ వాతపిత్తశ్లేష్మములు రసాదిసప్తధాతువులు మలమూత్రములు ఆర్తవము ఇవి పూర్వపూర్వవృద్ధివలన అన్యోన్యసహాయముచే వుత్తరోత్తరధాతువులను వృద్ధిపొందింపంజేయు. వాటివలన పైనవుదహరించిన దోషంబులు జనించుగాన ఆధాతువులను ఆహారసంకోచము విహారము వీట్లచే సమముగనుండునటులజేయవలయు. యిటులజేసిన హితముగనుండు.

## సప్తధాతుక్షయలక్షణము.

శ్లో॥ అసాత్మ్యాన్నసదాక్రోధశోకచింతాభయశ్రమైః ।
అతివ్యవాయానశనాత్యర్థసంధనైరపి ।
వేగనాంధారణాశ్చాపిసాహసాదభిఘాతతః ।
దోషాణామథధాతూనాంమలానాంచభవేత్క్షయః ॥

తా॥ వాతపిత్తశ్లేష్మములు రసాది సప్తధాతువులు మలమూత్రములు ఆర్తవము వీటికి అసాత్మ్యఅన్నము యెల్లపుడు క్రోధము శోకము చింత భయము శ్రమ అతి మైథునము వుపవాసము మిగులరేచనము మిగులశరీర (సంశోధనక్రియలు) అనగా ప్రవర్తివమనములకు మిగులతీనుకొనుట (వేగధారణము) అనగా మలమూత్రముల నిరోధించుట సాహసకృత్యము వీట్లచే క్షయముకలుగు.

## వాతక్షయ లక్షణము.

శ్లో॥ వాతక్షయేల్పచేష్టాత్వమందవాక్త్వంవిసంజ్ఞతా ॥

తా॥ వాతక్షయమునందు అల్పచేష్ట మందవాక్కు జ్ఞప్తిలేకయుండుట ఇవి కలుగు.

పిత్తక్షయ లక్షణము.

శ్లో॥ పిత్తక్షయేధికః శ్లేష్మా వహ్నిమందః ప్రభాక్షయః ॥

తా॥ పిత్తక్షయమునందు మిగులకఫము అగ్నిమాంద్యము కాంతిహీనత్వము ఇవికలుగు.

శ్లేష్మక్షయ లక్షణము.

శ్లో॥ సంధయశ్శిథిలామూర్ఛా రౌక్ష్యదాహః కఫక్షయే ॥

తా॥ శ్లేష్మక్షయమునందు సంధులు శిథిలమగుట మూర్ఛ రౌక్ష్యము దాహము ఇవికలుగు.

రసక్షయలక్షణము.

శ్లో॥ హృత్పీడాకంఠశోషశ్చత్వక్శూన్యాత్తృడ్రసక్షయే ॥

తా॥ రసక్షయమునందు హృదయవేదన కంఠశోష శరీరమందు చర్మము వీడుట దప్పి ఇవికలుగు.

రక్తక్షయలక్షణము.

శ్లో॥ శిరాశ్శ్లథాహిమామ్లేచ్ఛాత్వక్పారుష్యంక్షయేసృజః ॥

తా॥ రక్తక్షయమునందు సిరలు శైథిల్యమును జెందుట శరీరము శీతలముగనుండుట పులుసునందు ఆశకలుగుట చర్మము పరుషముగానుండుట యివికలుగు.

మాంసక్షయలక్షణము.

శ్లో॥ గండోష్ఠకంధరాస్కంధవక్షోజఠరసంధిషు ।
ఉపస్థప్రోథపిండీషుశుష్కతాగాత్రరూక్షతా ।
తోదోధమన్యశ్శిథిలాభవేయుర్మాంససంక్షయే ॥

తా॥ మాంసక్షయమునందు దవడలు కంఠము భుజములు రొమ్ము కడుపు సంధులు వుపస్థ ప్రోథము పిక్కలయందు శోషకలుగుట శరీరము రూక్షముగనుండుట వ్యథ ఇవికలుగుటయేగాక నాడులు శైథిల్యమును జెందు.

## మేదక్షయ లక్షణము.

శ్లో॥ ప్లీహాభివృద్ధిస్సంధీనాంశూన్యతాతనురూక్షతా ।
ప్రార్థనాస్నిగ్ధమాంసస్యలిజ్గస్స్యాన్మేదసఃక్షయే ॥

తా॥ మేదస్సుయొక్క క్షయమునందు ప్లీహాభివృద్ధి శరీరసంధులు శూన్యములుగ నుండుట శరీరరూక్ష మరియు కోమలమాంసములయందు యిచ్ఛ ఇవికలిగియుండు.

## అస్థిక్షయలక్షణము.

శ్లో॥ అస్థిశూలంతనోఃకార్శ్యంనఖదంతత్రుటిస్తథా ॥

తా॥ అస్థిక్షయముకలిగినేని యెముకలయందుపోట్లు శరీరమునందు కార్శ్యము మఱియు దంతములు నఖములు ఇవి బద్ధలుగవిచ్చుట ఇవిగలుగు.

## మజ్జాక్షయ లక్షణము.

శ్లో॥ శుక్రాల్పత్వంపర్వభేదస్తోదశ్శూన్యత్వమస్థిని ।
లింగాన్యేతానిజాయంతేనరాణాం మజ్జసంక్షయే ॥

తా॥ మజ్జాక్షయమునందు శుక్రము అల్పమగుట శరీరసంధులయందు నొప్పులు యెముకలయందుపోట్లు మఱియు శూన్యత్వము ఇవిగలుగు.

## శుక్లక్షయలక్షణము.

శ్లో॥ శుక్లక్షయేరతేశక్తిర్వ్యధాశేఫసిముష్కయోః ।
చిరేణశుక్రసేకస్స్యాత్సేకేరక్తాల్పశుక్రతాః ॥

తా॥ శుక్లక్షయమునందు రతియందశక్తి మేఢ్రము వృషణములు వీటియందు వ్యధ మఱియు రతికాలమునందు సావకాశముగ రేతస్సేకముకలుగుట అట్టికాలమందు స్వల్పమైన రక్తసమ్మేళనమును సగా కలిగియుండు.

## ఓజక్షయలక్షణము.

శ్లో॥ ఓజఃక్షయస్తుకోపక్షుత్ చింతాశోకశ్రమాదిభిః ।
ధాతుక్షీణోష్ణకటురూక్షైః కర్షణైరపరైరపి ॥
బిభేతిదుర్బలోభీక్ష్ణంచింతయేద్వ్యథితేంద్రియః ।
దుశ్ఛాయోదుర్మనారూక్షశ్శ్యామస్స్యాదోజసఃక్షయే ॥

తా॥ కోపము ఆకలి చింత శోకము శ్రమ వీట్లచేతను రూక్షపదార్థములు ఉష్ణపదార్థములు చేదుపదార్థములు వీటియొక్క సేవనచేతను మిగుల కృశింపజేసెడి పదార్థములచేతను ఓజస్సుక్షయించు. ఇటుల నోజస్సుక్షయించినవానికి పలుమారు భయము దౌర్బల్యము చింత ఇంద్రియములయందు వ్యథ కాంతివిహీనత్వము వైమనస్యము రూక్ష ఒడలునలుపుపారియుండుట ఇట్టిలక్షణములు గలిగియుండును.

పురీషక్షయలక్షణము.

శ్లో॥ పురీషస్యక్షయే పార్శ్వే హృదయే చ వ్యథా భవేత్ ।
సశబ్దస్యానిలస్యోర్ధ్వ గమనం కుక్షిసంవృతిః ॥

తా॥ పురీషక్షయమునందు పార్శ్వములు హృదయము వీట్లయందు వ్యథ శబ్దముతోగూడినవాయువుకు ఊర్ధ్వగమనము కడుపుబ్బరము ఇవికలుగు.

మూత్రస్వేదక్షయలక్షణము.

శ్లో॥ మూత్రక్షయేల్పమూత్రత్వం వస్తౌ తోదశ్చ జాయతే ।
స్వేదనాశే త్వచో రౌక్ష్యం చక్షుషోరపి రూక్షతా ।
స్తబ్ధాశ్చ రోమకూపాస్స్యుర్లింగం స్వేదక్షయే భవేత్ ॥

తా॥ మూత్రక్షయమునందు అల్పముగమూత్రముకలుగుటయు గాక పొత్తికడుపునందు వ్యథయునుకలుగు. స్వేదక్షయమున చర్మమునందును నేత్రములయందును రూక్షకలుగుటయే గాక రోమకూపంబులు స్తబ్ధములుగనుండు.

ఆర్తవక్షయలక్షణము.

శ్లో॥ ఆర్తవస్య స్వకాలేనాభావస్స్యాదల్పతాథవా ।
జాయతే వేదనా యోనౌ లింగం స్యాదార్తవక్షయే ॥

తా॥ స్త్రీలకు ఆర్తవక్షయమునందు యథోక్తకాలమున రజస్సుయొక్క నిర్గమము లేకపోవుట లేక స్వల్పముగనుండుటయేగాక యోనియందు వేదన జనించు.

స్తన్యక్షయలక్షణము.

శ్లో॥ అభావస్స్వల్పతా వా స్యాత్ స్తన్యస్య భవ స్తథా ।
స్తనానోపచయో వాథ స్త్రీణాం స్తన్యసంక్షయే ॥

తా॥ స్తన్యక్షయమునందు పాలు బొత్తిగ లేకపోవుట లేక అల్పముగ కలిగి యుండుట స్తనములువాడియుండుట ఇట్టిలక్షణములు గలిగియుండు.

గర్భక్షయ లక్షణము.

శ్లో॥ అనున్నతాభి వేత్కుక్షౌగర్భస్యాస్పందనంతథా ।
ఇతిగర్భక్షయేప్రాజ్ఞైర్లక్షణంసముదాహృతం ॥

తా॥ గర్భక్షయమునందు ఉదరము ఉన్నతముగ నుండకపోవుటయేగాక గర్భము చలించకయుండు.

క్షీణధాతువృద్ధిలక్షణము.

శ్లో॥ తత్తత్సంవర్ధనాహారవిహారాతినిషేవణాత్ ।
తత్తత్రాప్యనర్ఘ్యైఘ్నీంతత్తక్షయమపోహతి ॥

తా॥ పైనజెప్పిన రసాదిసప్తధాతువులు మొదలగువాటియొక్క క్షయమునందు ఆయారసాదివృద్ధికరములగు పదార్థములయొక్క సేవ విహారము వీటివలన ఆయా ధాతువు వృద్ధినిజెందుటయేగాక ధాతుక్షయమువలన ముక్తుడగు.

ఓజోవృద్ధిలక్షణము.

శ్లో॥ ఓజస్సంవర్ధతేస్వాన్నానాంసుస్నిగ్ధసాన్ద్వైమభిస్తథా ।
వృష్యైర్రసైశ్చ పానైః క్షీరమాంసరసాదిభిః ॥

తా॥ మనుజునియొక్క శరీరమునందుండెడి శుక్రోపధాతువగు ఓజస్సు కోమలములగు రుచికరములగు ఇంద్రియపుష్టికరములగు పదార్థములయొక్క ఆహారములచేతను మఱియు పాలు మాంసరసము వీటియొక్క సేవనచేతను విశేషముగ వృద్ధినిజెందు.

దోషధాతుమలవృద్ధిలక్షణము.

శ్లో॥ దోషధాతుమలక్షీణో బలక్షీణోపి మానవః ।
తత్తత్సంవర్ధయోద్యద్యదన్నపానంప్రకాంక్షతి ॥

తా॥ వాత పిత్త శ్లేష్మములు రసాదిసప్తధాతువులు వాటిమలములు ఇవి దౌర్బల్యముజెందుటచే మానవుడు దుర్బలుడయ్యేని యేయేఅన్నపానాదులచే దోషధాతుమలంబులు పుష్టినిజెందునో అట్టి అన్నపానాదులచే వాటిని వృద్ధిపొందించవలయు.

శ్లో॥ యద్యదాహారజాతంతుక్షీణః ప్రార్థయతేనరః ।
తస్యతస్యసలాభేనతత్తత్క్షయమపోహతి ॥

తా॥ దోషధాతుమలక్షయములను జెందిన మానవుడు తానుకోరిన మధురాద్యాహారముల సేవవలన పుష్టిని జెందు.

వాతపుష్టి సేవ.

శ్లో॥ కషాయకటుతిక్తానిబ్రూత్స్యశీతలఘూనిచ ।
యవముద్గప్రియంగూంశ్చవాతక్షీణోఽభికాంక్షతి ॥

తా॥ వాతక్షయముగల మనుజుడు కారము చేదు వగరు చల్ది శీతలపదార్థములు మఱియు యవలు పెసలు కొఱ్ఱలు వీటియొక్క సేవచేతను పుష్టిని జెందు.

పిత్తపుష్టి సేవ.

శ్లో॥ లవణామ్లకటూష్ణాదిపిత్తాన్నవికృతింతథా ।
మస్తుసూక్తామ్లతక్రాణికాంజికంచతథాదధి ॥
కట్వమ్లలవణోష్ణానితీక్ష్ణంక్రోధంవిదాహిచ ।
సమయందేశముష్ణంచపిత్తక్షీణోఽభికాంక్షతి ॥

తా॥ పిత్తక్షయముగల మనుజుడు ఉప్పులు మినుములు పులుపులు పిండివంటలు మఱియు పెరుగుమీఁది తేట సూక్తము పుల్లనిమజ్జిగ కాంజికము పెరుగు చేదు కారము వులును ఉప్పు ఉష్ణమయినవిగల పదార్థములచే పుష్టిని జెందు. మరియు కోపము రెండవ ఉష్ణదేశము వీటిని సహించుచుండు.

శ్లేష్మపుష్టి సేవ.

శ్లో॥ మధురస్నిగ్ధశీతానిలవణామ్లగురూణిచ ।
దధిక్షీరందివాస్వప్నంశ్లేష్మక్షీణోఽభికాంక్షతి ॥

తా॥ శ్లేష్మక్షయముగల మానవుడు మధురపదార్థములు మృదుపదార్థములు శీతలపదార్థములు లవణపదార్థములు పులుసుపదార్థములు గురుపదార్థములు అగుపట్టి పదార్థసేవచేతను మఱియు పెరుగు పాలు వీటియొక్క సేవచేతను పుష్టిని జెందు. మఱియు పగటినిద్రయందు ఆసక్తి గలవాడగుచుండు.

## రసధాతుపుష్టి సేవ.

శ్లో॥ రసక్షీణోనరఃకాంక్షత్యంభోతిశిశిరమ్ముహుః ।
రాత్రినిద్రాంహిమంచంద్రంభోక్తుంచమధురంరసం ॥

తా॥ క్షీణరసధాతువుగల మనుజుడు అతి శీతలోదకమును రాత్రియందు నిద్రయును మంచును చంద్రుని వీట్లనుపలుమారుకోరుచుండు. మఱియు మధురాహారము నందు ప్రీతిగలవాడుగనుండు.

## రక్తధాతుపుష్టి సేవ.

శ్లో॥ ఇక్షుమాంసరసంమంథంమధుసర్పిర్గుడోదకం ।
ద్రాక్షాదాడిమసూక్తానిసస్నేహాలవణానిచ ॥
రక్తసిద్ధానిమాంసానిరక్తక్షీణోభికాంక్షతి ॥

తా॥ రక్తక్షయముగల మనుజుడు చెరకురసము మాంసరసము 1 మంథము 2, సూక్తము రక్తసిద్ధమాంసములు వీట్లచే పుష్టినిజెందు.

## మేదోపుష్టి సేవ.

శ్లో॥ ఖాండవామధురామ్లాదిరససంయోగపాచితాః ।
మేదస్సిద్ధానిమాంసానిగ్రామ్యానూపౌదకానిచ ।
సక్షారాణివిశేషేణమేదఃక్షీణోభికాంక్షతి ॥

తా॥ మేదక్షయముగలపురుషుడు (ఖాండవము) అనగా శ్రీఖండశిఖరిణీత్యాది మధురామ్లాదిరససంయోగముతో పక్వమైన ద్రవ్యవిశేషము సిద్ధమాంసము గ్రామ్యమాంసము జలచరమాంసము ఉప్పుగలమాంసము వీటిచే పుష్టినిజెందు.

---

1 మంథమనగా శర్కర ద్రాక్ష వీటియొక్క మేళనముతో సిద్ధమైన వస్తువు.

2 సూక్తమనగా తేనె నెయ్యి బెల్లము వుదకము ద్రాక్ష దాళింబపండు కందమూలములు ఫలములు చమురు లవణము కాంజికభేదము మద్యము. వీటియొక్క మేళనముతో ఉత్పన్నమైనద్రవ్యము.

మాంసపుష్టి సేవ.

శ్లో॥ అన్నానిదధిసిద్ధానిఖాణ్డవాంశ్చబహూనపి ।
స్థూలక్రవ్యాదమాంసానిమాంసక్షీణోఽభికాంక్షతి ॥

తా॥ మాంసక్షయముగలమనుజుడు పెరుగుతో సిద్ధమైన అన్నము శ్రీఖండభేదములు స్థూలము జడము ఇట్టిక్రవ్యాదిమాంసములు వీట్లచే పుష్టినిబెందు.

అస్థి మజ్జా వీటియొక్క వృద్ధి లక్షణము.

శ్లో॥ అస్థిక్షీణస్తథామాంసంమజ్జాస్థిస్నేహసంయుతం ।
స్వాద్వమ్లసంయుతంద్రవ్యంమజ్జాక్షీణోఽభికాంక్షతి ॥

తా॥ అస్థిక్షయముగలమనుజుడు మాంసము మజ్జ అస్థిస్నేహయుక్తమైన అన్నము వీటియందు ఇచ్ఛగలవాడుగనుండు. మఱియు మజ్జాక్షీణముగల పురుషుడు తీపు పులుసు వీటితో గలిసిన అన్నాదులయందు ఇచ్ఛగలవాడుగనుండు.

శుక్రపుష్టి సేవ.

శ్లో॥ శిఖిసః కుక్కుటస్యాండంహంససారసయోస్తథా ।
గ్రామ్యానూపోదకానాంచశుక్రక్షీణోఽభికాంక్షతి ॥

తా॥ శుక్రక్షయముగలపురుషుడు నెమలి కోడి హంస సారసము వీటియొక్క గుడ్లును జలస్థలములయందున్నుండే జంతుస్థలమాంసములు వీటియందు ఇచ్ఛగలవాడుగనుండు.

మలపుష్టి సేవ.

శ్లో॥ యవాన్నంయావకాన్నంచశాకానివివిధానిచ ।
మసూరమాషయూషంచమలక్షీణోఽభికాంక్షతి ॥

తా॥ మలక్షయముగలమనుజుడు యవాన్నమును యావకాన్నమును నానావిధశాకములును మఱియు చిఱుశనగలు పెసలు వీటియొక్క యూషమునుకోరును.

మూత్రపుష్టి సేవ.

శ్లో॥ నెయ్యామిక్షురసంక్షీరంసగుడంబహుశోదకం ।
మూత్రక్షీణోఽనిలమతిర్గ్రపునాహ్యాన్... ॥

తా॥ మూత్రక్షయముగలపురుషుడు చెరకురసము పాలు బెల్లము రేగుపండ్లు ఉదకము దోసకాయ వీట్లచే పుష్టినిజెందు.

## స్వేదక్షీణాభివర్ధనము.

శ్లో॥ అభ్యంగోద్వర్తతేమద్యంనివాతశయనాసనే ।
గురుప్రావరణంచైవస్వేదక్షీణోభికాంక్షతి ॥

తా॥ స్వేదక్షయముగల పురుషుడు అభ్యంజనము ఉద్వర్తనము మద్యము నివాసస్థానమునందునివాసము శయనము సకలాతులు మొదలగువాటిని కప్పుకొనుట యందును ఇచ్ఛగలవాడుగనుండు.

## ఆర్తవక్షయవర్ధనము.

శ్లో॥ కట్వమ్లలవణోష్ణానివిదాహీనిగురూణిచ ।
ఫలశాకానుపానాని స్త్రీవాంఛత్యార్తవక్షయే ॥

తా॥ స్త్రీలకు ఆర్తవక్షయమునందు చేదు పులుసు ఉప్పు ఉష్ణము జడము మఱియు తాపముపుట్టించెడు అన్నము మఱియు ఫలములు శాకములు శీతలమైన పాన వస్తువులు వీటియందు ఇచ్ఛగలిగియుండు.

## స్తన్యక్షయవర్ధనము.

శ్లో॥ సురాశాల్యన్నమాంసాని గోక్షీరంశర్కరాంతథా ।
ఆసవందధిహృద్యాని స్తన్యక్షీణాభివాంఛతి ॥

తా॥ స్త్రీలకు స్తన్యక్షయమునందు మద్యము శాల్యన్నము మాంసము ఆవుపాలు శర్కర ఆసవము పెరుగు మఱియు మనోహరపదార్థములు వీటిచేపుష్టినిజెందు.

అష్టస్థానపరీక్ష ముగిసెను.



శ్రీరస్తు.

# వైద్యామృతము.



## చికిత్సాప్రారంభము

శ్లో॥ సమస్తామయముఖ్యత్వాజ్జ్వరస్యప్రథమంమయా।
ప్రతీకారస్సుధాతుల్యోయథామతినిగద్యతే ॥

తా॥ జ్వరము అన్నిరోగములలో ముఖ్యమైనదగుటవలన ముందుగా దానికి అమృతతుల్యమగు ప్రతిక్రియంజెప్పెద.

### జ్వరదినచర్య.

శ్లో॥ అథజ్వరదినేచర్యాంనక్ష్యేహంశాస్త్రసమ్మతమ్ ।
జ్వరస్యాద్యదినేకుర్యాన్నిర్లంఘనమతఃపరమ్ ।
ద్వితీయేహ్నిచోత్థితఃకుర్యాద్వైదంతధావనమ్ ।
జిహ్వానిర్లేఖనంకుర్యాన్ముఖంప్రక్షాళ్యవారిణా ।
మూర్ధ్నివస్త్రంతతోబధ్వాశయనంవామభాగతః ।
పూర్వవల్లంఘనంకుర్యాత్తృతీయదివసేతతః ।
చతుర్భాగావశేషంతుశృతంతోయంస్వచిత్పిబేత్ ।
తత్తోయదోషనాశాయభక్షయేత్కతకబీజకమ్ ॥

తా॥ జ్వరమువచ్చినదినమునందు లంఘనముచేయవలెను. రెండవదినము ఉదయమునలేచి దంతధావనముజేసికొని నాలుకగీచుకొని వేన్నీళ్లతోప్రక్షాళించి ముఖము కడుగుకొనవలయు. పిదప తలకు బట్టకట్టుకొని యెడమచెయ్యి క్రిందుగాపెట్టుకొని పరుండి ఆదినమంతయు లంఘనముచేయవలయు. మూడవదినము చాతుర్భాగావశేషముగా నీళ్లుకాచిత్రాగవలయు. ఆనీళ్లలోని దోషముపోగొట్టుటకై ఒకచిల్లగింజ సుగంధముతీసి దానినిలోపలికి తీసుకొనవలయును. నాలుగవదినమందును యీప్రకారము చేయవలయును.

శ్లో॥ చతుర్థేదినేసంప్రాప్తేపూర్వవల్లంఘనంచరేత్ ।
పంచమేహనిసంప్రాప్తేయవాగూప్రాశనంతతః ।
షష్ఠేహనితథాకుర్యాత్పయస్సాన్యత్సప్తమేహని ।
గండూషంపూర్వవత్కృత్వాఔషధంసంపిబేత్తతః ।
యవాగూంపూర్వవత్ప్రాశ్యఔషధంత్రిదినంపిబేత్ ।
అథవానవమేదద్యాజ్జ్వరముక్తోభవేత్తతః ।
పథ్యంలఘుతరంజ్ఞేయంవిరేకంతదనంతరమ్ ॥

తా॥ నాలవదినమునందు పూర్వమువలెనే లంఘనము చేయవలయు. 5 వ దినమునందు గంజితాగవలయు. 6 వ దినమునందును ఆలాగేచేయవలయు. 7 వ దినమునగాని 9 వ దినమునగాని గండూషముజేసికొనిన జ్వరమువిడుచును. లఘుతరమైనపథ్యములుచేయవలయు. ఆవెనుక విరేచనమునను పుచ్చుకొనవలయు.

జ్వరపక్వప్రమాణము.

శ్లో॥ అంతఃపరంప్రవక్ష్యామిజ్వరవారప్రమాణకమ్ ।
సప్తరాత్రంవాతకంచషడ్రాత్రంచాథపైత్యకమ్ ।
నవరాత్రంకఫశ్చైవద్వంద్వేదశరాత్రకమ్ ।
జ్వరపాకంభవేచ్చైవాపృథపూర్వంజ్వరంహరేత్ ॥

తా॥ వాతజ్వరమునకు 7 దినములు పైత్యజ్వరమునకు 6 దినములు శ్లేష్మజ్వరమునకు 9 దినములు ద్వంద్వజ్వరమునకు 10 దినములు ఈప్రమాణముచొప్పున జ్వరపక్వమై జ్వరమువిడుచును. (ఈకాలమును అతిక్రమించి జ్వరమువిడువకుండిన పురాణజ్వరములక్రింద చికిత్స చేయవలయు.)

గంజిపోసేకాలము.

శ్లో॥ వాతకేచాపరాహ్ణేచపూర్వాహ్ణేచాథపిత్తకే ।
శ్లేష్మకేచాథమధ్యాహ్నే యవాగూకాలమాచరేత్ ॥

తా॥ వాతజ్వరముగలవానికి అపరాహ్ణమందును పైత్యజ్వరముగలవానికి పూర్వాహ్ణమందును శ్లేష్మజ్వరముగలవానికి మధ్యాహ్నమందును గంజిపోయవలయు. ఇదియె వాగులక్షణము.

## లంఘనక్రమము.

శ్లో॥ లంఘనంత్రివిధంప్రోక్తంవాతపిత్తకఫేతథా ।
లంఘనంచోపవాసస్స్యాల్లంఘనంభోజనంలఘు ।
లంఘనంచోష్ణపానీయంలంఘనంపరమౌషధమ్ ॥

తా॥ లంఘనములు 3 విధములు. వాతజ్వరముకలవాడు ఉపవాసముచేయవలయు. పిత్తజ్వరముగలవాడు లఘుభోజనము జేయవలయు. శ్లేష్మజ్వరముగలవాడు రుణాముగ గంజితాగవలయు. ఇది లంఘనక్రమము.

## లంఘనముచేయరానివారు.

శ్లో॥ అతిసారేతుగర్భిణ్యాంవృద్ధానాంచశిశౌతథా ।
క్షీణవీర్యాధ్వగశ్రాంతానేత్రరోగేచయక్ష్మణి ।
గ్రహణీరోగిణాంచైవలంఘనంపరివర్జయేత్ ॥

తా॥ అతిసారవ్యాధిగలవారు గర్భిణీస్త్రీలు వృద్ధులు శిశువులు శుష్కించినవారు దూరమునడిచి అలసినవారు నేత్రక్షయరోగులు గ్రహణీరోగులు వీరలు లంఘనమును వర్జింపవలయు.

శ్లో॥ యదిదంవైద్యశాస్త్రోక్తంజ్ఞాత్వాతుప్రథమంభిషక్ ।
తతోరోగనిదానంచకుర్యాత్సమ్యక్చికిత్సితమ్ ॥

తా॥ ఈవైద్యశాస్త్రమతమును రోగోత్పత్తినియెరిగి వైద్యులయినవారు చికిత్సచేయవలయు.

## స్త్రీసంగమదోషలక్షణము.

శ్లో॥ తరుణజ్వరమధ్యేచయువతీసంగమేతథా ।
జాయతేదారుణోదోషోహ్యంగవైకల్యకంపతా ।
వక్షోంతరేచసంతాపఃప్రలాపోదాహవిభ్రమః ।
పాదపాణితలేశైత్యందోష స్త్రీసంగమేస్మృతమ్ ।

తా॥ తరుణజ్వరములో స్త్రీసంగమమువలన దోషములుపుట్టును. వాటి లక్షణములెట్టివనిన—శరీరమునొచ్చుట వణకుట రొమ్ములోమంటకలుగుట అనావశ్యకమైనమాటలాడుట తాపముకలుగుట భ్రమించుట కాళ్లుచేతులు చల్లనై యుండుట యివిగలిగిన స్త్రీసంగమదోషమని తెలుసుకొనవలయు.

వాతజ్వరపిత్తజ్వరచికిత్సా.

శ్లో॥ వాతజ్వరంహంతియవాసవిశ్వాముస్తాగుడూచీజనితఃకషాయః।
పిత్తజ్వరంహంతిరజఃకషాయశ్ఛిన్నాశివాపర్పటజోథవాపి ॥

తా॥ దురదగొండివేళ్లు శొంఠి తుంగముస్తెలు తిప్పతీగె వీటిని కషాయముపెట్టి పుచ్చుకొనిన వాతజ్వరముమానును. పర్పాటకముయొక్క కషాయమునుగాని లేక తిప్పతీగె కరకపిందెలు పర్పాటకము వీటియొక్కకషాయమునుగాని పుచ్చుకొనిన పిత్తజ్వరము నివారణమగును.

శ్లో॥ భార్గీపుష్కరదేవదారుమగధాభిన్నావృషాబ్దౌషధైః క్వాథోయం
కఫజజ్వరంకసనకంసశ్వాసపార్శ్వగ్రహం। మాంద్యంజాఠరవహ్ని
జాతమరుచింనిర్మూలయత్యేవసత్పక్వోష్ణం క్షుధితోయథాతరు
గణాన్ఘోరంఝంఝామరుద్వాయథా ॥

తా॥ గంటుభారంగివేళ్లు * పుష్కరమూలము దేవదారుచెక్క పిప్పళ్లు తిప్పతీగె అడ్డసరపాకు తుంగముస్తెలు శొంఠి వీటిని కషాయముపెట్టిపుచ్చుకొనిన శ్లేష్మజ్వరము దగ్గు ఉబ్బసము పార్శ్వపుపోట్లు అగ్నిమాంద్యము అరుచి యివి మానును.

వాతజ్వరమునకు శీతభంజీరసము.

శ్లో॥ పారదంరసకంతాళంశిఖితుత్థంచటంకణం।
గంధకంచసమంపిష్ట్వాకారవేల్లరసైర్దినం।
తామ్రపాత్రోదరేపేష్యంయంత్రేపాత్రంతతోధోముఖం।
దత్వారుధ్వావిశోష్యాథవల్కలాభిఃప్రపూరయేత్।

---

* పుష్కరమూలము దొరకనియెడల ఆముదపువేరును చేర్చుకొనవలయు.

పచేద్ధాత్ర్యాగ్నినాచుల్ల్యాంతామ్రపృష్ఠగతాయదా ।
స్ఫుట స్త్రిప్రిహాయశ్శుద్ధోరస స్తంస్వాంగశీతలం ।
తామ్రపాత్రాత్సముద్ధృత్యచూర్ణయేన్మరిచైస్సమం ।
శీతభంజీరసోనామద్వగుంజంవాంతికేజ్వరే ।
వాతవ్యాఃపర్ణఖండేనతత్క్షణాన్నాశయేజ్జ్వరం ।
త్రైదినంవిషమంత్రీవంఏకద్విత్రిచతుర్థకం ॥

తా॥ శుద్ధిజేసినరసము శుద్ధిజేసినకల్కప్పరి శుద్ధిజేసిన తాళకము శుద్ధిజేసిన మైల్తుత్తము వెలిగారము గంధకము వీటిని సమములుగ ఖల్వమునందునిచి కాకరాకు రసముచే వొకదినముమర్దించి పిదప ఔషధమును వొకతామ్రపాత్రకు లోపలపట్టించి దానిని అథోముఖముగనునిచి దానిక్రింద మరియొకపాత్రనునిచి చీలమన్నుయిచ్చి ఎండించి పొయిమీదనునిచి యేరుదుపిడకలనునిండించి తీవ్రాగ్నిచే పక్వముజేయుచు ఆతామ్రపాత్రమునకు పైనవడ్లుపోశియునిచిన అవడ్లు యెప్పుడు పగిలి పేలగింజలగునో అపుడు సుశుద్ధమగు. దానిని స్వాంగశీతలమునదీసి మిరియాలుచేర్చి చూర్ణించినశీతభంజీరసమనంబడు. దీనిని తమలపాకులతో రెండుగురిగింజలయెత్తు పుచ్చుకొనిన వాతజ్వరము తత్క్షణముననివర్తించు. మరియు మూడుదినములుసేవించిన తీవ్రమగు విషమజ్వరము ఏకాహిక ద్వ్యాహిక త్ర్యాహిక చాతుర్థిక జ్వరములునగా నివర్తించు.

త్రిఫలాదిచూర్ణము.

శ్లో॥ త్రిఫలాత్ర్యూషగుడకంశర్కరాత్రివృతార్ధకం ।
మోదకంభక్షయిత్వాతుపిబేచ్చోష్ణజలంపునః ।
పార్శ్వశూలేఽరుచౌకాసేజ్వరేచానిలసంభవే ॥

తా॥ త్రిఫలములు త్రికటుకములు వీటినిచూర్ణించి బెల్లముకలిపిపుచ్చుకొని శేడిసీళ్లుత్రాగినను లేక తెగడచూర్ణము 1 భాగము చక్కెరరెండుభాగములు చేర్చి పుచ్చుకొని ఉష్ణోదకపానముజేసినను పార్శ్వశూల అరుచి దగ్గు వాతజ్వరము యివి నివర్తించు.

వాతపిత్తజ్వరచికిత్సా.

శ్లో॥ కరోతినాగరాన్మృతా [illegible] సంస్కృతం [illegible] ।
[illegible]

తా॥ సీమనేలవేము శొంఠి తిప్పతీగె పర్పాటకము తుంగగడ్డలు వీటిని కషాయము పెట్టి పుచ్చుకొనిన వాతపిత్తజ్వరము మానును.

శ్లో॥ త్రిఫలామృతలోహంచభృంగరాజంచమూర్ఛితం ।
చూర్ణమర్జునపత్రస్యత్రిజాతశిలాజతు ।
త్ర్యూషణంతుల్యతుల్యాంశంసర్వేషాంచసమాసితాక్షౌ
ద్రేణవటికాకార్యాకర్షమాత్రంచభావయేత్ ।
వాతపిత్తజ్వరంహంతిఅనుపానంచకల్పయేత్ ॥

తా॥ త్రిఫలములు మృతలోహము గుంటగలగర మద్దిఆకు త్రిజాతకములు శిలాజితు శొంఠి పిప్పలి మిరియాలు వీటిని సమముగ చేర్చి చూర్ణించి చూర్ణమునకు సమముగ చక్కెరచేర్చి తేనెకలిపిమాత్రలుజేసి కర్షమాత్రము అనుపానయుక్తముగ సేవించిన వాతపిత్తజ్వరము నివర్తించు.

వాతపిత్తజ్వరచికిత్స.

శ్లో॥ పంచమూల్యమృతాముస్తావిశ్వాభూనిమ్బసాధితః ।
కషాయశ్శమయత్యాశువాయుమాయుభవంజ్వరమ్ ॥

తా॥ లఘుపంచమూలములు అనగా (చిన్నములక పెద్దములక కోలపొన్న నేలపొన్న పల్లేరువేళ్లు) తిప్పతీగె తుంగముస్తెలు సొంటి నేలవేము వీనిని సమభాగములుగ కషాయముకాచి పుచ్చుకొనిన వాతపిత్తజ్వరము శీఘ్రముగహరించు.

శ్లేష్మవాతజ్వరచికిత్సా.

శ్లో॥ ఆరగ్వధాభయాతిక్తాగ్రంధికాబ్దశ్శృతంపిబేత్ ।
కఫవాతజ్వరేసామశూలేదీపనపాచనమ్ ॥

తా॥ రేలకాయలలోనిగిజరు కరకపిందెలు కటుకరోహిణి మోడి తుంగముస్తెలు వీటినికషాయము పెట్టి పుచ్చుకొనిన శూలతోకూడా బంకపడునట్టి శ్లేష్మవాతజ్వరము నశించి దీపనపాచనములును కలుగును.

## పిత్తశ్లేష్మజ్వరచికిత్సా.

శ్లో॥ రక్తంచందనధనామృతవల్లీనింబపద్మకభవంక్వథితంస్యాత్ ।
ఆశుపిత్తకఫజజ్వరతృష్ణాదాహవాతహరమగ్నికరంచ ॥

తా॥ రక్తచందనము ధనియాలు తిప్పతీగె వేపచెక్క తామరకాడలు వీటిని కషాయముపెట్టి పుచ్చుకొనిన పిత్తశ్లేష్మజ్వరము దాహము తాపము అగ్నిమాంద్యము వాతము ఇవిమానును.

శ్లో॥ కళింగశుంఠీఘనతిక్తతిక్తానింబామృతాధాన్యరజోన్వితానాం ।
సరింగిపుష్కరచందనానాంపటోలభార్గీవృషపద్మకానాం ।
కషాయకఃకాసవమీపిపాసాదాహాన్వితేచాష్టవిధజ్వరార్తే ।
సజంతురోగేఽరుచికామలార్తేదోషత్రయాశేగదితోమునీంద్రైః

తా॥ కొడిశవిత్తులు శొంఠి తుంగముస్తలు సీమనేలవేము కటుకరోహిణి వేపచెక్క తిప్పతీగె ధనియాలు పర్పాటకము చిన్నములుక పుష్కరమూలము శ్రీగంధము చేదుపొట్ల గంటుభారంగి అడ్డసరపాకు తామరకాడలు వీటినికషాయముపెట్టిపుచ్చుకొనిన దగ్గు వమనము అతిదాహము మంటలు అష్టవిధజ్వరములు క్రిమిరోగములు అరుచి కామిల సన్నిపాతములు ఇవిమానును.

## సన్నిపాతజ్వరలక్షణము.

శ్లో॥ అతఃపరంప్రవక్ష్యామిసన్నిపాతజ్వరక్రమమ్ ।
కంఠేలలాటేహృదయేస్వేదస్తంద్రామతిభ్రమః ।
అంగదాహశ్శిరోరుక్చదాహస్సర్వాంగనేత్రయోః ।
నేత్రేశోణితపీతేచమూర్ఛాభ్రాంతిఃప్రలాపకః ।
హృచ్ఛూలాగుంభసంహిక్కాకాసశ్వాసంచహర్షణమ్ ।
సన్నిపాతజ్వరంఘోరంనిశ్చితంవైద్యసాగరైః ॥

తా॥ కంఠము నుదురు ఎదురురొమ్ము వీటియందు చెమటపట్టుట కునుకుపాట్లు మనశ్చాంచల్యముకలుగుట శరీరమునందు తాపము తలనొప్పి శరీరమంతయును నొప్పులు కన్నులయందు మంట కన్నులు యెఱ్ఱగాగాని పసుపుపచ్చగాగానియుండుట మూర్ఛ

తలుచుమాటలాడుట ఎచ్చుతగ్గుగా మాటలాడుట రొమ్మునొప్పి దగ్గుతిత్తికొపడుట యెక్కిళ్లు దగ్గు ఉబ్బసముకలుగుట నవ్వుట యిట్టిలక్షణములుకలిగిన సన్నిపాతమని తెలిసికొనవలయు.

## సన్నిపాతనామములు.

శ్లో॥ సన్ధికశ్చాంతకశ్చైవహృద్దాహశ్చిత్తవిభ్రమః ।
శీతాంగస్తాంద్రికశ్చైవకంఠకుబ్జశ్చకర్ణికః ।
భగ్ననేత్రశ్చరక్తోష్ఠఃప్రలాపోజిహ్వకస్తథా ।
అభిన్యాసఇతిప్రోక్తస్సన్నిపాతాస్త్రయోదశ ।
షట్సాధ్యాస్సప్తచాసాధ్యావిజ్ఞేయావైద్యపారగైః ॥

తా॥ సంధికము అంతకము హృద్దాహము చిత్తవిభ్రమము శీతాంగము తాంద్రికము కంఠకుబ్జము కర్ణికము భగ్ననేత్రము రక్తోష్ఠము ప్రలాపకము జిహ్వకము అభిన్యాసము అన సన్నిపాతములు 13 విధములు. ఇందులో సాధ్యములు 6 అసాధ్యములు 7.

## సాధ్యసన్నిపాతములనామములు.

శ్లో॥ సంధికంతాంద్రికంచైవప్రలాపశ్చిత్తవిభ్రమః ।
జిహ్వకంకర్ణికంచైవషట్సాధ్యాఃపరికీర్తితాః ॥

తా॥ సంధికము తాంద్రికము ప్రలాపము చిత్తవిభ్రమము జిహ్వకము కర్ణికము అన 6 సన్నిపాతములును సాధ్యములని తెలిసికొనవలయు.

## అసాధ్యసన్నిపాతములనామములు.

శ్లో॥ హృద్దాహమంతకంభగ్ననేత్రస్స్యాత్కంఠకుబ్జకమ్ ।
రక్తోష్ఠకంశీతగాత్రమభిన్యాసాతిదారుణమ్ ।
సన్నిపాతాఇమేసప్తాప్యసాధ్యాఃపరికీర్తితాః ॥

తా॥ హృద్దాహము అంతకము భగ్ననేత్రము కంఠకుబ్జము రక్తోష్ఠము శీతాంగము అభిన్యాసము అన ఈ 7 సన్నిపాతముల సాధ్యములని తెలిసికొనవలయు.

సంధికసన్నిపాతలక్షణము.

శ్లో॥ స్వరూపంపూర్వవచ్ఛూలంశోథవాతంచవేదనా ।
కఫస్తంద్రాతితాపంచసంధికేసన్నిపాతకే ॥

తా॥ శరీరమెప్పటివలెనుండుట శూలకలుగుట శరీరమువాచుట నొప్పుట దగ్గు నిద్ర అతితాపముకలుగుట ఇవికలిగిన సంధిక సన్నిపాతలక్షణమని తెలియవలయు. (ఇది సాధ్యము).

తాంద్రికసన్నిపాతలక్షణము.

శ్లో॥ బద్ధఃప్రలాపస్తంద్రాచజిహ్వాశ్యావమాసకంటకా ।
కఠినానిర్ద్రవాశుష్కాసంతాపశ్చాతిసారకమ్ ।
శ్వాసఃకంఠమావిరూపాక్షస్తోయంస్రవతిలోచనే ।
జ్వరమత్యుత్కటంచైవతాంద్రికేసన్నిపాతకే ॥

తా॥ నిలిచినిలిచితరచుమాటలాడుట నిద్రకలుగుట నాలుకనల్లనై ముల్లుతాకి కఠినమగుచు ద్రవములేక వగరుగానుండుట మిక్కిలి తాపముకలుగుట విరేచనము లగుట ఉబ్బసము దురదకలుగుట కండ్లు పెద్దచేసిచూచుట కన్నులలో నీరుకారుట జ్వరము తీవ్రముగానుండుట యివికలిగిన తాంద్రికసన్నిపాతలక్షణమని తెలిసికొనవలయు (ఇది సాధ్యము).

ప్రలాపకసన్నిపాతలక్షణము.

శ్లో॥ కఫప్రలాపసంతాపావాతశ్లేష్మప్రకోపనమ్ ।
హింక్కాతాపజ్వరంచైవప్రలాపేసన్నిపాతకే ॥

తా॥ దగ్గు తఱుచుమాటలు అతితాపము వాతశ్లేష్మప్రకోపము ఎక్కిళ్లు తాపజ్వరము యివి కలిగిన ప్రలాపసన్నిపాతలక్షణమని తెలిసికొనవలయు (ఇది సాధ్యము).

చిత్తవిభ్రమసన్నిపాతలక్షణము.

శ్లో॥ సర్వావయవపైకల్యంవాతపిత్తప్రకోపనమ్ ।
భ్రమమోహాభ్రుకుటిలగీతనృత్యప్రలాపనమ్ ।
మహాఘోరసన్నిపాతోజ్ఞాతవ్యశ్చిత్తవిభ్రమః ॥

తా॥ శరీరమంతయునొచ్చుట వాతపిత్తములు ప్రకోపించుట ఉలికిపడుట ఉలిమిచూచుట కనుబొమ్మలుముడిపడుట పాడుట ఆడుట వదరుట ఇవికలిగిన చిత్తవిభ్రమసన్నిపాతలక్షణమని తెలియవలయు (ఇది సాధ్యము).

జిహ్వాకసన్నిపాతలక్షణము.

శ్లో॥ ఏశ్వాసవేగసంతాపఃకాసఃకఠినజిహ్వకః ।
కంటకాశామపర్ణాచమూకత్వంబాధిరంజడః ।
జిహ్వాకాసన్నిపాతోయమసాధ్యంచవినిర్దిశేత్ ॥

తా॥ ఊర్ధ్వశ్వాసము తాపము దగ్గుకలుగుట నాలికెద్రవములేక ముల్లుతాకినట్లైయుండుట మాటలుడుగుట చెముడు జడత్వముకలుగుట యివికలిగిన జిహ్వాకసన్నిపాతలక్షణమని తెలిసికొనవలయు (ఇది సాధ్యము.)

కర్ణకసన్నిపాతలక్షణము.

శ్లో॥ ప్రలాపజిహ్వాస్ఫుటసహిక్కా.కాసాంగకంపనమ్ ।
కర్ణాంతశోభఃతాపశ్చకర్ణికేసన్నిపాతకే ॥

తా॥ తెలుచుమాటలు నాలికెపగులుట ఎక్కిళ్లు దగ్గు వణుకు చెవికొనలు వాపు తాపము యివికలిగిన కర్ణిక సన్నిపాతలక్షణమని తెలిసికొనవలయు (ఇది సాధ్యము).

హృద్దాహసన్నిపాతలక్షణము.

శ్లో॥ ప్రలాపతాపమోహాశ్చకంఠేవైవేదనాభ్రమః ।
వేదనాతితృషాకాసంజాడ్యంకంపఃప్రలాపనమ్ ।
స్వేదోలలాటకంఠేచహృద్దాహేసన్నిపాతకే ॥

తా॥ తెలుచుమాటలు తాపము మనశ్చాంచల్యము కంఠముననొప్పి ఇటుఅటు పొర్లుట శరీరమునొచ్చుట పెదవులెండుట దగ్గుగలుగుట మందుడుగనుండుట కంపము కలుగుట కంఠమున నుదురున చమటబట్టుట ఇవికలిగిన హృద్దాహసన్నిపాతలక్షణమని తెలిసికొనవలయు. (ఇది అసాధ్యము).

### అంతకసన్నిపాతలక్షణము.

శ్లో॥ సదాహామోహాతాపంచశిరఃకంపఃప్రలాపనమ్ ।
వాంతిర్హిక్కాజ్వరశ్చైవఅంతకేసన్నిపాతకే ॥

తా॥ దాహము బుద్ధిచాంచల్యము తాపము శిరఃకంపము తరుచుమాటలు వాంతి ఎక్కిళ్లు జ్వరము ఇవికలిగిన అంతకసన్నిపాతలక్షణమని తెలియవలయు (ఇది అసాధ్యము).

### భగ్ననేత్రసన్నిపాతలక్షణము.

శ్లో॥ భగ్నంవిలోచనద్వంద్వంతోయస్రావంచసంతతమ్ ।
నిరీక్షణంవిరహితంప్రలాపభ్రమకంపనమ్ ।
జ్ఞాతవ్యస్సన్నిపాతోయంభగ్ననేత్రాఖ్యఉద్ధతః ॥

తా॥ కన్నులు యెఱ్ఱనైపగిలినట్టుండుట నీరుకారుచుండుట చూపులేకయుండుట తఱుచుమాటలాడుట తిరికిపడుట వణుకుట యివికలిగిన భగ్ననేత్రసన్నిపాతలక్షణమని తెలిసికొనవలయు (ఇది అసాధ్యము).

### కంఠకుబ్జసన్నిపాతలక్షణము.

శ్లో॥ అతిదాహశ్శిరఃకంపఃకంధరస్యాపికుబ్జతా ।
విలాపస్తాపనంమూర్ఛాచాంగశ్శైథిల్యకంపతః ।
ఛర్దిర్హిక్కాగుంభసంచాప్యుత్తమాంగవ్యథాతథా ।
కంఠకుబ్జమితిజ్ఞేయమసాధ్యంచవినిర్దిశేత్ ॥

తా॥ అతిదాహము తలవణుకుట మెడకుదియబడుట తఱుచుమాటలాడుట తాపము మూర్ఛ యివికలుగుట శరీరమునొచ్చుట దగ్గుకలుగుట వాంతి ఎక్కిళ్లు కలుగుట దప్పిపుట్టిరేపుడుట తలనొచ్చుట యివికలిగిన కంఠకుబ్జసన్నిపాతలక్షణమని తెలిసికొనవలయు (ఇది అసాధ్యము).

### రక్తష్ఠీవసన్నిపాతలక్షణము.

శ్లో॥ జిహ్వాశ్యావరద్వ్యాయుస్ఫోటరక్తస్రావంచవేగతః ।
శ్వాసశ్శిరోభ్రమఃకంపోజిహ్వాశ్యావాసకంటకా ।
రక్తష్ఠీవసన్నిపాతోయంవిజ్ఞేయమాశ్చభీషణః ॥

తా॥ నాలికె పెదవులు పగిలి నెత్తురుకారుచుండుట దగ్గు తలపణుకుకలుగుట శరీరమువణుకుట వాలుకనల్లనై ముల్లుతాకినట్లుండుట యివికలిగిన రక్తోష్ఠసన్నిపాత లక్షణమని తెలిసికొనవలయు (ఇవి అసాధ్యము).

శీతాంగసన్నిపాతలక్షణము.

శ్లో॥ సర్వాంగంచంద్రవచ్ఛీతంకాసశ్వాసప్రకోపనమ్ ।
హిక్కా సర్వాంగశైథిల్యంవాంతిసంతాపమూర్ఛనమ్ ।
అతిసారంగాత్రకంపశ్శీతాంగేసన్నిపాతకే ॥

తా॥ శరీరము మిక్కిలి చల్లగనుండుట దగ్గు ఉబ్బసము ఎక్కిళ్లుగలుగుట కీళ్లు నొచ్చుట వాంతి తాపము మూర్ఛకలుగుట విరేచనములగుట శరీరమువణుకుట యివి శీతాంగసన్నిపాతలక్షణమని తెలిసికొనవలయు (ఇది అసాధ్యము).

అభిన్యాససన్నిపాతలక్షణము.

శ్లో॥ దోషత్రయంజ్వరంశ్వాసస్స్నిగ్ధాస్యమతినిద్రతా ।
అంగవైకల్యతాపంచబలహానిస్తృషామదః ।
అత్యుత్కటస్సన్నిపాతోహ్యభిన్యాసస్సుదారుణః ॥

తా॥ వాతపిత్తశ్లేష్మము నేకమైయుండుట జ్వరము శ్వాసముకలుగుట ముఖము నునుపుబారియుండుట అతినిద్రకలుగుట ఒడలునొచ్చుట తాపముకలుగుట బలహీనమగుట దాహము చెమటకలుగుట యివికలిగిన అభిన్యాససన్నిపాతలక్షణమని తెలిసికొనవలయు (ఇది అసాధ్యము).

సన్నిపాతములకు కాలప్రమాణము.

శ్లో॥ సంధికేసప్తదివసమంతకేవాసరాదశ ।
హృద్దాహేవింశతిదినాన్యేకవింశతివిభ్రమే ।
పక్షమేకంశీతగాత్రేపంచవింశతితాంద్రికే ॥
అథవావాసరాస్సప్తకంఠకుబ్జేత్రయోదశ ।
త్రిమాసంకర్ణికేచైవభగ్ననేత్రేదినాష్టకమ్ ।
దశవారాణిరక్తోష్ఠేప్రలాపేస్యుశ్చతుర్దశ ।
జిహ్వాకేషోడశదినమభిన్యాస్థమాసకమ్ ॥

తా॥ సంధిక సన్నిపాతమునకు 7 దినములు అంతకసన్నిపాతమునకు 10 దినములు హృద్దాహసన్నిపాతమునకు 20 దినములు చిత్తవిభ్రమసన్నిపాతమునకు 21 దినము శీతాంగసన్నిపాతమునకు 15 దినములు తాంద్రికసన్నిపాతమునకు 25 దినములు లేక 7 దినములు కంఠకుబ్జసన్నిపాతమునకు 13 దినములు కర్ణికసన్నిపాతమునకు 3 నెలలు భగ్ననేత్రసన్నిపాతమునకు 8 దినములు రక్తోష్ఠసన్నిపాతమునకు 10 దినములు ప్రలాపకసన్నిపాతమునకు 14 దినములు జిహ్వాకసన్నిపాతమునకు 16 దినములు అభిన్యాససన్నిపాతమునకు 15 దినములు ఈ 13 సన్నిపాతములకిదియు కాలప్రమాణము.

సన్నిపాతములకు దశావస్థలు.

శ్లో॥ ప్రథమాపస్మారకంచద్వితీయంప్రేతభాషణమ్ ।
తృతీయంచిత్తవిభ్రాంశశ్చతుర్థంశ్వాసమూర్ధ్వకం ।
పంచమంచోర్ధ్వదృష్టిశ్చషష్ఠంత్వచలకాంగకమ్ ।
సప్తమంత్వంగదాహశ్చరక్తస్పర్శనమష్టకమ్ ।
నవమంశ్వేతగాత్రంచదశమంమరణాంతికమ్ ॥

తా॥ సన్నిపాతరోగమునకు నడిచెడిదశావస్థ లెవ్వియనిన—మొదటి అవస్థయందు వెఱ్ఱిపట్టినవానివలెనుండును. 2 వ అవస్థయందు బ్రతుకననేమాటలాడును. 3 వ అవస్థయందు కల్లలాడును. 4 వ అవస్థయందు ఊర్ధ్వశ్వాసముకలుగును. 5 వ అవస్థయందు ఊర్ధ్వదృష్టికలుగును. 6 వ అవస్థయందు కాళ్లుచేతులు కదలకుండును. 7 వ అవస్థయందు అంగదాహముకలుగును. 8 వ అవస్థయందు రక్తస్పర్శముకలుగును. 9 వ అవస్థయందు మిక్కిలిచమటకలుగును. 10 వ అవస్థయందు మరణముకలుగును. ఇవి సన్నిపాతములకు దశావస్థలు.

అసాధ్యసన్నిపాతములకును చికిత్సచేయవలయుననుట.

శ్లో॥ సముద్రతరణంహ్యేతద్వదంతిభిషగీశ్వరాః ।
మృత్యునాసహయోద్ధవ్యస్సన్నిపాతచికిత్సకైః ॥

తా॥ సముద్రమున నీదునట్లును మృత్యువుతోపోరునట్లును సన్నిపాతములకు చికిత్సచేయవలయుననుట.

శ్లో॥ యావత్కంఠగతాః ప్రాణాయావన్నశ్యతిచేంద్రియమ్ ।
తావచ్చికిత్సాకర్తవ్యాకాలస్యకుటిలాగతిః ॥

తా॥ అసాధ్యసన్నిపాతములయందుకూడ రోగికి ప్రాణమును కంఠగతమయ్యే వరకును పంచేంద్రియములు నశించేవరకును చికిత్సజేయవలయునేకాని ఉపేక్షించ కూడదు. కాలగతి ఎవ్వరికి తెలియదు గనుగ చికిత్సచేయవలయు.

శ్లో॥ సన్నిపాతజ్వరేపూర్వంకుర్యాదామకఫాపహమ్ ।
చికిత్సాంశ్లేష్మణిక్షీణేనాశయేత్పిత్తమారుతౌ ॥

తా॥ సన్నిపాతజ్వరము రాగానే ముందుగా శ్లేష్మమును హరింపచేయవలయు పిదప క్రమముగా పిత్తవాతములు తమంతట తామే హరించు.

సన్నిపాతజ్వరచికిత్సా.

శ్లో॥ తిక్తాపద్మకతోయచందనధనావాసాభయారగ్వధైః పాఠావిశ్వకళింగకామృతలతాముస్తైకషాయఃకృతః । కృష్ణాచూర్ణయుత స్త్రిదోషజనితేవిష్టంభదాహాన్వితే కాసశ్వాసవిలాపతృడ్వతి హితస్సందీపనఃపాచనః ॥

తా॥ కటుకరోహిణి తామరకాడలు వట్టివేళ్లు రక్తచందనము ధనియాలు అడ్డసరపాకు కరకపించెలు రేలకాయలగిజరు అగరుశొంఠి శొంఠి కొడిశవిత్తులు తిప్పతీగె తుంగముస్తెలు వీటినికషాయముపెట్టి పిప్పలిచూర్ణమువైచి పుచ్చుకొనిన త్రిదోషము వలనపుట్టిన కడుపుబ్బు తాపముకలదగ్గు ఉబ్బసము తబ్బిబ్బుమాటలు దాహము ఇవి మానుటయేగాక దీపనపాచనములుసగా కలుగు.

సన్నిపాతాదిజ్వరములకు శొంఠ్యాదికషాయము.

శ్లో॥ శుంఠీదారుసటీరజోబృహతికాతిక్తాకిరాతాంబుదా నంతాభిర్జనితః కషాయకవరఃకృష్ణామధుభ్యాంయుతః । నిశ్శేషంత్రితయోర్భవ జ్వరహరోఽజీర్ణజ్వరస్యాంతకృత్కాసారిర్వమమా పక్షాహాపిగదిత స్సుంఠ్యాదికస్సూరిభిః ॥

తా॥ శొంఠి దేవదారుచెక్క కచోరములు పర్పాటకము చిన్నములక కటుక రోహిణి సీమనేలవేము తుంగముస్తెలు దురదగొండివేళ్లు వీటిని కషాయముపెట్టి పిప్పలి చూర్ణము తేనెచేర్చి పుచ్చుకొనిన సన్నిపాతజ్వరము అజీర్ణజ్వరము దగ్గు విషమజ్వరము ఇవిమానును.

శ్లో॥ శాంతేత్రిదోషేశ్రుతిమూలజాతశోఫస్యరక్తం ప్రవిమోచయేత్ప్రాక్ । పశ్చాన్మహాకట్ఫలకృష్ణజీరపిశ్యాకులుత్థోద్భవలేపనం స్యాత్ ॥

తా॥ సన్నిపాతజ్వరము నివృత్తించినతోడనే అదివరకు చెవులక్రిందనుండు వాపుయొక్క రక్తమునుతీసి కాయఫలము నల్లజీలకఱ్ఱ శొంఠి ఉలవలు వీటిని చూర్ణము చేసి నీళ్లలోకలిపి చెవులక్రింద వాపుకు లేపనముచేసిన అవి మానును.

## పంచవక్త్రరసము.

శ్లో॥ గంధేశటంకంమరిచంవిషందుత్తూరజైర్ద్రవైః ।
దినంసమ్మర్ద్దితంశుష్కంపంచవక్త్రోరసోభవేత్ ।
ఆర్ద్రకస్యద్రవేనైషదాతవ్యోరక్తికామిత ।
సన్నిపాతజ్వరంఘోరంనాశయేన్నాత్రసంశయః ॥

తా॥ గంధకము రసము వెలిగారము మిరియాలు నాభి వీటినిసమముగ ఖల్వము నందునిచి ఉమ్మెత్తాకురసముచే ఒకదినముమర్దించి యెండించిన పంచవక్త్రరసమనంబడు. దీనిని గుంజాప్రమాణము అల్లపురసముతో సేవించిన భయంకరమగు సన్నిపాతజ్వరము నివర్తించు.

## ఉన్మత్తరసము.

శ్లో॥ రసగంధకతుల్యాంశంధుత్తూరఫలజైర్ద్రవైః ।
మర్దయేద్దినమేకంచతత్తుల్యంత్రికటుంక్షిపేత్ ।
ఉన్మత్తాఖ్యోరసోనామనస్యేస్యాత్సన్నిపాతజిత్ ॥

తా॥ శుద్ధరసము గంధకము వీటిని సమభాగములుగచేర్చి ఉమ్మెత్తకాయల రసముచే నొకదినముమర్దించి ఆ యౌషధమునకు సమము త్రికటుచూర్ణమును జేర్చి నస్యంబొనర్చిన సన్నిపాతజ్వరము నివర్తించు.

## విషమజ్వరచికిత్సా.

శ్లో॥ పటోలమధుకాభయాకటుకరోహిణీముస్తజః కషాయకవరఃపరం
విషమమాశుజేజీయతే । తథావృషపయోధరామృతలతాశివా
విశ్వడంకణామధుయుతంశతంవిషమనాశనంగీర్తితమ్ ॥

తా॥ చేదుపొట్ల ఇప్పపూలు కరకపిందెలు కటుకరోహిణి తుంగముస్తెలు వీటినికషాయముపెట్టి పుచ్చుకొనినను లేక అడ్డసరపాకు తుంగగడ్డలు తిప్పతీగె కరక పిందెలు శొంఠి వీటినికషాయముపెట్టి పిప్పలిచూర్ణము తేనెచేర్చిపుచ్చుకొనినను విషమజ్వరములు మానును.

## మేఘనాధరసము.

శ్లో॥ ఆరంకాంస్యంమృతంతామ్రంత్రిభిస్తుల్యంతుగంధకం ।
క్వాథేనమేఘనాదస్యపిష్ట్వారుద్ధ్వాపుటేపచేత్ ॥
షడ్భిస్తుజాయతేసిద్ధోమేఘనాదోమహారసః ।
పర్ణఖండేవమాషైకోవిషమజ్వరనాశకః ॥

తా॥ లోహభస్మము 1 భాగము కంచుభస్మము 1 భాగము తామ్రభస్మము 1 భాగము గంధకము 3 భాగములు వీటిని ఖల్వమునందునించి మోదుగకషాయముచే మర్దించి ముద్దజేసి శరావమునందునించి చీలజేసి గజపుటంబిడవలయు. పిదప ఇటుల ఆరు పుటంబులిడిన రసముసిద్ధంబగు. దీనిని మాష మెత్తుతమలపాకుతో సేవించిన విషమజ్వరము నివర్తించు.

## సాధారణజ్వరములకు జ్వరహరధూపము.

శ్లో॥ యవస్సర్షపరుక్పిచ్ఛావచాజతునింబాజ్యభవంప్రదూపనమ్ ।
జ్వరనాశకరంపరంస్మృతంవివిధోపాయకరైశ్చికిత్సకైః ॥

తా॥ యవలు ఆవాలు చంగల్వకోష్టు కరకపిందెలు వస లక్క వేపచిగుళ్లు వీటిని చూర్ణముచేసి నెయ్యితోచేర్చి పొగవేసిన జ్వరముహరించు.

## జ్వరహరచూర్ణము.

శ్లో॥ ఆమలసైంధవచిత్రపథ్యాపిప్పలిచూర్ణమిదంజ్వరహారి ।
రోచనదీపనపాచనమాశుభేదితభాగదితంమునివర్యైః ॥

తా॥ ఉసిరికపలుపు సైంధవలవణము చిత్రమూలము కరకపింజెలు పిప్పళ్లు వీటిని చూర్ణముచేసి పుచ్చుకొనిన జ్వరము అరుచి ఇవిమానుటయేగాక దీపనపాచనములు నగాగలుగును.

## జ్వరహరపానము.

శ్లో॥ జలచతుఃపలయుక్తపయఃపలేశృతకణాత్రయమగ్నికరంపరమ్ ।
శ్వసనకాసబలాసపురాతనజ్వరహారంరుచితంబలవర్ధనమ్ ॥

తా॥ ఒకపలము పాలలో 4 పలములనీళ్ళుపోసి అందులో 3 పిప్పళ్ళనువైచి నీళ్ళుయిగిరేవరకుకాచి అందుండు పిప్పళ్లనుతీసి ఆ పాలనుపుచ్చుకొనిన అగ్నిమాంద్యము ఉబ్బసము దగ్గు కఫము పురాణజ్వరము వీటిని హరించుటయేగాక నోటికి రుచియు బలమునుకలుగంజేయు.

## పురాణజ్వరములకు లఘుమాలినీవసంతరసాయనము.

శ్లో॥ ఏకాంశోమరిచాదుభాగసహితస్సమ్మర్ద్య యేన్మస్రణేపశ్చాన్నింబురసేన మర్దనవిధిర్యావన్నపృతంగచ్ఛతి । పథ్యోదుగ్ధయుతంకణామధుయుతోవల్లప్రమాణో భవేజ్జ్వారిచీనజ్వరహాతథావిషమహాధాతుస్థితధ్వంసనః ॥ రక్తాతీసృతిపాయుజప్రదరహానేత్రామయధ్వంసనో సూవప్రసక్తభవామయప్రహరణః పిత్తామయధ్వంసనః । రోగానీకగజేంద్రగాహాలావిజయతే శ్రీమాలినీప్రాగయం వైద్యానాంమతిశాలినాం బహుమతశ్శ్రీనోవసంతాభిధః ॥

తా॥ శుద్ధిచేసిన తెల్లమిరియాలు 1 భాగము శుద్ధిచేసినకర్పూరి 2 భాగములు ఆవువెన్న వీటిని ఖల్వములోవేసిమర్దించి తర్వాత నిమ్మపండ్లపులుసుచేత జిడ్డుపోవువరకు మరలమర్దించి కొంచముయుండినతర్వాత 1 తులముకొత్తు ఔషధమునకు 40 మాత్రలుపంతునజేసి పిప్పలిచూర్ణము తేనె అనుపానముతో ఒకొక్కమాత్రచొప్పున

పుచ్చుకొనిన పురాణజ్వరము విషమజ్వరము ధాతుగతజ్వరము రక్తాతిసారము మూలవ్యాధి ప్రదరము కుసుమరోగము నేత్రరోగము రక్తగ్రహణి శీతభేదులు ఇవియన్నియుమానును. ఇందుకు పథ్యము పాలుఅన్నము.

## జ్వరాతిసార చికిత్సా.

శ్లో॥ ఇసవగోళఇతిప్రథితంజనేహరతితజ్వరభాజమతీసృతిం।
;అనుభవాల్లిఖితంనతుశాస్త్రతోభవతుతద్భిషజాముపయోగికమ్॥

తా॥ ఇసవగోలు అనువిత్తులునుదెచ్చి రాత్రినీళ్ళలోనానబెట్టి ప్రాతఃకాలమునందు ఆవిత్తులను చేతితోనలిచి రుచిగావుండుటకై ఖండశర్కర సమముగాకలిపి పుచ్చుకొనిన జ్వరాతిసారము నిలిచిపోవును (ఇది అనుభవసిద్ధము).

శ్లో॥ విశ్వామృతాబాలకచందనానాంసంవత్సకాంభోదకిరాతకానామ్।
హితఃకషాయోవమిదాహతృష్ణాశోషాతిసారజ్వరపీడితానామ్॥

తా॥ శొంఠి తిప్పతీగె వట్టివేళ్లు రక్తచందనము కొడిశపాలచక్క తుంగముస్తలు సీమనేలవేము వీటిని కషాయముపెట్టి పుచ్చుకొనిన వమనము తాపము దాహము వాపు ఇవిగల అతిసారజ్వరము మానును.

## కామజ్వరచికిత్స.

శ్లో॥ శ్రీఖణ్డమణ్డితకళేబరవల్లరీణాం ముక్తాఫలాకులవిశాలకుచస్థలీనాం।
వైదగ్ధ్యముగ్ధవచసాంసువిలాసినీనామాలిఙ్గనంసకలదాహమపాకరోతి॥

తా॥ శరీరమునకు శ్రీగంధలేపనమును ముత్యాలహారధారణమును జేసికొని రసికులుగ శృంగారరసభరిత సంభాషణముసేయువారుగ రూపలావణ్యసంపన్నులుగనుండు స్త్రీలనాలింగనముచేసికొనుటవలన కామజ్వరము శమించు.

శ్లో॥ శయ్యాపల్లవపద్మపత్రరచితావాసో వయస్యైస్సమంకాన్తారే
కుసుమస్ఫురత్తరువరేవాపీజలాలోకనమ్। ఆలాపాశ్చశుకాళి
కోకిలకృతాఃకాన్తాశ్చకాన్తాః కథావాతాశ్చామలవాలకవ్య
జనజాదాహంనిరాకుర్వతే॥

తా॥ మనోహరములైన చిగుళ్లయందుగాని తామరరేకులయందుగాని నిద్రించుటవలన ఇష్టమైనమిత్రుల సహవాసమువలన పుష్పించినతోటలలో దిరుగుటవలన లేక బావి చెఱువు వీనియొక్కగట్టుననిలుచుటవలన చిలుకలు తుమ్మెదలు కోయిలలు అను వానియొక్క మధురస్వరములనాలకించుటవలన ప్రియురాలితో సంభాషించుటవలన స్వచ్ఛమగు వట్టివేళ్లవిసనకఱ్ఱగాలివలన కామజ్వరముశమించు.

శ్లో॥ అయినితమ్బినిగాయనలాలసేమధురవాణినికామమదాలసే ।
వపుషిదాహవతాంవిహితంహిమంహిమమయూంశుజలైరనులేపనమ్॥

తా॥ సుందరమైన పిఱుదులు గానాసక్తి మధురమైనవాక్కు అనువానితో గూడి మదోన్మత్తురాలైయుండు ఓసుందరీ! కామజ్వరపీడితులు శ్రీగంధము పచ్చకర్పూరము మంచు వట్టివేళ్లు వీనిని శరీరమునకు పూసికొనిన కామజ్వరము శమించు.

శ్లో॥ శుభ్రాభ్రవిభ్రమధరేశశాంకకరసున్దరే ।
శయనేశ్చర్చితేహర్మ్యే స్వాపస్తాపమపోహతి ॥

తా॥ తెల్లమేఘమువలె ధావళ్యము చంద్రకిరణమువలె సుందరముగ చందనలిప్తంబుగనుండినదై గచ్చుచేయబడిన మేడయందుశయనించిన తాపము తత్క్షణమున శమించు.

శ్లో॥ యదుపర్యుషితంధాన్యసలిలంసితయాసహ ।
ప్రభాతసమయేపీతమన్తర్దాహంవినాశయేత్ ।

తా॥ ధనియాలనుదంచి రాత్రినీళ్ళలోబోసి మంచులోనుంచి ఉదయమున యందలిపిప్పిని తీసివేసి శర్కరనుగాని కలకండనుగాని కలిపిపుచ్చుకొనిన అంతర్దాహమునూరించు.

శ్లో॥ పిత్తజ్వరేకింరసఫాంటలేపైఃకిం వాకషాయైరమృతేనకింవా ।
పేయంప్రియాయాముఖమేకమేవలోలంబరావేసదానుభూతమ్ ।
ప్రాణప్రేయసిమాపిబంతుపురుషాఃపిత్తజ్వరవ్యాకులా
నానావల్లిజలంవిశమ్బితఫలంనానేవిషాదప్రదమ్ ।
తత్తఃకింక్రియతాంచికిత్సకపతేముగ్ధేసుఖంసేవ్యతాం
సద్యస్తాపహరస్సుధాధికతరఃకాన్తాధరఃకేవలమ్ ॥

తా॥ ఓప్రియురాలా! పిత్తజ్వరమున (అనగా కామజ్వరమున) స్వరసము ఫాంటము కషాయము లేక అమృతము అనువానిసేవించినను లేపనములజేసినను నిష్ఫలంబు అగుటంజేసి కామజ్వరనివారణార్థంబై ప్రియురాలియొక్క అధరపానమును సేయవలయు. ఇటుల లోలంబరాజగు నాచే ఎల్లపుడు అనుభవింపబడియె. ప్రాణముల కన్న ప్రియురాలై సౌందర్యముతో గూడియుండు ఓసుందరీ! కామజ్వరపీడితులగు పురుషులు దీర్ఘకాలముమీద ఫలమునొసంగెడి చేదు పగరు మొదలగు పలువిధస్వరసాదులనేని అమృతమునేని పానము సేయుటవ్యర్థంబు—దానంజేసి అమృతమునకంటే కడురుచిగల నాయకురాలియొక్క అధరపానముచేసిన కామజ్వరము నివృత్తించు.

శ్లో॥ (గ్రంథాంతరే) కాన్తాకటాక్షదగ్ధానాంపదనైద్యకమౌషధమ్ ।
దృఢమాలింగనంపథ్యంక్వాథశ్చాధరచుమ్బనమ్ ॥

తా॥ కామజ్వరపీడితులకు ప్రియురాలియొక్క అధరచుంబనమే కషాయంబు వారియొక్క దృఢాలింగనమే పథ్యంబు.

ఒకమారువదలి మరలవచ్చెడు జ్వరమునకు చికిత్స.

శ్లో॥ తిక్తోశీరబలాధాన్యపర్పటామ్బోధరైఃకృతః ।
క్వాథఃపునస్సమాయాతంజ్వరంశీఘ్రంనివారయేత్ ॥

తా॥ కటుకరోహిణి వట్టివేళ్ళు ముత్తవపులగము ధనియాలు పర్పాటకము తుంగగడ్డలు వీనిని సమభాగములుగ కషాయముకాచి పుచ్చుకొనిన ఒకమారువచ్చి వదలి మరలవచ్చెడిజ్వరము హరించును.

శ్లో॥ గోపీద్వావ్యమలకీస్థిరామగధజాతిక్తాపయఃపాలినీ ।
ద్రాక్షాశ్రీఫలధావనీహిమవిషాముస్తేంద్రజైస్సాధితమ్ ।
స్యాదాజ్యంవిషమజ్వరక్షయశిరః పార్శ్వవ్యథారోచకచ్ఛర్దిశ్వో
షహాలీమకప్రశమనంలీలాలతామంజిరీ ॥

తా॥ ఓలీలావతి! సుగంధిపాల నేలఉసిరికె ఉసిరికెవరుగు వివబొద్ది పిప్పళ్లు కటుకరోహిణి వట్టివేళ్ళు వస ద్రాక్ష మారేడుపిందెలు నేలములక రక్తచందనము అతివస తుంగముస్తెలు కోడిసెవిత్తులు వీనిని సమభాగములుగవైచి చతుర్థాంశముగ కషాయముకాచి చల్లార్చి మరల అష్టభాగముగకాచి రెండుతులములచొప్పున పానము

సేయుటయేగాక దానిని శరీరమునకు లేపనము జేసిన విషమజ్వరములు క్షయరోగము తలపోటు పార్శ్వశూలల అరుచి వాంతి శోష సంధిగతవాయువు ఉష్ణవాయువు హరించు.

## అతిసారచికిత్సా.

శ్లో॥ పాఠాబిల్వంధాతకీవత్సకోంబుముస్తం లోధ్రించందనందాడిమంచ।
క్షౌద్రోద్రిక్తంక్వాథమేతంవదంతి పిచ్ఛాస్రావేసూలరక్తామయుక్తే॥

తా॥ అగరుశొంఠి మారేడుపించెలు ఆరెపువ్వు కొడిశచక్క వట్టివేరు తుంగముస్తలు లొద్దుగచక్క రక్తచందనము దాడిమకాయలతోలు ఈవస్తువుల కషాయము పెట్టి తేనెచేర్చియిచ్చిన బంక శూల నెత్తురు ఇవిగల అతిసారము మానును.

శ్లో॥ కించిద్ఘృతాక్తౌషధచూర్ణమేతదేరండపత్రావృతమగ్నిపక్వమ్ ।
సితాసమంహంతితనోతిచైతదామాతిసారంజఠరానలంచ ॥

తా॥ శొంఠిచూర్ణమును కొంచము ఆవునెయ్యితో పిసికి ఆముదపువేళ్ల రసముతోవుంటజేసి దానికి ఆముదపాకులుచుట్టి దానికి మన్నుపాదిగి స్వల్పపుటముపెట్టి పక్వముగానేతీసి లోపలి శొంఠిచూర్ణమునకు సమముగా ఖండశర్కరచేర్చి (1) కాలురూపాయయెత్తు మొదలు (4) రూపాయయెత్తువరకు పుచ్చుకొనిన బంకపడునట్టి అతిసారముమానుటయేగాక దీపనమునగాగలుగు.

శ్లో॥ సమోచసారంసహనాగఫేనం సజాతిసస్యంపుటపాకయోగాత్ ।
నిహంతిమాలూరఫలంసరాణాం సర్వాతిసారాననుభూతమేతత్ ॥

తా॥ బూరగబంక నల్లమందు జాజికాయ మారేడుపండుయొక్క గిజరు వీటిని నూరి ముద్దచేసి వెనుకచెప్పినచొప్పున ఆముదపాకుతో పుటముపెట్టి పుచ్చుకొనిన సమస్తఅతిసారము మానును.

శ్లో॥ కిటనిష్ఠీవనేఘృష్టంనాగఫేనంసకుంకుమమ్ ।
తండులప్రమితందత్తమతిసారనిషూదనం ॥
ఇదంమయాగురోర్లబ్ధంనతుశాస్త్రాద్విభషగ్వరాః ।
భవతామునయోగాయగురుతత్వంప్రకాశితం ॥

తా॥ నల్లమందు కుంకుమపువ్వు వీటిని మెత్తగనూరి తేనెతోఁజేర్చి బియ్యపు గింజంతయిచ్చిన అతిసారమునిలుచును. ఈక్రియను గురువువలన పొందితిని వైద్యులకుపయోగించుటకై ఇందుప్రకటించితిని.

జీర్ణాతిసారమునకు గంగాధరచూర్ణము.

శ్లో॥ ధాతక్యామకిపయోధరవృకీకట్వృఙ్గయష్టీ మధుశ్రీజంబ్వామ్రఫలాస్థి నాగరవిషాణ్హ్రీబేరలోధ్రైర్దృఢై: । తుల్యాంశంవిహితంతణ్డులపజలంగంగాధరాఖ్యంమహాచూర్ణం తూర్ణమపాకరోతిసకలం జీర్ణాతిసారంవరమ్ ॥

తా॥ ఆరెపువ్వు ఉసిరికెవరుగు తుంగముస్తెలు విషబొద్ది ఈశ్వరివేరు యష్టిమధుకము మారేడుపిందెలు నేరేడుగింజలు మామిడిపప్పు శొంఠి అతివస కురువేరు లొద్దుగచెక్క కొడిసెవిత్తులు వీనిని సమభాగములుగ చూర్ణముజేసి దీనిని ఒకవరహాయెత్తు బియ్యపుకడుగుతో పుచ్చుకొనిన సర్వజీర్ణాతిసారములు నశించును.

రక్తాతిసారచికిత్స.

శ్లో॥ అయికంన్దుకతిందుకస్తనిరిప్రమదారూపమదాపహారిణి ।
రుధిరాతిసృతౌకషాయకస్సమధుర్దాడిమవత్సకత్వచ: ॥

తా॥ బంతులతోఁ తుల్యమైన స్తనములుగలదై సౌందర్యాతిశయమువలన స్త్రీలమనమును బోకడచునదియై యుండునట్టి ఓముద్దురాలా! దాడిమబెరడు కొడిసెచెక్క వీనిని సమభాగములుగ కషాయముకాచి అందుతేనెవైచి పుచ్చుకొనిన రక్తాతిసారము హరించు.

సంగ్రహణీచికిత్సా.

గ్రహణీరోగమధ్యమున ముఖ్యముగ అగ్నిమాంద్యముగలుగు కావున ప్రథమంబున దీపనపాచన ఔషధములవచించెద.

శ్లో॥ యవానీనాగరోశీరధనికాతివిషాఘనై: ।
బాలబిల్వద్విపర్ణీభిర్దీపనంపాచనంభవేత్ ॥

తా॥ ఓమము శొంఠి వట్టివేళ్ళు ధనియాలు అతివస తుంగముస్తెలు మారేడు పిందెలు విషబొద్ది వీనిని సమభాగములుగ చూర్ణముజేసి పూటకు ఒకవరహాయెత్తు చొప్పున రెండుపూటలును పుచ్చుకొనిన దీపనపాచనములుగలుగు.

శ్లో॥ పునర్నవావలిజబాణపుంఖావిశ్వాగ్నిపథ్యాచిరిబిల్వబిల్వైః।
కృతఃకషాయశ్శమయేద శేషాన్ దుర్నామగుల్మగ్రహణీవికారాన్॥

తా॥ తెల్లగలిజేరువేరు మిరియాలు వెంపలివేరు సొంటి చిత్రమూలము కరక పిందెలు కానుగచెక్క మారేడుపిందెలు వీనిని సమభాగములుగ కషాయముకాచి పుచ్చుకొనిన మూలవ్యాధి గుల్మము గ్రహణిరోగము నశించు.

శ్లో॥ శుణ్ఠీఛిన్నరుహావిషాజలధరైస్తుల్యైః కషాయఃకృతో మన్దాగ్నౌ గ్రహణీగదేపి సతతంనామానుబన్ధేహితః। శుంఠీకల్కశ్శృతంఘృతం ప్రపిబతః ప్లీహామవాతాపహంస్యాద్వాయోరనులోమసంగ్రహణి కావేగేనజంగమ్యతే॥

తా॥ సొంటి తిప్పతీగె అతివస తుంగముస్తెలు వీనిని సమభాగములుగ కషాయముకాచి పుచ్చుకొనిన అగ్నిమాంద్యము అమాతిసారము గ్రహణిరోగము హరించు. మరియు సొంటి కల్కమును నేతిలోకలిపి కాచి పుచ్చుకొనిన ప్లీహము ఆమవాతము వాతాదిక్యమువలన జనించిన గ్రహణీరోగము శమించు.

శ్లో॥ * పాఠావిషాకుటజవృక్షఫలత్వగబ్దతిక్తామదారసవనాగరబిల్వచూర్ణమ్। సక్షౌద్రతండులజలంగ్రహణీప్రభావరక్తప్రవాహాగుదరుగ్గుదజేషుదద్యాత్॥

తా॥ అగరుశొంటి అతివస కొడిసెవిత్తులు కొడిసెచెక్క తుంగముస్తెలు కటుకరోహిణి ఆరెపువ్వులు రసాంజనము సొంటి మారేడుపిందెలు వీనిని సమభాగములుగ చూర్ణముచేసి అందు తేనె బియ్యపుకడుగు సమముగకలిపి త్రాగిన గ్రహణి ఆసనములో రక్తముపడుట ఆసనములోపోటు మూలవ్యాధి హరించు. (ఇదియ పాఠాదిచూర్ణము).

---

* పాఠ అనగా అగరుసొంటియనియు విషబొద్దియనియు నిఘంటులయందు జెప్పంబడియున్నయది.

శ్లో॥ చూర్ణంచిత్రకచవ్యశ్రీవిశ్వభేషజనిర్మితమ్ ।
తక్రేణసహితంహన్తిగ్రహణీదుఃఖకారిణీమ్ ॥

తా॥ చిత్రమూలము చెవ్యము మారేడుపిందెలు శొంఠి వీనిని సమభాగములుగ చూర్ణముచేసి మజ్జిగతోపుచ్చుకొనిన సర్వగ్రహణులు హరించు.

శ్లో॥ రుచకాగ్నిమరిచానాంచూర్ణంతక్రేణసేవితమ్ ।
గ్రహణ్యుదరగుల్మార్శఃక్షున్మాంద్యప్లీహనాశనమ్ ॥

తా॥ సౌవర్చలవణము చిత్రమూలము మిరియాలు వీనిని సమభాగములుగ చూర్ణముచేసి మజ్జిగలోకలిపి పుచ్చుకొనిన గ్రహణిరోగము కడుపుబ్బరము గుల్మము మూలవ్యాధి అగ్నిమాంద్యము ప్లీహరోగము హరించు.

శ్లో॥ గుడూచ్యతివిషాముస్తానాగరైఃక్వథితంజలం ।
మందానలామసంయుక్తేహితంసంగ్రహణీగదే ॥

తా॥ తిప్పతీగె అతివస తుంగముస్తెలు శొంఠి వీటిని కషాయముపెట్టి పుచ్చుకొనిన అగ్నిమాంద్యము ఆమము వీటివలనకలిగిన సంగ్రహణీరోగములు మానును.

## సంగ్రహణులకు కనకసుందరరసము.

శ్లో॥ మరిచహింగుళగంధకటంకణామృతకణాకసకోద్భవబీజకైః ।
ప్రహరయోగ్ద్వతయావధిఖల్వకేతనుతరంవిజయారసమర్దితైః ।
కనకసుందగపషమహారసోహరతిసంగ్రహణీగదముత్కటం ।
జ్వరమతిస్రుతిమగ్నివిహీనతాంబతయథాగరుడోభుజగావళీం ॥

తా॥ మిరియాలు శుద్ధిచేసినయింగిలీకము శుద్ధిచేసినగంధకము పేలిచిన వెలిగారము శుద్ధిజేసినవసనాభి పిప్పళ్ళు శుద్ధిచేసిన నల్లఉమ్మెత్తవిత్తులు ఈవస్తువులను బంగిఆకు కషాయముచేత ఖల్వమునందు 2 ఝాములుమర్దించి అనుపానయుక్తముగ ఈ ఔషధమునుపుచ్చుకొనిన భయంకరములగు సంగ్రహణీరోగములు జ్వరము అతిసారము అగ్నిమాంద్యము ఇవిమానును.

## ప్రసవించినస్త్రీలకు కలిగెడుసంగ్రహణులకు లాహీచూర్ణము.

శ్లో॥ త్రిజాతకవ్యోషవరారసేంద్ర గంధాజమోదామిశివేల్లరాత్ర్యః ।
బిల్వానలాజాజిలవగంధాన్యా గజోపకుల్యామధుకంపటూని ॥
హింగుఃకుజేరాహ్వయమోచసారోక్షారాజయాసర్వచతుర్థభాగా ।
ఇదంహిచూర్ణంవినిహంతితూర్ణంప్రసూతికాసంగ్రహణీవికారమ్ ॥
సమస్తరోగాంతకమగ్నికారిభాగ్జిష్ణుతాకారిసుతక్రపీతమ్ ।
ఇమంప్రయోగంబహుధానుభూతంచకారధాత్రీకిలకాపిలాహీ ॥

తా॥ లవంగపట్ట లవంగపత్రి ఏలకులు శొంఠి పిప్పలి మిరియాలు కరకతాండ్ర వుసిరికలు శుద్ధిచేసినరసము శుద్ధిచేసినగంధకము అజామోదము పెద్దసోపు వాయువిళంగములు పసపు మారేడుపిండెలు చిత్రమూలము జీలకర్ర లవంగములు ధనియాలు గజపిప్పలి అతిమధురము పంచలవణములు (అనగా సైంధవలవణము సౌవర్చలవణము బిడాలవణము కాచలవణము సముద్రలవణము) వేయించినయింగువ గచ్చకప్పు బూరగబంక సద్యఃక్షారము యవక్షారము ఇవి సమభాగములు. శుద్ధిచేసిన బంగి ఆకు వెనక చెప్పినట్టి సమస్తవస్తువులయెత్తుకు నాలుగింటిలో వకభాగమువంతునచేర్చి చూర్ణము చేసి ఆవుమజ్జిగ అనుపానముతో సేవించిన బాలింతసకలుగునట్టి సూతికసంగ్రహణులు పోవును. (ఈప్రయోగము అనుభవసిద్ధమైనది.)

## అర్శవ్యాధికిసూరణవటుకములు.

శ్లో॥ శుష్కసూరణహుతాశనాభయానాగరోషణగుడోద్భవావటీ ।
అష్టవేదశశిభూతదగ్ధకంశక్రభాగసహితారుచిప్రదా ॥
అగ్నిమాంద్యగుదజారిశోవిడ్విబంధజఠరార్తినాశినీ ।
ఆర్ద్రపీలుఫలభక్షణాంతథాఽర్శఃకృమిగ్రహణిగుల్మనాశనం ॥

తా॥ కందగడ్డలను తునకలుచేసి ఎండించినచూర్ణము 8 తులములు చిత్రమూలపు తోలు 4 తులములు కరకపిండెలు 1 తులము శొంఠి 1 తులము మిరియాలు 4 తులము వీటినిచూర్ణముచేసి బెల్లము 14 తులములువేసి దానితోకూడ మర్దించి ప్రమాణములుగ వుండలుచేసి సేవించిన అరుచి అగ్నిమాంద్యము మూలవ్యాధులు నొప్పులు మలబంధము

ఉదరరోగములు ఇవిమానుటయేగాక గొలుగుపండ్లు భక్షించిన మూలము క్రిమిరోగములు గ్రహణులు కడుపులోనిబల్లలు ఇవిమానును.

## మూలవ్యాధికిధూపము.

శ్లో॥ నృకేశాహినిర్మోకవేల్లార్కమూలశమీపత్ర శృంగాంకురైర్హింగుయుక్తైః । ప్రధూపోఽర్శసాంనాశయత్యాశువీర్యంయథాకామిని నిత్యసంగోనరాణాం ॥

తా॥ మనుష్యుని వెంట్రుకలు నాగుపాముకూసము వాయువిళంగములు జిల్లేడు వేరు జమ్మిఆకులు దుప్పికొమ్ము ఇంగువ వీటినిచూర్ణముచేసి గుదస్థానమందు పొగ వేసిన అర్శరోగములు మానును.

## అజీర్ణవిషూచికాచికిత్స.

శ్లో॥ వ్యోషత్రివృల్లవణపంచకమగ్నిజీరంక్షారోభయాక్రిమిరిపుఃకణమూలచవ్యే । తక్రేణకోష్ణసలిలేనహిచూర్ణమేతదగ్నింబడాగ్నిమివసంతనుతేనరాణామ్ ॥ పథ్యోగ్రగంధావిడహింగుశుంఠీవిషాకళింగోద్భవచూర్ణమేతత్ । సుఖాంబునాహంత్యరుచింవిషూచీమజీర్ణశూలౌచహుతాశకారి ॥

తా॥ శొంఠి పిప్పలి మిరియాలు తెగడ పంచలవణములు చిత్రమూలము జీలకఱ్ఱ సర్జక్షారము యవక్షారము కరకపిందెలు వాయువిళంగములు మోడి చవ్యము వీటిని చూర్ణముచేసి ఆవుమజ్జిగతోగాని ఉష్ణోదకముతోగాని సేవించిన దీపనము కలుగు. మఱియు కరకపిందెలు వస బిడాలవణము వేయించినఇంగువ శొంఠి అతివస కొడిశెవిత్తులు వీటినిచూర్ణముచేసి ఉష్ణోదకముతో పుచ్చుకొనిన అరుచి విషూచికములు అజీర్ణము శూలలు అగ్నిమాంద్యము ఇవిమానును.

శ్లో॥ హింగూగ్రకంధబిడనాగరదీప్యపథ్యాచూర్ణం విభాగపరివర్ణితమేతదాశు । ఆనాహశూలగుదజానలమాంద్యగుల్మవిష్టంభకోదరవిషూచిహరంసమస్తం ॥

తా॥ వేయించిన ఇంగువ 1 భాగము వస 2 భాగములు బిడాలవణము 3 భాగములు శొంఠి 4 భాగములు ఓమము 5 భాగములు కరకపిందెలు 6 భాగములు వీటిని చూర్ణముచేసి అనుపానయుక్తముగ సేవించిన కడుపుబ్బరము శూలలు మూలరోగములు అగ్నిమాంద్యము కడుపులోనిబల్లలు మలబద్ధము ఉదరవ్యాధులు విషూచిజాడ్యములు ఇవిమానును.

అజీర్ణములకు సాముద్రచూర్ణము.

శ్లో॥ సాముద్రసౌవర్చలసైంధవానాం క్షారోయవానాంచతదాజమోదా। హరీతకీపిప్పలిశృంగబేరంహింగూవిడంగంచసమానికుర్యాత్
ఏతానిచూర్ణానిఘృతప్లుతాని భుంజీతగ్రాసాత్ప్రథమంచపంచ
అజీర్ణవాతంగుల్మవాతంవాతప్రమేహంవిషమంచవాతం। విషూచికాకామిలపాండురోగంశ్వాసంచకాసంచహరేత్ప్రయుక్తం ॥

తా॥ సముద్రలవణము సౌవర్చలవణము సైంధవలవణము యవక్షారము ఓమము కరకాయలు పిప్పళ్లు శొంఠి ఇంగువ వాయువిడంగములు వీటిని సమభాగములుగ జేర్చి చూర్ణించి అన్నములోవైచి నెయ్యిచేర్చి ముందుగ 5 కబళములనుభక్షించిన అజీర్ణవాతము గుదగుల్మవాతము వాతప్రమేహము విషమవాతము విషూచికా కామిల పాండువు శ్వాస కాస వీటిని నశింపంజేయు.

అజీర్ణాదులకు రామబాణరసము.

శ్లో॥ త్రినిష్కంశుద్ధజేపాలంవిషగంధేచటంకణం ।
భృంగరాజరసైఃపిష్ట్వాభూయోవటుకసాధితః ।
రామబాణరసఃఖ్యాతోద్విగుంజఃశ్లేష్మవాతహా ।
అజీర్ణాధ్మానవష్టంభశూలేషుశ్వాసకాసయోః ॥

తా॥ శుద్ధిజేసిన నేపాళములు మూడువరహాలయెత్తు నాభి గంధకము రస ఇవి ప్రత్యేకము వొకవరహాయెత్తుచేర్చి గుంటగలగరాకురసముచేనూరి రెండుగురి జలయెత్తుసేవించిన శ్లేష్మవాతము అజీర్ణము కడుపుబ్బు విష్టంభము శూల శ్వాస కాస వీటిని నశింపంజేయు.

## విషూచిజాడ్యములకు బడబానలరసాయనము.

శ్లో॥ తాలాదేకోరసాదేకఏకస్సీసకభస్మనః ।
ద్వౌభాగౌగంధకాచ్ఛుద్ధాన్మరీచాత్షోడశాంశకః ॥
చూర్ణంకృత్వారక్తికైకాఘృతేనసహాభక్షితం ।
విషూచింసర్వశూలానిప్లీహానముదరంతథా ॥
గుల్మంసంగ్రహణీరోగంశ్వాసకాసకఫానిలాన్ ।
అగ్నిమాంద్యాదికాన్రోగాన్ హంత్యసౌబడబానలః ॥

తా॥ శుద్ధిచేసినతాళకము 1 భాగము శుద్ధిచేసినరసము 1 భాగము సీసభస్మము 1 భాగము శుద్ధిచేసినగంధకము 2 భాగములు మిరియాలు 16 భాగములు వీటిని చూర్ణముచేసి నేతితో గురిగింజప్రమాణము సేవించిన విషూచి సర్వశూలలు ప్లీహరోగములు ఉదరవ్యాధులు కడుపులోనిబల్లలు సంగ్రహణులు ఉబ్బసము దగ్గు శ్లేష్మము వాతరోగములు అగ్నిమాంద్యము ఇవిమానును.

## అగ్నిమాంద్యాదిరోగములకు వహ్నిరసము.

శ్లో॥ జాతీజాతంత్రికర్షంమరిచమపిపలంచార్ధకర్షప్రమాణం ।
గంధంసూతంలవంగంవిషమిదమఖిలం తింత్రిణీసస్యతోయే ।
పిష్ట్వామాషైకమాత్రావితరతిదహనం వహ్నిమాంద్యేచసద్యో ।
రోగాన్‌శూలానిలాదీన్‌దహతికృతగుణోవహ్నినామారసోఽయం॥

తా॥ జావత్రి ౧|౪ తులము జాజికాయ ౧|౪ తులము మిరియాలు ౮ తులములు శుద్ధిచేసిన గంధకము ౪ తులము శుద్ధిజేసినరసము ౪ తులము లవంగములు ౪ తులము శుద్ధిజేసినవసనాభి ౪ తులము చింతాకురసమున మర్దించి మినపగింజలంతమాత్రలుచేసి నీడను ఎండించి అనుపానయుక్తముగ సేవించిన తాపము అగ్నిమాందము శూలలు వాతములు ఇవి నశించును.

## క్రిమిచికిత్స.

శ్లో॥ ఖదిరకుటజనింబోగ్రాత్రివృద్వ్యోషపత్థ్యాఽఽమలకత్రిఫలజోగోమూత్రసిద్ధఃకషాయః । మునిమితదినపీతస్సత్యమేతన్నమిత్థ్యా క్రిమికుల

శతకోటేర్బద్ధమూలానిహంతి । యేసమాక్షికసంయుక్తంచూర్ణం
నైడంగజంయది । సేవితంతస్యజంతూనాంభీతిర్నాస్తికదాచన ॥

తా॥ చంద్రచక్క కొడిశచక్క వేపచక్క వస తెగడ శొంఠి పిప్పలి మిరియాలు కరకపిందెలు ఉసిరికవలుపు తాడికాయలు వీటిని నలియగొట్టి గోమూత్రమువందు నైచి కషాయముకాచి 7 దినములు పుచ్చుకొనినను లేక వాయువిళంగములను చూర్ణముచేసి తేనె అనుపానముతో సేవించినను క్రిమిరోగములు మానును.

పాండురోగచికిత్స.

శ్లో॥ పునర్నవానింబపటోలతిక్తావిశ్వాభయాదారునిశామృతానాం ।
కషాయకఃపాణ్డుగదంనిహంతిసశ్వాసకాసోదరశూలశోథం ॥

తా॥ తెల్లగలిజేరుమూలము వేపచక్క చేదపొట్ల కటుకరోహిణి శొంఠి కరకపిందెలు పసపు తిప్పతీగె వీటిని కషాయముపెట్టి పుచ్చుకొనిన పాండురోగము దగ్గు ఉబ్బసము ఉదరరోగములు శూలలు వాపు ఇవిమానును.

శ్లో॥ గైరికామలధాత్రీణాంమంజనంకామలాపహం ।
తథాకదితమాచార్యై స్తిక్తాచూర్ణంసశర్కరం ॥

తా॥ కావిరాళ్లు ఉసిరికవలుపు పసపు వీటిని నీళ్లతో సానమీద చాచి గంధముతీసి కండ్లకు అంజనమువేసినను లేక కటుకరోహిణి ఖండశర్కర వీటిని చూర్ణముచేసి సేవించినను కామిలలు మానును.

అరిష్టమండూరము.

శ్లో॥ మండూరస్యతుశుద్ధస్యతురార్ధంపరికీర్తితం ।
తద్వల్లోహస్యప్రతాణితిలోత్సేధప్రమాణతః ।
పురాణగుడపంచాశతోల్లప్రస్థత్రయంతథా ।
నికుంభచిత్రయోశ్చైవపలేద్వేద్వేసుచూర్ణితే ।
పిప్పలీనాంవిడంగానాంకుడుపంచపృథక్పృథక్ ।
త్రింశ్చాపిత్రిఫలాఫలాప్రస్థాః జలద్రోణేనసూపవేత్ ।

అర్ధమాసస్థితోధాన్యే పేయోరిష్టప్రమాణతః ।
దోషానుభయతస్సాన్వ్యః పాండురోగంనియచ్ఛతి ।
కృమీనర్శాంసికుష్ఠంచకాసశ్వాసకఫామయాన్ ।
ఏషోరిష్టస్తుమండూరస్సర్వపాండ్వామయాపహః ॥

తా॥ శుద్ధమండూరము 50 పలములు తిలప్రమాణములుగానొనర్పబడిన లోహఖండములు 50 పలములు పాతబెల్లము 73 పలములు నాగదన్తిచిత్రమూలములు వీటిని ప్రత్యేకము రెండేసిపలములుచేర్చి చూర్ణించి ఆచూర్ణము పిప్పళ్లు వాయులవంగములు ఇవిప్రత్యేకము 4 పలములు కరక తాడి ఉసిరికెలు ఇవి ప్రత్యేకము 16 పలములు వీటినన్నిటినిచూర్ణించి 292 పలములనీళ్ళయందునిచి 15 దినములవరకు ధాన్యపుటమిడి పిదప అరిష్టప్రమాణముగ సేవించిన పాండురోగము కృమిరోగము అర్శస్సు కుష్ఠువు కాస శ్వాస కఫము సర్వపాండువులు వీటిని నివర్తింపజేయు.

పాండురోగమునకు కాంతవల్లభరసము.

శ్లో॥ కాంతంషోడశభాగంచ చతుర్ధశహ్యాయోరజః ।
కిట్టంద్వాదశకంచైవ దశభాగంచటంకణం ।
మనశ్శిలాష్టభాగంచషడ్భాగంచశిలాజతు ।
సర్వేషాంచసమంసూతంగంధకంచాపితత్సమం ।
ఆంధ్రమూషోదరేన్యస్యవాలుకాయంత్రనిఃక్షిపేత్ ।
పాచయేత్సప్తదివసాన్ సూక్ష్మచూర్ణంతుకారయేత్ ।
సేవితంమధునాయోజ్య నిష్కార్ధంతుప్రయత్నతః ।
పాండురోగంక్షయంగుల్మప్లీహోదరమహోదరే ।
మందాగ్నింకుష్ఠురోగంచమూలరోగంభగందరం ।
వాతశూలహరంవృష్యంవిశేషేణాప్రదీపనం ।
తుష్టిపుష్టికరంకాంతివర్ధనంబలవర్ధనం ।
కాంతవల్లభనామాయం విష్ణునాపరికీర్తితః ॥

తా॥ కాంతభస్మము 16 భాగములు అయోభస్మము 14 భాగములు కిట్టభస్మము 12 భాగములు వెలిగారము 10 భాగములు మనుశిల 8 భాగములు శిలాజిత్తు

6 భాగములు వీటికన్నిటిని సమము తద్రసము రసమునకు సమము గంధకము వీటి నన్నిటిని ఆంధ్రమూషయందునిచి దానిని వాలుకాయంత్రమున 7 దినములుపచనచేసి పిదపచూర్ణించి నిష్క ప్రమాణము తేనెతో పుచ్చుకొనిన పాండురోగము క్షయ గుల్మము ప్లీహ ఉదరము మహోదరము మందాగ్ని కుష్ఠువు మూలవ్యాధి భగందరము వాతశూల వీటిని నివర్తింపంజేయుటయేగాక వృష్యము దీపనము సంతుష్టి పుష్టి కాంతి బలము వీటివృద్ధినిసగా గలుగంజేయు.

## రక్తపిత్తమునకు స్వరసము.

శ్లో॥ వృషపత్రరసస్సితామధుభ్యాం సహిలోహితపిత్తమాశుహంతి ।
వృష గో స్తనికాభయాశృతంత్రిఫలివాపంశ్వసనాస్రకాసనుద్ధా ॥
శర్కరామధుసంయుక్తంఛాగదుగ్ధమథాపివా ।
గవ్యంపంచగుణేతోయేశ్వథితంరక్తపిత్తనుత్ ॥
దాడిమీకుసుమతోయనావసంనాసికాస్రసుపహంతిసత్వరం ।
మాషపిష్టకదుకూలభూతికాలేపనంచశిరసోహితావహం ॥

తా॥ అడ్డసరపాకులరసము 1 తులముతీసి దానిలో కాలుతులము ఖండశర్కర వేసి కొంచెము తేనెకలిపి పుచ్చుకొనిన రక్తపిత్తము నివారణమగును. మఱియు అడ్డసరపాకు నల్లద్రాక్ష పంఢ్లు నూరతుకరక్కాయలు వీటిని కషాయముపెట్టి పుచ్చుకొనిన రక్తపిత్తము కాసశ్వాసలు యివిమానును. మఱియు మేకపాలలో ఖండశర్కర తేనె వేసి పుచ్చుకొనినను లేక ఆవుపాలలో 5 భాగములు నీళ్లుపోసి నీరు యిరుగువరకు కాచి స్వచ్ఛమైనపాలను పుచ్చుకొనినను రక్తపిత్తములు మానును. మఱియు దానిమ్మపూలయొక్క రసము ముక్కులో నస్యముచేయించిన ముక్కులోనుంచి పడునట్టి రక్తము నిలుచుటయేగాక మినపపిండి పట్టుగుడ్డయొక్క భస్మము వీటిని నీళ్ళలోకలిపి శిరస్సునలేపనముచేసినను రక్తపిత్తము మానును.

ఇతి శ్రీమదహమ్మదనగరస్థితమాణికభట్టాత్మజమోరేశ్వర
విరచిత వైద్యామృతేము ప్రథమాలంకారము
సమాప్తము.

శ్రీరస్తు.

# వైద్యామృతము.

## ద్వితీయాలంకారప్రారంభము

### క్షయలకు అమృతేశ్వరరసము.

శ్లో॥ రసభస్మామృతాసత్వంలోహంమధుఘృతాన్వితం ।
అమృతేశ్వరనామాయంషడ్గుంజారాజయక్ష్మజిత్ ॥

తా॥ రసభస్మము తిప్పసత్తు లోహభస్మము వీటిని సమభాగములుగ చేర్చి తేనె నెయ్యి వీటితో ఆరుగుంజములయెత్తు సేవించిన క్షయరోగము నివర్తించు.

### క్షయాదిరోగచికిత్సా.

శ్లో॥ సితోపలావంశభోపకుల్యాత్రుటిత్వచామాజ్యమధుప్రయుక్తమ్ ।
అంత్యాత్తదూర్ధ్వందిగుణంనిహంతి చూర్ణంసమస్తాంక్షయజాత రోగాన్ ॥ సశ్వాసకాసానలమాంద్య సుప్తజిహ్వారుచిశ్లేష్మకపార్శ్వశూలాన్ । జరోర్ధ్వరక్తాంసకరాంఘ్రిదాహాయుక్తాన్యథా పాపగణాన్మురారిః ॥

తా॥ ఖండశర్కర 16 తులములు వెదురుప్పు 8 తులములు పిప్పళ్ళు 4 తులములు ఏలకులు 2 తులములు లవంగపట్ట 1 తులము వీటిని చూర్ణముచేసి నెయ్యి తేనె వేసిపుచ్చుకొనిన క్షయసంబంధమయిన రోగములు శ్వాసకాసలు అగ్నిమాంద్యము చెముడు అరుచి శ్లేష్మము పార్శ్వశూలలు జ్వరము నోటినుంచిరక్తముపడుట కాళ్లు చేతులు భుజములు వీటియందు మంటలు ఇవిమానును.

శ్లో॥ నవనీతసితామధుప్రయుక్తోవరభోహేమభవఃక్షయంక్షిణోతి ।
వితథఃప్రభవేదయంప్రయోగోయదితన్మేశపథస్సదాశివస్య ॥

తా॥ ఆవుపెన్న ఖండశర్కర చేసి వీటిలో బంగారువరఖుచేసి నిత్యము సేవించిన క్షయరోగములు మానును.

క్షయమునకు శంఖపోటలీరసము.

శ్లో॥ రసంగన్ధకంబోర్భసితమపికాపర్ద భసితంమరీచంభూచంద్రాంబుధిరస సహస్రాంశులవికమ్ । రసాంఘ్రిత్రింశంటంకంసకలమపిచూర్ణీకృతమిదంక్రమాద్యావర్ణిష్కంఘృతసహితమద్యాత్క్షయహరమ్ ।

తా॥ పాదరసము ౧ భాగము గంధకము ౧ భాగము. శంఖభస్మము ౪ భాగములు పచ్చనిగవ్వలభస్మము ౬ భాగములు మిరియాలు ౧౨ భాగములు పేల్చిన వెలిగారము । భాగము వీటిని చూర్ణముచేసి సుమారు ౮ గురిగింజలప్రమాణము నెయ్యి అనుపానముతో భక్షించిన క్షయరోగములు హరించు.

కాసశ్వాసచికిత్సా.

శ్లో॥ భార్గీకట్ఫలకట్తృణాంబుదధనాశృంగ్యుగ్రగంధారజోపత్యాన్యనాగరదేవవృక్షజనితో బాహ్లీకమధ్వన్వితః । క్వాథోయంజ్వరకాసహాశ్వసనహాశ్లేష్మామయధ్వంసనోవక్త్రోత్థామయహాగళగ్రహహారో వాతాపహఃకీర్తితః ॥

తా॥ గంటుభారంగి కాయఫలము సీమచేలవేము వట్టివేళ్ళు తుంగముస్తెలు ధనియాలు కరకపువ్వు వస పర్పాటకము కరకపిందెలు శొంఠి దేవదారుచెక్క వీటిని కషాయముపెట్టి వేయించినఇంగువకలిపి తేనెవేసిపుచ్చుకొనిన జ్వరము దగ్గు శ్వాస కఫరోగము నోటిదుర్గంధము కంఠరోగములు వాతరోగములు ఇవి మానును.

శ్లో॥ యవక్షారకర్షో మరీచంద్వికర్షం ద్వికర్షోపకుల్యాఫలందాడిమస్య । ఫలై ర్వేదసంఖ్యైర్గుడోష్టశుభ్రపదేగోమోఘుటీయంహరాన్సర్వకాసాన్నిహంతి ॥

తా॥ యవక్షారము 1 భాగము మిరియాలు 2 భాగములు పిప్పళ్లు 2 భాగములు దాడింబకాయలతోలు 4 భాగములు వీటిని చూర్ణముచేసి బెల్లము 16 భాగములుచేర్చి మర్దించి వుంటలుచేసి బుగ్గనువుంచుకొని రసముమ్రింగిన దగ్గులన్నియు పోవును.

శ్లో॥ అర్కప్రసూనాంతరవల్లిజానాంఘుటీసకాసంశ్వసనంనిహంతి ।
గురోస్సకాశాదిదమాపతత్వంవైద్యేనమోరేశ్వరసంజ్ఞకేన ॥

తా॥ జిల్లేడుపూలలోని మొగ్గలు మిరియాలు ఈరెంటిని సమముగనూరి మాత్రలుచేసి బుగ్గనువుంచుకొని రసముమ్రింగిన శ్వాసకాసలు మానును.

దగ్గుకుపొగతాగడము.

శ్లో॥ శరపుంఖాజటాధూపదానాక్కాసఃఫలాయతే ।
కాంతావక్షోజసంస్పర్శాద్యమినాంనియమోయథా ॥
పంచాంగకృష్ణధుత్తూరధూపాత్కాసఃపలాయతే ।
యవాసాధూమపానేనకాసోనశ్యతితత్క్షణాత్ ॥

తా॥ తెల్లవెంపలివేరును ఎండించి ఉక్కచిమినిలోవుంచి అగ్నివేసి ఆపొగ తాగిన దగ్గహరించును. మఱిన్ని నల్లఉమ్మెత్తచెట్టు సమూలము చూర్ణముచేసి పొగ తాగినను దగ్గహరించు. మఱియు దురదగొండిచెట్టు సమూలము చూర్ణముచేసి పొగ తాగినను దగ్గమానును.

శ్లో॥ అనేకాఃపీనంమరిచైస్సగర్భంరంభా ఫలంతన్నిశిసన్నిధాయ ।
ప్రాతస్సుభృష్టంమృదుపావకేఽద్యాచ్ఛ్వాసాః ఛినత్తిపలరూః కుఠారః ॥

తా॥ అరటికాయను రెండుచీలికలుచేసి మధ్యమందున్న నల్లనిగిజరును ఎత్తివేసి అందులో మిరియాలచూర్ణమును రాత్రివుంచి ఉదయమున మందాగ్నిలోకాలిచి పక్వముగాతీసి దానినిభక్షించిన దగ్గమానును.

కాసచికిత్సా.

శ్లో॥ లాక్షికామధుకపద్మకోషణాపక్వబార్హతఫలాజ్యమాక్షికైః ।
లేహికాక్షయజకాసమాహరేత్కామినీపదయితస్మరజ్వరం ॥

తా॥ రావిచెట్టుయొక్క బంక అతిమధురము తామరతూండ్లు పిప్పళ్లు చిన్నములకపండ్లు వీటిని చూర్ణముచేసి నెయ్యి తేనెకలిపిపుచ్చుకొనిన క్షయసంబంధమైన దగ్గులు హరించును.

## శ్వాసకాసలకు క్షుద్రాదిలేహము.

శ్లో॥ క్షుద్రాసత్వ్యంవాకషాయం ఘనసంవాభార్ఙ్గీశృంగీకట్ఫలంకారవీచ।
వ్యోషంకుష్టంసైంధవంము స్తపోస్తుజీరే క్షారాదీప్యచిత్రాజమో
దాః ।  సర్వంతుల్యంచాష్టభాగాభయాస్యాద్దేయస్సర్వైర్వేద
భాగోగుడోఽత్ర। పక్త్వావహన్యాక్షౌద్రయుక్తోఽవలీఢఃకాసశ్వాసౌ
మర్ధరౌసర్వజాతౌ॥ అగ్నేర్మాంద్యంకామలాంపాండురోగంగుల్మం
హిక్కాంరాజయక్ష్మజ్వరౌచ । అర్శఃప్లీహానాహవాతోర్ధ్వవా
తాన్ హంతిక్షుద్రాలేహఏషఃక్షణేన ॥

తా॥ గంటుభారంగి కరికపుష్ప కాయఫలము అడవితులసి శొంఠి పిప్పళ్ళు మిరియాలు చంగల్వకోష్టు సైంధవలవణము తుంగముస్తెలు పోస్తుకాయలు జీలకఱ్ఱ సద్యక్షారము యవక్షారము ఓమము చిత్రమూలము అజామోదము ఇవి సమభాగములు నూరరు కరక్కాయలతోలు వైవాటికి ఎనిమిదింటిలో 1 భాగము వీటినన్నియు ప్రత్యేకముగా చూర్ణము చేసి ఈచూర్ణమునకు 4 భాగములు బెల్లము పాకము పట్టి ఆచూర్ణమును వేసి కలుపుకొని వాకుడువేరుయొక్క సత్తుగాని లేక కషాయముగాని దీనిలోకలుపుకొని లేహ్యముగ దించుకొని తేనెతో కూడా సేవించిన కాస శ్వాసలు అగ్నిమాంద్యము కామిల పాండురోగము కడుపుబల్లలు వెక్కిళ్ళు క్షయ దగ్గు జ్వరములు మూలవ్యాధి ప్లీహారోగములు కడుపుబ్బులు వాతరోగములు ఊర్ధ్వ వాతములు ఇవి మానును.

## కాసశ్వాసములకు మహాపిప్పల్యాదిలేహ్యము.

శ్లో॥ సైంధవీపాంశుశోషలంహ్యాస్త్రీకర్ణి తదర్ధకం ।
తదర్ధంచాశ్వగంధాచమూర్వాచాసితదర్ధకం ।
తత్సమంవజ్రవల్లీచరాస్నా చాపితదర్ధకం ।
విశంగంమరిచంభార్ఙ్గీ శొంఠీచగజపిప్పలీ
చతుష్పలంచప్రత్యేకంటంకణంచదశపల్వయం ।
చిత్రకంపిప్పలీమూలంచవిత్రిపలంపృథక్ ...

అబ్ధిఫలంత్రివృత్త్యేకంభృంగరాజంచతుష్పలం ।
గోపీమూలత్వచంత్రీణిమండూరంత్రిపలంపృథక్ ।
ఉలూఖలేసట్టయిత్వాసూక్ష్మచూర్ణానికారయేత్ ।
సితాషష్టిపలంక్షౌద్రంద్విప్రస్థంలేహయేత్తతః ।
ఏకాహికంద్వ్యాహికంచత్ర్యాహికంచచతుర్థకం ।
పంచాహికంచార్ధపక్షంసంతతజ్వరనాశనం ।
పక్షాహికంచషాణ్మాసంజ్వరంవర్షాత్మకంతథా ।
క్షయంచరక్తపిత్తంచవాతశ్లేష్మమసృగ్ధరం ।
పురాణకామిలాపాండుశోఫహృద్రోగపీనసాన్ ।
స్వరాదీన్ శ్వాసకాసాంచప్రత్యష్ఠీలంభగందరం ।
ప్లీహోదరగళగ్రంథిఛర్దిరోగాన్మహాఘనాన్ ।
జలకూర్మార్శశూలంచసూతికారోగనాశనం ।
రసాయనమిదంశ్రేష్ఠంమహాపిప్పలినామకం ॥

తా॥ పిప్పళ్లు 16 పలములు బలురక్కసిగడ్డ 8 పలములు పెన్నేరుగడ్డ 4 పలములు చాగగడ్డలు 2 పలములు నల్లేరువేళ్ళు 2 పలములు దుంపరాష్ట్న 1 పలము వాయువిళంగాలు 4 పలములు మిరియాలు 4 పలములు భారంగి 4 పలములు శొంఠి 4 పలములు గజిపిప్పలి 4 పలములు వెలిగారము 2 పలములు చిత్రమూలము 3 పలములు మోడి 3 పలములు చవ్యము 3 పలములు సముద్రపాలవిత్తులు 1 పలము తుంగముస్తలు 1 పలము తెల్లతెగడ 1 పలము గుంటగలగర 4 పలములు సుగంధపాలపలుపు 3 పలములు మండూరము 4 పలములు వీటినిచూర్ణించి చక్కెర 60 పలములు పాగుబట్టి అందు యీచూర్ణమునువేసి కలిపిదించి చల్లారినపిదప తేనె 2 ప్రస్థములుజేర్చి కలిపి సేవించిన ఏకాహికము ద్వ్యాహికము త్ర్యాహికము చాతుర్థికము పంచాహికము అర్ధపక్షజ్వరము సంతతజ్వరము పక్షజ్వరము షాణ్మాసజ్వరము వర్షజ్వరము క్షయ రక్తపిత్తము వాతశ్లేష్మము రక్తప్రదరము కామిల పాండువాపు హృద్రోగము పీనస స్వరాదిరోగములు శ్వాసకాసలు ప్రత్యష్ఠీల భగందరము ప్లీహోదరము గళగ్రంథి ఛర్ది జలకూర్మార్శస్సులు శూల సూతికారోగము ఇవి నివర్తించును.

శ్వాసకాసలకు కాసమర్దఘృతము.

శ్లో॥ కాసమర్దకవార్తాకమార్కవస్వరసైర్ఘృతం ।
సాధితంకాసజిత్సర్వంశ్వాసకాసాన్వ్యపోహతి ॥

తా॥ చురదగొండిఆకురసము 1 ప్రస్థము వాకుడుఆకురసము 1 ప్రస్థము గుంటగలగరాకురసము 1 ప్రస్థము ఆవునెయ్యి 1 ప్రస్థము వీటిని నేకముగచేర్చి ఘృతపక్వముగకాచి సేవించిన శ్వాసకాసలు నివర్తించు.

కాసశ్వాసలకు మరీచ్యాదిచూర్ణము.

శ్లో॥ సేవితంమధుకంజాభ్యాంచూర్ణంమరిచజంయది ।
కిమర్థంక్రియతేచింతాకాసశ్వాసాపరాజితైః ॥

తా॥ మిరియాలచూర్ణముతో చక్కెరచేర్చి తేనెతోపుచ్చుకొనిన కాసశ్వాసలు నివర్తించు.

కాసశ్వాసలకు మాత్రలు.

శ్లో॥ సూతగంధచపలాహరీతకీభూతవాసనృపవృక్షయష్టికాః ।
భాగతోథపరివృద్ధిమాగతాబబ్బులక్వథితతోయమర్దితాః ॥

తా॥ పాదరసము 1 భాగము గంధకము 2 భాగములు పిప్పళ్లు 3 భాగములు కరక్కాయలు 4 భాగములు తాడికాయలు 5 భాగములు అడ్డసరపాకు 6 భాగములు గంటుభారంగి 7 భాగములు వీటిని చూర్ణముచేసి తుమ్మచెక్కకషాయములో పైచూర్ణముకలిపి మర్దించి గురుగింజప్రమాణము మాత్రలుచేసి అనుపానయుక్తముగ సేవించిన కాసశ్వాసలు మానును.

తామ్రభస్మము.

శ్లో॥ తామ్రంకృశంకాంసలిలేవిధాయ నిర్వాపయేత్ఖల్లోశిరస్త్రివారమ్ ।
ఉపర్యధస్తస్యపటుప్రదత్వాపుటంప్రదద్యాచ్చభవేత్సుభస్మ ॥
కాసాతురాయశ్వాసనాతురాయ సంతంపదేతస్మగధామధుభ్యామ్ ।
యష్ట్యాహ్వపథ్యాయుగంధకేశంచారోగనేత్రాంకారమత్తమంభః ॥

తా॥ శుద్ధిచేసిన లోహమును అగ్నియందుకాచి నీళ్లలోముంచవలసినది. ఈరీతి మూడుమార్లుకాచి నీళ్లలోముంచి ఆరేకులను వావిలిఆకురసములో పైనచెప్పినప్రకారముకాచి తడిపి మూకిటిలోవుంచి పంచలవణములను చూర్ణముచేసి రేకులకుపైన క్రింద 'ఆచూర్ణమునువేసి పైనమూకుడుబోర్లించి చీలమన్నుయిచ్చి పుటముపెట్టిన చక్కగా భస్మమగును. ఆభస్మమును పిప్పలిచూర్ణము తేనె వీటితోయిచ్చిన శ్వాసకాసలు మానును.

హిక్కాచికిత్సా.

శ్లో॥ హరేణుకాపిప్పలికాకషాయోహింగ్వన్వితో౽పోహతి పంచహిక్కాః । నస్యంతథా౽లక్తకసంభవంచ స్తన్యేనవాపోహతిమాక్షికాపిటే ॥

తా॥ వావిలాకు పిప్పళ్లు వీటికికషాయముపెట్టి కొంచముపేయించిన ఇంగువ వేసి పానముచేసిన 5 విధములయిన ఎక్కిళ్లుమానును. మఱియు లత్తుక చనుపాలతో తడిపి నస్యముచేసినను లేక ఈగలయొక్కమలమును చనుబాలలోకలిసి నస్యముచేసినను ఎక్కిళ్లునిలుచు.

ఎక్కిళ్లకుచికిత్సా.

శ్లో॥ విశ్వౌషిధాత్రీకణాచూర్ణస్ససితస్సమధుస్స్మృతః ।
నస్యాదిద్విశ్వసుధయోర్హిక్కాధిక్కారకారకః ॥

తా॥ శొంఠి ఉసిరికెపరుగు పిప్పళ్లు వీనిని సమభాగములుగ చూర్ణముచేసి ఖండశర్కర తేనె కలిపి భక్షించినను లేక శొంఠి బెల్లము వీనిని నస్యముచేసినను ఎక్కిళ్లు హరించు.

స్వరభేదావోచకచికిత్సా.

శ్లో॥ దుగ్ధప్రయుక్తామలకంనరాణాంనష్టస్వరాణాంసుఖమాతనోతియధామృగాక్షీసురతం నరాణాంకందర్పదర్పప్రతిపీడితానాం ॥ సౌవర్చరంగో స్తనికామరీచి మజాజికాకారవికాస్తువృత్తైః । క్షౌద్రగుడంబాడిమమిత్యాసామైకకోతివిధ్వంసమరోచకానాం ॥

తా॥ ఉసిరికకాయపరుగు చూర్ణముచేసి ఆవుపాలలోకలిపి పుచ్చుకొనిన కంఠముయొక్క స్వరహీనము గుణమగును. మఱియు సౌవర్చలవణము నల్లద్రాక్షపండ్లు మిరియాలు జీలకఱ్ఱ పెద్దసోపు చింతపండు తేనె బెల్లము దాడిమఫలము వీటి సేవనవలన నోటియొక్క అరుచి మానును.

## వమన చికిత్స.

శ్లో॥ పథ్యామలక్షౌద్రసితోపలాజాః పలోన్మితాస్సు ర్యదుపసంజలస్య ।
తచ్చాప్యనపాగాలితమాశుపీతంఛర్దింత్రిదోషైర్జనితాంనిహంతి ।
త్రికాతకవ్యోషలవంగజీరనాగాహ్వయగ్రంథికచూర్ణమేతత్ ।
మధుప్రయుక్తంసహసానిహంతిద్విష్టార్ధజాంఛర్దిమపిప్రసక్తాం ॥

తా॥ కరకపిందెలు 4 భాగములు ఉసిరికాయలపరుగు 4 భాగములు తేనె 4 భాగములు ఖండశర్కర 4 భాగములు పరిపేలాలు 4 భాగములు యీ ఔషధము లనుసారి 20 తులముల నీళ్లలో కలిపి వడియగట్టి పుచ్చుకొనిన త్రిదోషజనితమైన వాంతి నిలుచును. మఱియు లవంగపట్టె లవంగపత్రి నల్లవేళ్లు శొంఠి మిరియాలు పిప్పళ్లు లవంగాలు జీలకఱ్ఱ నాగకేసరములు కూడ వీటిని చూర్ణముచేసి తేనెలోకలిపి పుచ్చుకొనిన వాంతినిలుచును.

## [illegible] శిఖరిణీ [illegible].

శ్లో॥ అర్ధాఢకంరుచిరసద్యుషితస్యదధ్నః ఖండస్య షోడశపలానిశశిప్రభస్య । సర్పిఃపలంమధుపలంమరిచంద్వికర్షంశుంఠ్యాఃపలార్ధమపిచార్ధపలంత్వచశ్చ ॥ సూక్ష్మేపటేలలనయామృదుపాణిఘృష్టాకర్పూరధూళిసురభీకృతభాజనస్థా । ఏషావృకోదరకృతాసరసారసా లాయాస్వాదితాభగవతామధుసూదనేన ॥

తా॥ చక్కగా పేరిన పుల్లపెరుగు 2 సేర్లు పంచదార 4 తులములు తేనె 4 తులములు మిరియాలు 2 తులములు శొంఠి 2 తులములు యీపదార్థములన్నిటిని మంచి తెల్లనివస్త్రములో వస్త్రగాలితము చేసి పైన చెప్పిన గట్టిపెరుగులోనుండెడు నీరును వడియగట్టి పైనచెప్పినచూర్ణమునువేసి బాగుగ మర్దించి పిమ్మట ఏలకులచూర్ణము 2 తుల

ములు స్వల్పముగ పచ్చకర్పూరము ఖండశర్కర 1 తోలచేర్చి పుచ్చుకొనిన దప్పి నిలిచిపోవును.

## మూర్ఛాచికిత్స.

శ్లో॥ ద్రాక్షామృతానాగరపుష్కరాణాంసగ్రంధికానాంక్వథితంసకృష్ణం।
పదేషుమూర్ఛాసహితంఘృతాద్యందురాలభాయాఃక్వథితంభ్రమేంచ॥

తా॥ వల్లద్రాక్షపండు తిప్పతీగె శొంఠి పుష్కరమూలము మోడి వీటిని కషాయము పెట్టి పిప్పలిచూర్ణముకలిపి పుచ్చుకొనిన మదమూర్ఛలు మానును. మరిన్ని దురదగొండివేళ్లకషాయములో నెయ్యివేసి పుచ్చుకొనిన భ్రమనివారణ మగును.

## తాపచికిత్స.

శ్లో॥ సహస్రధౌతాజ్యవిలేపనేన దాహశ్శమంగచ్ఛతిశీఘ్రమేవ।
తథాహిమోత్థాన్యసముద్భవాంతద్దాహంసతృష్ణాంససితంనిహంతి॥

తా॥ ఆవునెయ్యిని 1000 పరియాయములు నీళ్లతోకడిగివుంచుకొని దానిని శరీరమునకు లేపనముచేసిన దేహతాపము శాంతియగును. మరిన్ని ధనియాలను నలగగొట్టి రాత్రినీళ్లలో నానవేసి ఉదయమున ధనియాలనుతీసి ఆనీళ్లలో ఖండశర్కర వేసి పుచ్చుకొనిన తాపము మానును.

## అపస్మారచికిత్స.

శ్లో॥ భజేన్మాక్షికేనప్రయుక్తంవచాయారజః క్షీరభక్తాశనోమానవో యః। అపస్మారరోగశ్చిరస్థోపిఘోరశ్శమంయాతితస్యా శునోత్రాస్తిశంకా॥

తా॥ వసను చూర్ణముచేసి తేనెతోకలిపి పుచ్చుకొనిన అపస్మారజాడ్యము మానును. ఇందుకు ఆవుపాలన్నము పథ్యము.

వాతవ్యాధికి భుజంగవటుకములు.

శ్లో॥ ఏషాకర్షమితావటీసుఘటితాజీర్ణేగుడేయుక్తితో ద్విఘ్నుందీప్య
తుషంపలద్వయమితాశుంఠీతథాతేజనీ । భక్ష్యైకానిలరోగిణా
ఘృతయుతాపథ్యాశినాతత్వతో వాతవ్రాతవినాశనేనుమతిభిః
ఖ్యాతాభుజంగీవరా ॥

తా॥ పాతబెల్లము 1 భాగము ఓమపుపొట్టు 2 భాగములు శొంఠి 8 భాగములు జ్యోతిష్మతివిత్తులు అనగా (మాల్కోణివిత్తులు) 8 భాగములు ఈవస్తువులను చూర్ణము చేసి బెల్లము వేసి మర్దించి తులమురెత్తువంతున మాత్రలుచేసి ఆమాత్రలను నేతిలో ముంచి రెండుపూటలు ఒక్కొక్కమాత్రవంతున పుచ్చుకొనిన వాతవ్యాధులు మానును (ఇందుకు సాధారణపథ్యము.)

శ్లో॥ తేజోహ్వప్రస్థమేకంపయసిగజగుణే పాకయుక్త్యావిపాచ్యంపాద్యోషం
పథ్యాంశతాహ్వాంక్రిమిరిపుమనలంగ్రంధికంచాజమోదం । ఉగ్రా
కుష్ఠాశ్వగంధాసురతరుమమృతంపాలికానిప్రదద్యాత్సర్వాణ్ వాతా
న్వటీయం ఘృతమధుసహితానాస్త్రిధావాక్ కరోతి ॥

తా॥ మాల్కోణివిత్తులు 1 శేరు నీళ్లు 8 శేర్లు వీటినికషాయముపెట్టి అష్ట భాగముగా దించుకొని శొంఠి పిప్పలి మిరియాలు కరకపిందెలు పెద్దసోపు వాయు విడంగములు చిత్రమూలము మోడి అజామోదము వస చెంగల్వకోష్ఠు దేవదారుచెక్క శుద్ధిచేసినవసనాభి ఇవి దినుసు (1 కి) 4 తులములచొప్పునచేర్చి చూర్ణముచేసి వెన కటికషాయములో కలుపుకొని మాత్రలుచేసి నీడనుయెండించి తేనె నెయ్యి వీటితో సేవించిన వాతరోగములుమానును (శేరు అనగా 80 తులములయెత్తు.)

వాతవ్యాధికి నిర్గుండికానితైలము.

శ్లో॥ నిర్గుండీకారసాత్ప్రస్థంప్రస్థమాగ్న్యాసాద్రసాత్ ।
రసాద్ధుత్తూరజాత్ప్రస్థంగోమూత్రంప్రస్థసమ్మితం ॥
వచాకుష్ఠంసోమబీజంతేజోహ్వకట్ఫలంతథా ।
[illegible] ॥

తైలప్రస్థంపచేద్యుక్త్యావాతరోగేషుశస్యతే ।
హేమంతేహరిణాక్షీణాంగాఢమాలింగనంయథా ॥

తా॥ నల్లవావిలిఆకురసము 1 శేరు గుంటగలగరఆకురసము 1 శేరు ఉమ్మెత్త ఆకులరసము 1 శేరు గోమూత్రము 1 శేరు వస చంగల్వకోష్ఠు ఉమ్మెత్తవిత్తులు మాల్కోణివిత్తులు కాయఫలము ఇవి దినుసుకు 2 తులములు ఈ 5 వస్తువులకు సమముగ శుద్ధిచేసిన నాభి వీట్లను 1 శేరు నూనెలోవేసి తైలపక్వముగకాచి వడియగట్టి దేహమునకు లేపనముచేసికొనిన వాతరోగములు మానును.

వాతరక్తచికిత్స.

శ్లో॥ ఏరండతైలేనగుడూచికాయాఃక్వాథోఽథవావర్ధితపిప్పలీవా ।
గుడేనపథ్యాఖిలవాతరక్తంవినాశయేత్పథ్యయుతస్యపుంసః ॥

తా॥ తిప్పతీగెయొక్కకషాయములో ఆముదమువేసితాగినను లేక * వర్ధమాన పిప్పలిని సేవించినను లేక నూరతుకరక్కాయలచూర్ణమును బెల్లముతో సేవించినను వాతరక్తములునశించును (ఇందుకు పథ్యములు యుక్తానుసారము.)

అమృతాదికల్కము.

శ్లో॥ అమృతాకటుకీశుంఠీయష్టికల్కంసమాక్షికం ।
గోమూత్రపీతంజయతిసకఫంవాతశోణితం ॥

తా॥ తిప్పతీగె కటుకరోహిణి శొంఠి యష్టిమధుకము వీటిని చూర్ణించి అందు తేనె గోమూత్రముకలిపి పుచ్చుకొనిన కఫయుక్తవాతరక్తము నివర్తించు.

గుడూచీతైలము.

శ్లో॥ గుడూచీక్వాథకల్కాభ్యాంతైలంలాక్షారసేనవా ।
సిద్ధంమధుకకాశ్మర్యరసేవావాతరక్తనుత్ ॥

---

* దినవరుసక్రమముగా ఒక్కొక్కపిప్పలిచొప్పున 7 దినములవరకు ఎచ్చించి అదేరీతిగ 7 దినములవరకుతగ్గించి చూర్ణముచేసి పాలతోగాని నీళ్ళతోగాని సేవించునది వర్ధమాన పిప్పలియనబడు.

తా॥ తిప్పతీగెకషాయముగాని లేక కల్కముగానిగ్రహించి అందు తైలము లక్కరసము యష్టిమధుకము నేలగుమ్మడుగడ్డరసము వీటిని నేకముగచేర్చి తైలముకాచి అభ్యంగనాదులంజేసుకొనిన వాతరక్తము నివర్తించు.

## తాళకభస్మము.

శ్లో॥ తాలంరసంతువరికాంసయనేందుబాణభాగైర్వి శుద్ధవసుజారసేవి
మద్యాత్ । దత్వాశరావయుగళేప్రవిధాయముద్రాందద్యాద్గజాహ్వ
పుటమస్యభవేత్సుభస్మ॥ దృష్ట్వాకృతింప్రకృతింమప్యఖిలామవస్థాం
దృష్ట్వాపునశ్చ బహుధాబహుధావిచార్య । దద్యాచ్చతండుల
మితాంహరితాలమాత్రాం విద్యామయాద్యతిరాదియమాసయ
త్నాత్ ॥

తా॥ శుద్ధిజేసినతాళకము 2 భాగములు శుద్ధిచేసినపాదరసము 1 భాగము పటిక 5 భాగములు వీటిని తెల్లగలిజేరు రసముచేత మర్దించి ఎండినపిమ్మట మూకుటిలో నునిచి పైన వొకమూకుడుబోర్లించి చీలమన్నుయిచ్చి గజపుటముపెట్టిన స్వచ్ఛమైన భస్మమగును. అట్టిభస్మమును రోగియొక్కస్వరూపమును పదేపదే తెలుసుకొని బాగుగ ఆలోచించి బియ్యపుగింజపరిమాణము అనుపానయుక్తముగనిచ్చిన సమస్తరోగములు నివారణమగును. నేనీక్రియను ఒకమహాత్మునివలన పొందితిని.

## ఊరుస్తంభచికిత్సా.

శ్లో॥ భల్లాతకుల్యామగధాజటానాంకృతఃకషాయోమధుసంప్రయుక్తః।
ఊరుగ్రహంఘోరమపిప్రవృద్ధంనిహంతిగోమూత్రయుతాకణావా॥

తా॥ జీడిగింజలు పిప్పళ్ళు మోడి వీటిని కషాయముపెట్టి తేనెవేసి పుచ్చుకొనినను పిప్పలిచూర్ణమును గోమూత్రముతో పుచ్చుకొనినను ఊరుస్తంభవాయువులు మానును.

## అన్యచ్చ.

శ్లో॥ పునర్నవానాగరదారుపథ్యాభల్లాతకచ్ఛిన్నరుహాంకషాయః।
దశాంఘ్రిమిశ్రఃపరిపేయ ఊరుస్తంభేదవామూత్రపురప్రయోగః॥

తా॥ తెల్లగలిజేరువేళ్ళు శొంఠి దేవదారు కరకపిందెలు జీడివిత్తులు తిప్పతీగె వీనిని సమముగ కషాయముకాచి అందు దశమూలముల చూర్ణమునుగాని లేక ఆవు పంచితములో శుద్ధిచేసినగుగ్గిలమునుగాని కలిపి త్రాగిన ఊరుస్తంభవాతము హరించు.

## ఆమవాతమునకు భల్లాదిచూర్ణము.

శ్లో॥ భల్లాతతిలపథ్యానాంచూర్ణంగుణసమన్వితం ।
ఆమవాతంకటీశూలం హన్యాద్వాగుడనాగరం ॥

తా॥ జీడిగింజలు నువ్వులు కరకవలుపు వీటినిచూర్ణించి బెల్లముచేర్చి పుచ్చుకొనినను లేక శొంఠిచూర్ణము బెల్లముచేర్చి పుచ్చుకొనినను ఆమవాతము కటిశూల ఇవి నివర్తించు.

## నాగరాదిచూర్ణము.

శ్లో॥ కర్షంనాగరచూర్ణస్యకాంజికేనపిబేత్సదా ।
ఆమవాతప్రశమనం కఫవాతవినాశనం ॥

తా॥ కర్షము శొంఠిచూర్ణమును కాంజికముతో పుచ్చుకొనిన ఆమవాతము కఫవాతము ఇవి నివర్తించు.

## ఏరండాదిగుటికలు.

శ్లో॥ ఏరండబీజమజ్జాసమవిశ్వాశర్కరాసహితా ।
గుటీకృతాప్రభాతేభుక్తాశామానిలంజయతి ॥

తా॥ ఆముదపువిత్తులలోని పప్పు శొంఠి శర్కర వీటిని సమములుగనూరి మాత్రలుజేసి ప్రాతఃకాలమున భుజించుచుండిన ఆమవాతము నివర్తించు.

శ్లో॥ రాస్నారగ్వధదేవదారు ఋతుభూశ్ఛినోద్భవాగోక్షురై రేరండేన
యుతైఃకషాయకవరోవిశ్వారజోమిశ్రితః । నానాసంధిరుజాన్వితం
విజయతేఘోరామవాతాయం స్వర్ణాంగగుచపద్మకుట్మలరుచిర్ధీ
షోంఽధకారంయథా ॥

తా॥ సన్నరాష్ట్రకము ఏలకాయలగిజరు దేవదారుచెక్క తెల్లగలిజేరు మూలము తిప్పతీగె పల్లేరు సమూలము ఆముదపువేరు వీటిని కషాయముబెట్టి అందులో శొంఠి చూర్ణముచేసి పుచ్చుకొనిన అనేక సంధులయందుగల నొప్పులు భయంకరమైన ఆమవాతము ఇవి మానును.

## నారాయణతైలము.

శ్లో॥ అశ్వగంధాబలాబిల్వంపాఠాచబృహతీద్వయమ్ ।
తథాగోక్షురకంనాగబలాచపిచుమందకమ్ ।
మ్లేచ్ఛస్యపిచుమందంచతథామూలంపునర్నవమ్ ।
మధూచ్ఛిష్టలతాచైవఏరండస్యచమూలకమ్ ।
ఏతానిసమభాగానిప్రత్యేకంచయథాక్రమమ్ ।
చత్వారింశద్రూప్యసమమేకైకస్యవినిక్షిపేత్ ।
ఏతానిచైవసంగృహ్యచతుర్ద్రోణ్యాంభసాపచేత్ ।
చాతుర్భాగావశిష్టంచకషాయంసుపరిశ్రుతమ్ ।
నవ్యవస్త్రేణసంశోధ్యతన్మధ్యేతిలతైలకమ్ ।
దశప్రస్థంవినిక్షిప్యశతావర్యారసంపునః ।
తత్సమంతువినిక్షిప్యగోక్షీరంచాఢకద్వయమ్ ।
తదర్ధంచవినిక్షిప్యమేళయిత్వాయథాక్రమమ్ ।
క్రోష్టుచైలాచశ్రీగంధందర్భమూలంపసాతథా ।
మాంసీచసైంధవంచాపిఅశ్వగంధామహాబలా ।
రాస్నాచైవిపుషంచైవదేవదారురరణ్వకే ।
గాంధారీచణమూలంచహ్రీబేరంమాషమూలకమ్ ।
అరణ్యంముద్గమూలంచగజాహ్వేడస్యబీజకమ్ ।
ఏతానివైరూప్యసమభాగాన్యేకస్యచూర్ణకమ్ ।
సంశోధ్యనవ్యవస్త్రేణకల్కంకృత్వాయథావిధి ।
ఏతత్తైలంధాన్యరాశౌధాపయేత్పక్షమాత్రకమ్ ।
తత్తైలంపూజితంసేవ్యమశీతివాతనాశనమ్ ।

అభ్యంగం పానసస్యే చ కార్యం వై సర్వరోగనుత్ ।
పతత్తైలం వాతరోగసమూహం హన్తి చోత్తమమ్ ।
మన్యాస్తంభే హనుస్తంభే తథా వై గలగ్రహే ।
కటిశూలే చ హృచ్ఛూలే పార్శ్వశూలే చ వై తతః ।
బాధిర్యే గతిభంగే చ కటిభంగే తతః పునః ।
హస్తపాదాదిగాత్రస్య శోషణే రక్తవైకృతే ।
ధాతుక్షయే జ్వరేష్వేవ క్షయరోగే తథైవ చ ।
అండవాతే చాంత్రవృద్ధౌ వృషణస్థూలరోగకే ।
దంతరోగే మస్తవాతే పార్శ్వశూలే చ పంగుకే ।
బుద్ధిభ్రంశే గృధ్రివాతే సేవ్యమేతత్సుఖావహమ్ ।
మానవానాం సుఖమేధం తే సత్యం సత్యం వదామ్యహమ్ ।
ఏవం నారాయణం తైలం ప్రోక్తం శాస్త్రానుసారతః ।
ధన్వంతరిప్రోక్తమిదం సర్వసౌఖ్యప్రదాయకమ్ ॥

తా॥ పెన్నేరుగడ్డ ముస్తెవపులగము నాగేదుపిందెలు నిమ్మబొద్ది నేలములక పెద్దములక పల్లేరువేళ్ళు పెద్దముస్తెవపులగము వేపచెక్క తురకవేపచెక్క తెల్లగలిజేరువేళ్ళు మైనపుతీగె ఆముదపువేళ్ళు ఈదినుసులన్నింటిని 40 తులములెత్తుకొని నలియగొట్టి అందులో 4 ద్రోణములు అనగా 4096 తులముల నీళ్ళుబోసి 4 వ భాగముగ మిగిలించుకొని వడియగట్టి అందులో మంచినూనె 256 తులములు పిల్లిపీచరగసము 256 తులములు ఆవుపాలు 1024 తులములు పోసి పిదప కోష్టు ఏలకులు శ్రీగంధపుచూరు పచ్చవేళ్ళు వస జటామాంసి సైంధవలవణము పెన్నేరుగడ్డ ముస్తెవపులగము చిన్నరాష్ట్రకము పెద్దసోపు దేవదారుచెక్క అడవిబంగిఆకు అడవిశనగలు అడవిమినుములు అడవిపెసలు తగిరిశవిత్తులు ఇవి దినుసుకు 1 కి 8 తులములచొప్పున చూర్ణముగాని కల్కముగాని చేసి అందులోపోసి సూక్ష్మాగ్నిచేత తైలపక్వముగవండి దించుకొని ధాన్యరాశిలోనుంచి పూజించి నైవేద్యముయిచ్చి అభ్యంజనము పానము నస్యము మర్దనచేసికొనిన పక్షఘాతము హనుస్తంభవాయువు మన్యాస్తంభవాయువు గలగ్రహవాయువు నడుమునొప్పులు కడుపునొప్పి కాళ్లనొప్పి చెవుడు గతిభంగవాయువు కంటిభంగవాయువు కాళ్ళుచేతులుమండుట రక్తవికారము ధాతుక్షయము

జ్వరములు క్షయరోగము అండవాయువు ఆంత్రవృద్ధి వృషణస్థూలరోగము దంతరోగము మస్తకవాయువు పార్శ్వశూలలు పంగుత్వము బుద్ధిభ్రంశము నడుము మొదలు పాదములవరకు నొచ్చెడి గృధ్రసివాయువు మొదలుగాగల 80 వాతములు హరించును గాన ఈనారాయణతైలము మనుష్యులకు బహుసుఖకరమయినది.

## రసభస్మము.

శ్లో॥ శరావకేహితంసూతంద్విగుణ్ణసంగంధముహాద్మ్రవులః ।
దత్వాగ్నింసూర్యయామాంతంనింబకాష్ఠేనఘట్టయేత్ ॥
ఏవంభవేత్పీతవర్ణారసరాజస్యభూతికా ।
యథానుపానసంయోగేషుప్రదద్యాద్భిషగుత్తమః ।
ఆర్జితంవివిధోపాయైర్జంగమాగ్నిభుజాన్వయా ।
ఇదంతత్ప్రలబ్ధంతుపాలనీయంచికిత్సకైః ॥

తా॥ శుద్ధిచేసిన పాదరసము 1 భాగము తగరము 2 భాగములు వీటిని మూకుడులో వుంచి క్రిందమంటవేయుచు వేపకఱ్ఱతో 12 ఝాములు రుద్దిన పచ్చనిభస్మమగును. దీనిని వైద్యుడు అనుపానములనుగుఱిగి ఇవ్వవలయును. ఇది ఒకమహాత్ముని వలన పొందితిని.

## శూలచికిత్స.

శ్లో॥ సౌవర్చలపురుషోదకంహింగుయుక్తంసుసహరీతకీప్రదిష్టంభిషగ్భిః ।
యథాహింగువిశ్వావిడైర్వాపితోత్థం ఇతిసైంధోద్భవోవాతశూలాయః
ప్రదిష్టం ॥

తా॥ ఆడుగుద్రసుముక్క లద్ది గుగ్గిలోచేసిసింధి ఆసనములో చేయించిన ఇంగువనుచేర్చి సేవించినను శొక ఫలవలను కసాయము ఇచ్చి అందు ఇంగువ శొంఠి బిడాలవణము వీటిని చూర్ణముచేసికలిపి సేవించినను కఠినమైన శూలలు మానును.

శ్లో॥ విశ్వావచాహింగుమరీచజీరాస్త్రుతానసైంధవార్య్యవలోయపిష్టాః ।
కృతాహారికేయంచనకప్రమాణాఃశూలాన్నిహంత్యానిలరోగహంత్రీ ॥

తా॥ శొంఠి వస వేయించినయింగువ మిరియాలు జీలకఱ్ఱ శుద్ధిచేసిన వసనాభి చిత్రమూలము వీటిని చూర్ణముచేసి వస్త్రఘాలితముజేసి గుంటగలిజేరాకు రసమున మర్దించి శనగగింజలంతమాత్రలుచేసి తగిన అనుపానముతో నిత్యము 1 మాత్రచొప్పున పుచ్చుకొనిన శూలలు అగ్నిమాంద్యములు వాతములు ఇవి మానును.

శూలకునారాచచూర్ణము.

శ్లో॥ కర్షమాత్రాభవేత్కృష్ణాత్రివృతంస్యాత్పలోన్మితం ।
ఖండాత్పలంచవిజయంచూర్ణమేకత్రకారయేత్ ।
కర్షోన్మితంలిహేదేతత్క్షౌద్రేణాధ్మానకనాశనం ।
గాఢవిట్కోదరకఫ పిత్తశూలానినాశయేత్ ॥

తా॥ పిప్పలి 1 కర్షము తెల్లతెగడ 4 కర్షములు బిడాలవణము 4 కర్షములు వీటిని నేకముగజేర్చి చూర్ణించి నర్థకర్షప్రమాణమాషధమును తేనెతోపుచ్చుకొనిన అధ్మానము మలబద్ధము ఉదరము కఫము పిత్తము శూల ఇవి నివర్తించు.

హింగ్వాది చూర్ణము.

శ్లో॥ హింగుక్షౌద్రకుబేరాక్షౌవృద్ధాశ్శూలేంబునాసుఖాః ।
గుడాభయంవాసఘృతోరసోనశ్శూలనుత్వరః ॥

తా॥ ఇంగువ 1 భాగము తానికాయ 2 భాగములు శొంఠి 3 భాగములు గచ్చపప్పు 4 భాగములు వీటిని చూర్ణించి వేడినీళ్లతోపుచ్చుకొనినను లేక కరక వొలుపు బెల్లము లేక వుల్లిపాయలు నెయ్యి వీటినిసేవించినను శూల నివర్తించు.

ఏరండమూలాదిచూర్ణము.

శ్లో॥ ఏరండమూలంతుంబురుబిడలవణసువర్చలాభయా ।
హింగురేతైరంబునాపీతైర్నయాంతిశూలచగుదగుల్మం ॥

తా॥ ఆముదపువేరు ధనియాలు బిడాలవణము సౌవర్చలవణము కరకవలుపు ఇంగువ వీటిని చూర్ణించి వుదకముతోపుచ్చుకొనిన శూల గుల్మము ఇవి నివర్తించు.

## శూలలకుశంఖవటుకములు.

శ్లో॥ చింతావల్కల భూతికాపలమితా తత్తుల్యభాగఃపటుర్వ్యూహా
నింబురసేసకల్కితమిదంశంఖోపిభూత్యాసమః । యావద్ధస్తవిచూ
ర్ణితోభవతితం సంతాప్యనిర్వాపయేత్పశ్చాదింగుమరీచ నాగర
కణాఃకర్షప్రమాణాక్షిపేత్ ॥ నిష్కాంశౌవిషగంధరారసయుతో
దత్వావిమర్ద్యాతనూకోలాస్థిప్రమితాగ్నిమాంద్యజనితాన్ రోగా
న్నిహంతిక్షణాత్ ॥ శూలసంగ్రహణీజీర్ణమరుచింపక్తిశూలం
క్షయం త్వేషాశంఖవటీనిజోపక్రుతిభిర్విశ్వంసదారక్షతి ॥

తా॥ చింతబెరడు భస్మము 4 తులములు పంచలవణములు 4 తులములుకలిపి వీటిని ఖల్వమునవేసి నిమ్మపండ్లరసముచేత నానబెట్టి శంఖపు తునకలు 4 తులములు నిప్పులయందు చేతితోనలిచితే చూర్ణముఅగునటుల వేయించి నిమ్మపండ్లరసముతో చల్లార్చి పైవస్తువులతోకూడా ఖల్వమునందు మర్దించి వేయించిన ఇంగువ మిరియాలు శొంఠి పిప్పళ్ళు ఇవి దినుసుకు 1 తులము శుద్ధిచేసినవసనాభి శుద్ధిచేసినగంధకము శుద్ధిచేసిన పాదరసము వీటిని దినుసు 1 కి కాలుతులమువంతున వెనుక నూరిన దానితోచేర్చి మరల ఆరసమునూరి రేగుగింజలంత వటుకములుచేసి అనుపానయుక్తముగ పుచ్చుకొనిన అగ్నిమాంద్యమువలన పుట్టినరోగములు శూలలు సంగ్రహణులు అజీర్ణములు అరుచి పక్తిశూలలు క్షయము ఇవి మానును. ఈవటుకములు అనుపానవిశేషముచేత అన్నిరోగములకు వుపయోగపడును.

## ఉదావర్త చికిత్స.

శ్లో॥ క్షారత్రయంలవణపంచకమగ్నికవ్యోషాభయాక్రిమిరిపుస్త్రి
వృదుగ్రగంధా । చూర్ణస్స్నుహీజపయసాపహలుభావిభావో
దావర్తగుల్మజఠరప్రభృతీన్నిహంతి ॥

తా॥ సద్యఃక్షారము యవక్షారము అప్పళాకారము పంచలవణములు చిత్రమూలము ఓమము శొంఠి పిప్పళ్లు మిరియాలు కరకపిందెలు వాయువిళంగాలు తెగడ వస వీటిని చూర్ణముచేసి జెముడుపాలచే 4 - 5 మారులు భావనచేసి ఈచూర్ణమును అనుపానయుక్తముగ పుచ్చుకొనిన వుదావర్తము కడుపుబల్లలు ఉదరరోగములు ఇవి మొదలగునవి మానును.

## ఉదావర్తమునకుహింగ్వాది చూర్ణము.

శ్లో॥ హింగూగ్రగంధావిడశుంఠ్యజాజీహరీతకీపుష్కరమూలకుష్ఠం ।
భాగోత్తరంచూర్ణితమేతదిష్టంగుల్మోదరానాహవిషూచికాసు ॥

తా॥ ఇంగువ వస బిడాలవణము శొంఠి జీలకఱ్ఱ కరక పుష్కరమూలము చంగల్వకోష్ఠు వీటిని క్రమవృద్ధిగ గ్రహించి చూర్ణించి పుచ్చుకొనిన గుల్మోదరము ఆనాహము విషూచిక ఇవి నివర్తించు.

## గుల్మప్లీహాదిచికిత్స.

శ్లో॥ యవక్షారోయవానీచసైంధవంచామ్లవేతసం ।
హరీతకీవచాహింగుచూర్ణముష్ణేనవారిణా ॥
సప్తాహాద్గుల్మనిచయంసశూలంసపరిగ్రహం ।
భినత్తినాత్రసందేహోవహ్నేర్వృద్ధింకరోతిచ ॥

తా॥ యవక్షారము ఓమము సైంధవలవణము ఆమ్లవేతసము కరక్కాయతోలు వస వేయించినయింగువ వీటిని చూర్ణము చేసి ఉష్ణోదకముతో 7 దినములు సేవించిన వాయువులచేత కడుపులోపుట్టిన పోటుగలబల్లలు ఉదరవ్యాధులు నివారణమగును. దీపనమున్ను కలుగును.

## గుల్మమునకునారాచరసము.

శ్లో॥ శుద్ధసూతంసమంగంధంనేపాళంత్రిఫలాసమం ।
త్రికటుంపేషయేత్తైలైర్నిష్కంగుల్మహరంలిహేత్ ।
గుల్మోదరహరఃఖ్యాతోనారాచోయంరసోత్తమః ॥

తా॥ శుద్ధిచేసినరసము గంధకము నేపాళములు త్రిఫలములు త్రికటుకములు వీటిని సమముగజేర్చి తేనెతో మర్దించి నిష్కప్రమాణము పుచ్చుకొనిన గుల్మోదరము నివర్తించు.

## నారాచచూర్ణము.

శ్లో॥ శతపుష్పావచాశుష్ఠకారవీజాజిధాన్యకం ।
దాక్షారాపిప్పలీమూలంసమ్యగ్రాచోపకుంచికా ।
స్వర్ణక్షీరీవాజిగంధావిశాలాచిత్రకస్సమాః ।
త్రివృద్దన్తిసప్తలాచవపాంద్విగుణానపి ।
నారాచకమిదంఖ్యాతంచూర్ణంశ్రేష్ఠంవిరేచనం ।
గుల్మానాహవిషాజీర్ణశ్వాసకాసగళగ్రహం ।
శోఫార్శోగ్రహణీదోషంగుల్మాన్పంచవిధానపి ॥

తా॥ సదాప వస చంగల్వకోష్టు బాలింతసోపు జీలకఱ్ఱ ధనియాలు వెలిగారము యవక్షారము మోడి కచూరములు నల్లజీలకఱ్ఱ కంకోష్టు పెన్నేరుగడ్డ పాపర చిత్రమూలము ఇవి సమము తెల్లతెగడ 2 భాగములు సేపాళములు 3 భాగములు జాజి 3 భాగములు వీటిని చూర్ణించి పుచ్చుకొనిన రేచనంబగుటయేగాక గుల్మము ఆనాహము విషాజీర్ణము శ్వాస కాస గళగ్రహము శోఫ అర్శస్సు గ్రహణిదోషము పంచవిధగుల్మములు ఇవి నివర్తించు.

## చిత్రకాదిఘృతము.

శ్లో॥ చిత్రకంవ్యోషసింధూత్థపృథ్వీకాచవ్యదాడిమైః ।
దీప్యకగ్రంథికాజాజీహాపుషాధాన్యకైస్సమైః ।
దధ్యారనాళబదరమూలకస్వరసైర్ఘృతం ।
పక్త్వాపిబేద్వాతగుల్మదౌర్బల్యాటోపశూలనుత్ ॥

తా॥ చిత్రమూలము త్రికటుకములు సైంధవలవణము పెద్దఏలకులు చవ్యము దాడింబ ఓమము మోడి జీలకఱ్ఱ బోడతరము ధనియాలు వీటిని సమభాగములు కషాయముకాచి అందు నెయ్యి పెరుగు కాంజికము రేగువేళ్లరసము వీటిని నేకమ చేర్చి ఘృతముమిగులువరకుకాచి పుచ్చుకొనిన వాతగుల్మము దుర్బలమగు గుడశబ్దముతోయుక్తమగుశూల ఇవి నివర్తించు.

## ఆమలక్యాదిఘృతము.

శ్లో॥ రసేనామలకేక్షూణాంఘృతపాదంవిపాచయేత్ ।
పథ్యాయాశ్చపిబేత్సర్పి స్తత్సిద్ధంపిత్తగుల్మనుత్ ॥

తా॥ ఉశిరికెపండ్ల రసము చెరుకు రసము కరకపిందెలరసము వీటిరసములకు నాలవపాలు నెయ్యిచేర్చి ఘృతము మిగులువరకు కాచి సేవించిన పిత్తగుల్మము నివర్తించు.

## ధాత్రీఘృతము.

శ్లో॥ ధాత్రీఫలానాంస్వరసై ర్విడంగంపచేద్ఘృతం ।
శర్కరాసైంధవోపేతంతత్సిద్ధంసర్వగుల్మనుత్ ॥

తా॥ ఉశిరికెపండ్లస్వరసమునందు వాయువిళంగములకల్కము నెయ్యిచేర్చి సిద్ధపరచినఘృతమునందు చక్కెర సైంధవలవణచూర్ణము వీటినిగలిపి పుచ్చుకొనిన సర్వగుల్మములు నివర్తించు.

## బిందుఘృతము.

శ్లో॥ కంపిల్లత్రివృతోస్సమంస్నుహీపయ స్సైవస్సమానోరసోధాత్ర్యా
స్సర్పి సమానకంఘృతమదస్తుల్యంపయస్సైంధవమ్ । స్వల్పాశం
విపచేదిదంవిజయతే కర్షప్రమాణంఘృతంగుల్మాక్షశూలగ్రహాద
నష్ఠీలాప్లీహోదరంకచ్ఛపం ॥

తా॥ కంపిల్లము 1 తులము తెగడ 1 తులము జముడుపాలు 2 తులములు ఉసిరికాయలరసము 4 తులములు ఆవునెయ్యి 8 తులములు తేనె 8 తులములు ఆవుపాలు 8 తులములు సైంధవలవణము 4 తులము వీటిని నీరుయిగురువరకు వండి ప్రతిదినము ఒకతులమువంతున సేవించిన గుల్మములు శూలలు ప్లీహోదరము కచ్ఛపోదరము ఇవి మానును.

## శంఖద్రావకము.

శ్లో॥ అర్కస్నుక్స్నాశలాచించాపలాశకదళీతిలాః ।
అపామార్గోముష్కకశ్చవర్గశ్శంఖపవనచ ॥

ఏతేషాంభూతిజఃక్షారోపారదఃపటుపంచకం ।
పంచక్షారాస్సమంసర్వంత్రిభాగోగంధకస్మృతః ॥
భూరసాచైవసోరాచకాశీసన్నచసాగరః ।
ఏతైశ్చతుష్టయంసర్వైర్వోషధైస్తుల్యభాగికం ॥
సర్వేషాంకజ్జలింకృత్వానింబునీరేణమర్దయేత్ ।
ప్రదద్యాన్నలికాయంత్రేవహ్నింయామచతుష్టయం ॥
దద్యాద్ద్రవంతుగృహ్ణీయాత్కూపికాద్రవకారకం ।
ఏకవల్లందివల్లంవాదద్యాన్నలికయారసం ॥
గుల్మార్శఃప్లీహాముఖ్యానాంరోగాణామంతకఃపరం ।
శంఖద్రావరసోహ్యేషకృతకర్మానసంశయః ॥

తా॥ జిల్లేడుపట్ట జెముడుపట్ట ఆకుజెముడుపట్ట చింతచక్క మోదుగచక్క అరటిపట నువ్వుకట్టె వుత్తరేణి గవ్వలు శంఖము తెగడ వీటిని వేర్వేరుగభస్మము చేసి ప్రత్యేకప్రత్యేకముగ క్షారముతీసి పాదరసము పంచలవణములు పంచక్షారములు (అనగా సద క్షారము యవక్షారము గాజుప్పు అప్పళాఖారము సోంబ్రాణి) ఈ 22 వస్తువులు ఒక్కొక్కతులము గంధకము 3 తులములు కురవిరాళ్లు ఖడ్డిపుప్పు అన్నభేది నవాసాగరము ఈ 4 వస్తువులు వేరువేరుగా 6 తులములువంతునచేర్చి వీటినన్నియును చూర్ణముచేసి నిమ్మపండ్లరసముచేత మర్దించి ఊర్ధ్వనలికాయంత్రంబున 4 ఝాములువండి ద్రావకముదించుకొని సీసాలోవుంచి తులములో పదహారవ భాగమునుగాని యిరువదవభాగమునుగాని నీళ్ళతోగాని శొంఠిచూర్ణముతోగాని సేవించిన గుల్మములు మూలవ్యాధులు ప్లీహరోగములు ఇవి మానును.

శ్లో॥ పిప్పలీసహితబీజపూరకంద్రాక్షీహంతినవనీతసంయుతం ।
శూలహృత్క్షతయుతంహృదామయంపిఘ్నసంఘమివసాధుమండలం॥

తా॥ పిప్పలిచూర్ణము మాదీఫలము వీటిని వెన్నతోకూడాసేవించిన శూలలు హృద్రోగములు క్షయములు ఇవిమానును.

ఇతి శ్రీమదహమ్మదనగరస్థితమాణికభట్టనైదాత్మజమోరేశ్వర
విరచిత వైద్యామృతము ద్వితీయాలంకారము
సమాప్తము.

శ్రీరస్తు.

# వైద్యామృతము.

## తృతీయాలంకారప్రారంభము

### మూత్రకృఛ్రచికిత్సా.

శ్లో॥ పాషాణభేదకృతమాలకధన్వయాస పథ్యాత్రికంటకకషాయనిషే
వణేన। మధ్వన్వితేనసహసావిదహంప్రయాతిరుగ్దాహబంధసహితం
కిలమూత్రకృఛ్రం ॥

తా॥ పాషాణభేది రేలపండుగిజరు దురదగొండివేరు కరకపిందెలు సన్నపల్లేరు సమూలము వీటిని కషాయముపెట్టి తేనెతోకూడా పుచ్చుకొని నమూత్రకృచ్ఛ్రము మూత్రతాపము ఇవిమానును.

శ్లో॥ దుగ్ధమాక్షికయుతాసఖేయదాసే సితాతుతిలకోలభూతికా।
మూత్రఘాతజనివ్యథాతదాహవత్యతినృణాంనతిష్ఠతి ॥

తా॥ నువ్వుకట్టెబూడిదెను ఆవుపాలలోకలిపి కొంచెము తేనెవేసి పుచ్చుకొనిన మూత్రాఘాతముయొక్క బాధనిలచిపోవును.

### మూత్రకృఛ్రకషాయము.

శ్లో॥ క్వాథోగోక్షురబీజానాంయవక్షారయుతస్సదా।
పీతఃప్రశమయత్యేవమూత్రకృఛ్రంచిరోత్థితం ॥

తా॥ పల్లేరువిత్తులకషాయములో యవక్షారమునుచేర్చి పుచ్చుకొనుచుండిన చిరకాలమునుండియుండు మూత్రకృఛ్రము నివర్తించును.

## ఆమలక్యాదికషాయము.

శ్లో॥ గుడేనామలకీక్వాథంశ్రమఘ్నంతర్పణంపరం ।
పిత్తాసృగ్దాహశూలఘ్నంమూత్రకృఛ్రనివారణం ॥

తా॥ ఉశిరికెకషాయమునందు బెల్లముగలిపిపుచ్చుకొనిన పిత్తరక్తము దాహము శూల వీటితోగూడియుండు మూత్రకృఛ్రము నివర్తించు.

## గోక్షురాదికషాయము.

శ్లో॥ సమూలగోక్షురక్వాథస్సితామాక్షికసంయుతః ।
నాశయేన్మూత్రకృఛ్రాణితథాచోష్ణసమీరణం ॥

తా॥ పల్లేరుసమూలము కషాయముపెట్టి అందుచక్కెర తేనెచేర్చి పుచ్చుకొనిన మూత్రకృఛ్రము ఉష్ణవాయువు ఇవి నివర్తించు.

## కంటకాద్యఘృతము.

శ్లో॥ త్రికంటకైరండకుశాద్యభీరుకైః ర్వారుకేక్షుస్వరసేనసిద్ధం ।
సర్పిర్గుడార్థాంశయుతంప్రపేయం కృఛ్రాశ్మరీమూత్రవిఘాతహారి ॥

తా॥ పల్లేరు ఆముదపువేరు కుశ కాశ దర్భ శర మహాశతావరి దోసచెరుకు వీటిరసములలో అర్థాంశము నెయ్యి బెల్లముచేర్చి ఘృతపక్వముగకాచి సేవించిన మూత్రకృఛ్రము అశ్మరి మూత్రాఘాతము ఇవి నివర్తించు.

## అశ్మరీచికిత్సా.

శ్లో॥ ఆతల్లగోక్షురజటాతులసీశిలాభిరేరండమూలమగధామధుకైః ప్రయుక్తైః । తక్రాహ్వమూలసురసాసురపుష్పశుంఠీక్వాథో నిహంతిబహులాప్రతివాపితోఽయం ॥ సప్తాహమేవపిబతాం నియమేనపుంసాంఘోరాశ్మరీమతిరుజంసహశర్కరాంచ । అపి పయోమధుకమిశ్రితమాశుతద్వచ్చూర్ణం త్రివృత్కుటబీజభవంవదంతి ॥

తా॥ ఆక్కులకజ్జ పల్లేరువేరు తులశిఆకు పాషాణభేది ఆముదపువేరు పిప్పళ్ళు అతిమధురము చల్లగడ్డ వావిలాకు లవంగాలు శొంఠి ఈవస్తువులు కషాయముపెట్టి ఏలకులచూర్ణముపేసి 7 దినములు పుచ్చుకొనినను లేక మేకపాలలో తేనెవేసి పుచ్చుకొనినను లేక సన్నపల్లేరుకాయలచూర్ణమును ఆవుపాలతో పుచ్చుకొనినను అశ్మరి అనునట్టి గ్రంధి (అనగా మూత్రద్వారమున రాయి అడ్డపడి మూత్రబంధమగు నట్టి వ్యాధి) మానును.

### అశ్మరికి శిగ్రుమూలాది కషాయము.

శ్లో॥ క్వాథశ్చశిగ్రుమూలోత్థఃకటూష్ణోశ్మరిపాతనః ।
క్షీరాన్నభుగ్బర్హిశిఖామూలంవాతండులాంబునా ॥

తా॥ మునగవేరు కషాయమును కొంచము ఉష్ణముగనుండునపుడు పుచ్చుకొనిన అశ్మరిపతనంబగు. బర్హిశిఖామూలమును తండులోదకముతో పుచ్చుకొని పాలు అన్నము భుజించవలయు.

### వరుణాదిఘృతము.

శ్లో॥ వరుణస్యతులాంక్షుణ్ణాంజలద్రోణేవిపాచయేత్ ।
పాదశేషంపరిశ్రావ్యఘృతప్రస్థంవిపాచయేత్ ।
వారుణీకదళీబిల్వంతృణజంపంచమూలకం ।
అమృతాత్వశ్మజందేయంబీజంచత్రపునస్యచ ।
శతపర్వాతిరక్షారఃపలాశక్షారఏవచ ।
యూథికాయాశ్చమూలానికల్కీకానిసమర్పయేత్ ।
అస్యమాత్రాంపిబేజ్జంతుర్దేశకాలాద్యపేక్షయా ।
జీర్ణేచానుపిబేత్సర్వమజీర్ణేమస్తుమేవచ ।
అశ్మరీంశర్కరాంచైవమూత్రకృచ్ఛ్రంచనాశయేత్ ॥

తా॥ వులిమిడివేరు 100 పలములుగ్రహించి నలియగొట్టి ద్రోణప్రమాణోదకమునందువైచి నాలవపాలు మిగులునటుల కషాయముకాచి వడియగట్టి అందు వక ప్రస్థము ఆవునెయ్యిచేర్చి నెయ్యిమిగులునటులకాచి అందు వారుణి కదళి బిల్వము తృణపంచమూలములు తిప్పతీగె శిలాజితు త్రపుసబీజములు గరికె నువ్వుకాడలు వీటి

క్షారము పొడుగక్షారము ఏరుపల్లెవేళ్లు వీటిని ప్రత్యేకము కర్షప్రమాణముచూర్ణించి పైచి ఘృతమువండి దేశకాలానుసారముగ సేవించినను జీర్ణముగనుండి సర్వమును అజీర్ణముగనుండిన మజ్జిగనీరుదితేటను పుచ్చుకొనినను అశ్మరి శర్కర మూత్రకృఛ్రము ఇవి నివర్తించు.

## ప్రమేహ చికిత్సా.

శ్లో॥ ధాత్ర్యాఃకషాయంమధురాత్రియుక్తం వటాంకురాణాంసమధుం కషాయం । పాషాణభేదంమధుమిశ్రమేతత్త్రియంప్రమేహాపహామామనంతి ॥

తా॥ ఉసిరికాయలవొలుపుయొక్క కషాయములో తేనె పసుపువేసి పుచ్చుకొనినను లేక మర్రిచిగుళ్ళ కషాయములో తేనెవేసి పుచ్చుకొనినను లేక పాషాణభేది చూర్ణములో తేనెవేసి పుచ్చుకొనినను ప్రమేహములు మానునని చెప్పెదరు.

శ్లో॥ త్రికంటకానాంక్వథితేఽష్టనిఘ్నే పురంపచేత్పాకవిధానయుక్త్యా ।
ఫలత్రికవ్యోషపయోధరాణాంచూర్ణంపురేణప్రమితంప్రదద్యాత్ ॥
వటీప్రమేహప్రదరంచమూత్రఘాతంచకృఛ్రంచతథాశ్మరీంచ ।
శుక్రస్యదోషంసకలాంశ్చవాతా నిహంతిమేఘానివవాయువేగః ॥

తా॥ సన్నపల్లేరుయొక్క కషాయమును అష్టభాగముగాకాచి దించుకొని శుద్ధిచేసిన గుగ్గిలపు చూర్ణమువేసి పక్వముగా ఘట్టిపడునట్లు వండి కరక తాండ్రపుసిరికవలుపు శొంఠి పిప్పళ్లు మిరియాలు తుంగగడ్డలు వీటిని చూర్ణముచేసి శుద్ధిచేసిన గుగ్గిలపుచూర్ణమును సమముగాదీనిలోవేసి వుంటలుచేసి అనుపానయుక్తముగ పుచ్చుకొనిన ప్రమేహములు స్త్రీలకుగలిగెడు ప్రదరరోగములు మూత్రాఘాతము మూత్రకృచ్ఛ్రము అశ్మరి రేతస్సు నీరుఅగునట్టి శుక్రదోషములు ఇవి మానును.

## ప్రమేహములకువంగేశ్వరభస్మము.

శ్లో॥ సమానభాగేనుచితామ్రవంగేతయోస్సమానంలవణంప్రసిద్ధంశరా
వయోస్థాప్యవిధాయముద్రాందదేత్పుటం తస్యగజాభిధేయం ।
తతోభవేద్భస్మవిశేషసౌమ్యంయథానుపానం సనుసేవనీయం ।

సమస్తమేహాంతికమగ్నిదాయికాసాపహారి శ్వాసనాపహారి ॥
శుక్రస్యదార్ఢ్యప్రవిధానదక్షంప్రమత్తనారీసుఖదానబీజం ।
ఇదంహితత్వంజటిలస్యసేవాంవిధాయవైద్యేనమయాప్రలబ్ధం ॥

తా॥ శుద్ధిచేసినతామ్రము 1 తులము శుద్ధిచేసిన తెల్లసీసము 1 తులము ఉప్పు 2 తులములు వీటిని మూకటిలోవుంచి పైన వకమూకుడుబోర్లించి చీలమన్నుకట్టి గజపుటముబెట్టిన సౌఖ్యమైన భస్మమగును. దానిని అనుపానయుక్తముగ సేవించిన సమస్తమేహములు అగ్నిమాంద్యము కాసశ్వాసలు వీటినిబోగొట్టి రేతస్సుకు బలమును కలుగంజేయు. దీనిని నేనొక బయిరాగివలన పొందితిని.

## మేహములకుఅభ్రికయోగము.

శ్లో॥ నిశ్చంద్రమభ్రికంభస్మనవరారజనీరజః ।
మధునాలీఢమచిరాత్ప్రమేహాన్వినివర్తయేత్ ॥

తా॥ నిశ్చంద్రముగ శుద్ధమగు అభ్రికభస్మమును త్రిఫలములు పసపు వీటి చూర్ణముతో చేర్చి తేనెతో పుచ్చుకొనిన ప్రమేహములు నివర్తించు.

## నాగభస్మయోగము.

శ్లో॥ శుద్ధస్యచమృతస్యాహిరజోవల్లమితంలిహేత్ ।
సనిశామలకాక్షౌద్రంసర్వమేహప్రశాంతయే ॥

తా॥ శుద్ధమైనమృతమగు నాగభస్మము రెండుగురిగింజముల యెత్తును పసపు వుశిరికెవలుపు చూర్ణము వీటితోచేర్చి తేనెతో పుచ్చుకొనిన సర్వమేహములు నివర్తించు.

## గుడూచీ ధాత్రీరసయోగము.

శ్లో॥ యథామృతారసఃక్షౌద్రయుక్తస్సర్వప్రమేహజిత్ ।
హారిద్రాచూర్ణయుక్తోవారసోధాత్ర్యాస్సమాక్షికః ॥

తా॥ తిప్పతీగె రసములో తేనెచేర్చి పుచ్చుకొనినను లేక వుశిరికెరసములో పసపుచూర్ణము తేనె చేర్చి పుచ్చుకొనినను సర్వప్రమేహములు నివర్తించు.

## భూధాత్రియోగము.

శ్లో॥ భూధాత్రిపత్రిగంధానాంమరీచానాంచవింశతిః ।
అసాధ్యాస్సాధయేన్మేహాన్సప్తరాత్రాన్నసంశయః ॥

తా॥ నేలవుశిరికె లవంగపట్ట యాలకులు లవంగపత్రి 20 మిరియాలు వీటిని నేకముగనూరి సేవించిన అసాధ్యములగు మేహములు 7 రాత్రులలో నివర్తించు.

## కతకబీజయోగము.

శ్లో॥ కర్షప్రమాణంకతకస్యబీజంతక్రేణపిష్ట్వాసహమాక్షికేన ।
ప్రమేహజాలంవినిహన్తిసద్యోరామోయథారావణమాజఘాన ॥

తా॥ కర్షప్రమాణము చిల్లగింజను మజ్జిగతోనూరి తేనెచేర్చి పుచ్చుకొనిన శ్రీరాములు రావణునిజయించుతెరంగున మేహముల నశింపంజేయు.

## శాల్మలీ స్వరసము.

శ్లో॥ శాల్మలీత్వగ్రసోపేతంసక్షౌద్రంరజనీరజః ।
వంగభస్మహరేన్మేహాన్పంచాననఇవద్విపాన్ ॥

తా॥ బూరగపట్టరసము తేనె పసపుచూర్ణము వంగభస్మము వీటిని నేకముగ చేర్చి పుచ్చుకొనిన సింహము ఏనుగులజంపునటుల మేహముల నశింపంజేయు.

## ద్వినిశాదిహిమము.

శ్లో॥ ద్వినిశాత్రిఫలాయుక్తంరాత్రౌపర్యుషితంజలం ।
ప్రభాతేమధునాపీతంమేహశూలంనికృంతతి ॥

తా॥ పసపు మానిపసపు త్రిఫలములు వీటినినలియగొట్టి రాత్రియందుదకమునందువైచియునిచి ప్రాతఃకాలమునందు చక్కగకలిపి వడియగట్టి అందు తేనెచేర్చి పుచ్చుకొనిన మేహశూల నివర్తించు.

## పౌష్టికప్రయోగము.

శ్లో॥ శతావరీనాగబలాత్మగుప్తేక్షు రశ్వదంష్ట్రాతిలమాషచూర్ణం ।
పయస్యతాక్ష్యంనిశితేతపేయంకాంతాశరతంయస్యగృహేవిభాతి॥

ద్రాక్షాచందనకుష్ఠకేసరతుగాక్షీరంచ జాతీఫలంతక్కోలంచపున
ర్నవాముసలయా ధాత్ర్యాశ్వగంధాన్వితం । ఏతేషాంసమభాగికం
సమసితంసర్పిర్యుతంఖాదయేద్ధాతుక్షైణ్యబలక్షయాశ్మరిరుజోపిత్తా
స్రజంభ్రామకం ॥

తా॥ చల్లగడ్డ తుత్తిరివిత్తులు దురదగొండివిత్తులు నీరుగొబ్బివిత్తులు సన్నపల్లేరు కాయలు నువ్వులు మినుములు వీటిని చూర్ణము చేసి ఖండశర్కరపాలలోవేసి పుచ్చుకొనిన వీర్యవృద్ధిఅగును. మఱియు ద్రాక్షపండు శ్రీగంధము చంగల్వకోష్టు నాగకేసరాలు వెదురుప్పు జాజికాయ తక్కోలము తెల్లగలిజేరు చల్లగడ్డ ఉసిరికవరుగు పెన్నేరుగడ్డ వీటిని సమభాగములుగ చూర్ణముచేసి ఈచూర్ణమునకు సమముగ ఖండశర్కర కలిపి నేతితోకూడా పుచ్చుకొనిన ధాతుక్షయము బలక్షయము అశ్మరి రక్తపిత్తము వలనపుట్టిన తిప్పుడు యివి మానును.

## ధాతుక్షయమునకు ఏలాదిచూర్ణము.

శ్లో॥ ఏలామాంసిలవంగనాగరకణా ముస్తాహిమంధాన్యకంఖర్జూరంచత
మాలపత్రమధుకోశీరద్వయందాడిమం । హిక్కాకామిలపాండు
రోగనిచయం మూత్రేచదాహోహ్యష్మతాం । మేహాన్వింశతినాశ
యేచ్చసతతంప్రీతిప్రదంబృహ్మణం ॥

తా॥ ఏలకులు జటామాంసి లవంగములు శొంఠి పిప్పళ్లు తుంగగడ్డలు రక్తచందనము ధనియాలు ఖర్జూరపండు లవంగపత్రి అతిమధురము వట్టివేరు కురువేరు దానిమ్మపండుయొక్కతోలు వీటిని చూర్ణముచేసి అనుపానయుక్తముగ సేవించిన ఎక్కిళ్లు కామిల పాండురోగము మూత్రరోగములు 20 మేహములు ఇవి మానును, దేహపటుత్వమున్ను కలుగును.

## రతివర్ధకదీపము.

శ్లో॥ మందామంత్రితభాస్కరాహ్వతరవేఃకార్పాసవర్త్యాకృతస్త్వైరండో
ద్భవతైలదీపితరుచేర్ది పస్యయావత్స్థితిః । తావత్తేమనుజాస్సు
ఖేనసురతంకుర్వంతువృష్యైర్భృతాః కాంతాభిర్మదమత్తదంతిజతి
భిఃకామాధికఃప్రౌఢిభిః ॥

తా॥ శనివారమున తెల్లజిల్లేడు చెట్టునుపూజచేసి ఆదివారమున మరల పూజ చేసి ఆచెట్టునుంచి దూదినితెచ్చి వత్తిచేసి ఆముదములో దీపముపెట్టి ఆదీపమువుండే పర్యంతము ఉత్తమస్త్రీలసంభోగించిన వీర్యస్తంభమగును. ఆవుపాలును వీర్యవృద్ధి అగునట్టి ఔషధములను బుద్ధిశాలులు పుచ్చుకొని ఈక్రియను చేయవలయు.

ద్రావణయోగము.

శ్లో॥ రసేనసమ్యఙ్మరహట్టికాయాః ప్రపేషనసూతేనసమాక్షికేణ।
విలిప్తంలింగోరమతేయయాసామదోద్ధతాపిద్రవతాముపైతి॥

తా॥ జన్నిచెట్టుయొక్క రసముచేత శుద్ధిచేసిన పాదరసము తేనెచేర్చి మర్దించి లింగమునకు పూసికొని రమించినయెడల క్రొవ్విన స్త్రీకి అయినను ద్రవించును.

మేదోరోగచికిత్సా.

శ్లో॥ వ్యోషాగ్నిమంథత్రిఫలావిడంగైః స్సమంపురంయోభజతేమనుష్యః।
మేదోమరుచ్ఛ్లేష్మజఘోరరోగాస్తస్యాశుసర్వేవిలయంప్రయాంతి॥

తా॥ శొంఠి పిప్పళ్లు మిరియాలు కూరచెల్లి కరక తాండ్ర ఉసిరికలు వాయు విడంగాలు వీటిని సమభాగములుగ చూర్ణముచేసి దీనికిసమముగా శుద్ధిచేసిన గుగ్గిలపు చూర్ణమునుకలిపి కాలుతులమువంతున వుంటలుచేసి సేవించిన మేదస్సువృద్ధి అగు నట్టి వాయువులు శ్లేష్మము ఇవినశించును.

మేదోరోగమునకు నవకగుగ్గులు.

శ్లో॥ వ్యోషాగ్నిముస్తత్రిఫలావిడంగంగుగ్గులుస్సమం।
ఖాదన్సర్వాన్జయేద్వ్యాధీనామవాతభవాన్సదా॥

తా॥ త్రికటుకములు చిత్రమూలము తుంగముస్తలు త్రిఫలములు వాయువిడంగములు గుగ్గిలము వీటినిసమముగచేర్చి చూర్ణించి సేవించిన సర్వరోగములు ఆమ వాతమువలన జనించురోగములు ఇవి నివర్తించును.

మేదోరోగచికిత్స.

శ్లో॥ మదనసజ్వరకారినామదేయేరసికేరళ్ళకల్కేభల్లాతకతే।
శిశిరాంమ్బుపిబన్మధూపయుక్తంగణవాన్ధోపిభవేత్కృశాంగః॥

తా॥ నామధేయ శ్రవణమాత్రముచే మదనజ్వరమును గలుగఁజేయఁదగినట్టి రసికు రాలగు ఓరత్నకలా! ఉదయమున వడగండ్లనీరులోగాని ప్రాచీనీరులోగాని సమముగ తేనెకలిపి పుచ్చుకొనిన స్థూలశరీరముగల వినాయకుడు సగా కృశించును.

ఉదరచికిత్సా.

శ్లో॥ చూర్ణంసఖేలవణరామఠయోస్సమానంగోమూత్రమిశ్రితమిదం
పిబతాంనరాణాం। నానావిధానిజఠరాణిలయంప్రయాంతి
గంగోదకంప్రపిబతామివపాతకాని॥

తా॥ ఉప్పు వేయించినయింగువ వీటిని సమభాగములుగ చూర్ణముచేసి గోమూత్రముతో సేవించిన ఉదరరోగములు మానును.

శోఫోదర చికిత్సా.

శ్లో॥ పునర్నవాదారుమహౌషధాంబుగోమూత్రసిద్ధంశ్వయథుంనిహంతి।
తథాకణాశుంఠిగుడోత్థచూర్ణంశోఫామశూలఘ్నమజీర్ణహారి॥
గవాంక్షీరంవరామిశ్రంశోఫోదరవినాశనం।
గోమూత్రేణసమాయుక్తంమహిషీణాంపయోఽథవా॥

తా॥ తెల్లగలిజేరువేరు దేవదారుచెక్క శొంఠి వట్టివేళ్లు వీటినిగోమూత్రముతో కషాయముపెట్టి పుచ్చుకొనిన వాపులుమానును. మఱియు పిప్పళ్లు శొంఠి వీటిని చూర్ణముచేసి బెల్లముతో పుచ్చుకొనిన వాపులు ఆమశూలలు అజీర్ణము ఇవి మానును. మఱియు కరకతాండ్రవుసిరికలు చూర్ణముచేసి ఆవుపాలలోవేసి పుచ్చుకొనిన కడుపువాపులు మానును. మఱియు ఎనుపపాలలో గోమూత్రమునుకలిపి పుచ్చుకొనిన పైకనుపరచిన వాయువులు మానును.

ప్లీహోదరమునకు కుష్ఠాదిచూర్ణము.

శ్లో॥ కుష్ఠంవచాశృంగబేరంచిత్రకంచయవానికం।
పాఠాచైవాజమోదాచపిప్పల్యస్సమచూర్ణితాః।
తతోబిడాలపలకంపిబేదుష్ణేనవారిణా।
ప్లీహోదరముదావర్తంసర్వమేతేనశామ్యతి॥

తా॥ చంగల్వకోష్ఠు వస శొంఠి చిత్రమూలము ఓమము విషబొద్దివేరు అజా మోదము పిప్పలి వీటిని సమముగచూర్ణించి బిడాలపదపత్రము వుష్ణోదకముతో సేవించిన ప్లీహోదరము ఉదావర్తము ఇవి నివర్తించు.

వాతోదరమునకు శిలాజతుచూర్ణము.

శ్లో॥ దశమూలకషాయేణక్షీరయుక్తంశిలాజతు।
సద్యోవాతోదరీశూలంజేష్ట్రిమాజంచకేవలం॥

తా॥ దశమూలకషాయమునందు పాలు శిలాజతుచూర్ణమును గలిపిపుచ్చుకొనినను లేక ఒంటెపాలుగాని లేక మేకపాలుగాని పుచ్చుకొనినను వాతోదరశూల నివర్తించు.

పిత్తోదరమునకు త్రివృతాదిఘృతము.

శ్లో॥ స్యాత్త్రివృత్త్రిఫలాసిద్ధంసర్పిఃపానంవిశుద్ధయే।
పృశ్నిపర్ణీచచాన్యాక్షీరలాక్షానాగరసాధితం।
క్షీరంపిత్తోదరంహన్తిజఠరంకతిభిర్దినైః॥

తా॥ తెల్లతెగడ త్రిఫలములు వీటిచే సిద్ధముజేయబడిన ఘృతమునుగాని లేక కోలపొన్న చిట్టాముట్టివేరు వాకుడు లక్కరసము శొంఠి వీటిచే సిద్ధముజేయబడిన పాలనుగానిసేవించిన పిత్తోదరము నివర్తించు.

క్షారభావనపిప్పలీ.

శ్లో॥ పలాశక్షారతోయేనపిప్పలీపరిభావితా।
గుల్మప్లీహార్తిశమనీవహ్నిదీప్తికరీమతా॥

తా॥ మోదుగక్షారోదకముతో పిప్పళ్లనుభావనజేసి పుచ్చుకొనిన గుల్మము ప్లీహము వీటిని నివర్తింపజేయుటయేగాక అగ్నిదీప్తినిసగా గలుగంజేయు.

అర్కపత్రక్షారము.

శ్లో॥ అర్కపత్రంసలవణమంతర్ధూమంవిపాచయేత్।
మస్తునాతంపిబేత్క్షారంప్లీహోదరహరంపరం॥

తా॥ జిల్లేడుఆకులు సైంధవలవణము వీటిని వకభాండమునందువైచి నిప్పు పొగ రాకుండునటులకాల్చి క్షారమునుజేసి దానిని మజ్జిగ తేటతోపుచ్చుకొనిన ప్లీహోదరము నివర్తించు.

## అండవృద్ధిచికిత్సా.

శ్లో॥ హారతిరుబుకతైలందుగ్ధయుక్తంనిపీతంవృషణజనితపీడాంనాత్ర
శంకావిధేయా। యవతిలబుతుజన్మైరండబీజైస్సుఖోష్ణైర్
రతికృతపిలేపఃకాంజికేనప్రపిష్టైః॥

తా॥ ఆముదములో ఆవుపాలువేసి సేవించిన వృషణవృద్ధి వాయువులు మానును. (ఇదినిశ్చయము) మఱియు యవలు తిలలు తెల్లగలిజేరువేరు ఆముదపు విత్తులు ఇవి సుమారుగావేయించి పుల్లనీళ్ళతోనూరి కొంచము వెచ్చచేసి వృషణములకు లేపనముచేసిన అండవృద్ధివాతములు మానును.

## షడూషణాదిచూర్ణము.

శ్లో॥ షడూషణంక్షౌద్రసమంగుగ్గులుంగవ్యసర్పిషా।
ప్రయుక్తంకుట్యభుంజీతయథాగ్నిదివసానసే।
కటుతిక్తకషాయాశీమేదోవృద్ధిప్రణాశనం॥

తా॥ శొంఠి పిప్పలి మిరియాలు చవ్యము చిత్రమూలము పిప్పలిమూలము యవలు గుగ్గులము వీటిని సమములుగనలియగొట్టి ఆవునేతితోనూరి అగ్నిబలానుసారముగ ప్రాతఃకాలమునందు భక్షించి కటుకతిక్తకషాయాదిపదార్థముల సేవించుచుండిన మేదోవృద్ధి నివర్తించు.

## దార్వీచూర్ణము.

శ్లో॥ దార్వీచూర్ణంగవాంమూత్రైర్నిపీతంముష్కవృద్ధిజిత్॥

తా॥ పసపుచూర్ణమును గోమూత్రములో కలిపి పుచ్చుకొనిన అండవృద్ధి నివర్తించు.

## గండమాలచికిత్సా.

శ్లో॥ సవిశ్వచూర్ణస్య తుకాంచనారత్వచఃకషాయస్యనిషేవణేన ।
పలాయతేసాకిలగండమాలయథామృగీవ్యాధవిలోకనేన ॥

తా॥ దేవకాంచనపుచెట్టుయొక్క పట్టను కషాయముపెట్టి అందులో శొంఠి చూర్ణము వేసి పుచ్చుకొనిన గండమాలలు మానును.

శ్లో॥ మూలంసితాయాగిరికర్ణికాయామూలంవిశాలాభవముగ్రగంధా।
గోమూత్రపిష్టత్రితయస్యలేపాత్సోపద్రవాగచ్ఛతిగండమాలా ॥

తా॥ తెల్లగంటెనవేరు వెర్రిపుచ్చవేరు వస వీటినిగోమూత్రముతోనూరి లేపనము చేసిన ఉపద్రవయుక్తములగు గండమాలలు మానును.

## గండమాలకుచికిత్స.

శ్లో॥ భల్లాతకాశీసహుతాశదన్తిమూలైర్గుడస్నుగ్రవిదుగ్ధదిగ్ధైః ।
లేపోచితైర్గచ్ఛతిగణ్డమాలాసమీరవేగాదివమేఘమాలా ॥

తా॥ జీడిగింజలు అన్నభేది చిత్రమూలము దంతివేళ్ళు బెల్లము వాయువిళంగములు వీనిని సమభాగములుగ జెముడు జిల్లేడుపాలతో నూరి గండమాలకు పూయుచూ వచ్చిన వాయువుచే మేఘపంక్తితొలగుచందంబున గండమాల తొలంగు.

## కంఠరోగచికిత్స.

శ్లో॥ గోమూత్రేణకృతః కళిఙ్గకటుకాపాఠా విషాబ్దామరకాథఃక్షౌద్రయుతోనిహన్తిసకలాన్కణ్ఠామయానుత్కటాన్ । పాఠాతేజవతీరసాఞ్జనరసాన యవక్షారోపకుల్యానిశాదేవద్రుమఘనాకృతాముఖధృతాతద్వద్ఘటీపద్యతే॥

తా॥ కొడిసెవిత్తులు కటుకరోహిణి విషబొద్ది అతివస తుంగముస్తెలు తిప్పతీగె వీనిని సమభాగములుగ కషాయముకాచి అందు గోమూత్రముకలిపి తేనెవేసి పుచ్చుకొనిన కంఠరోగముహరించు. మఱియు విషబొద్ది తేజోవతి రసాంజనము యవక్షారము పిప్పళ్లు పసపు దేవదారుచెక్క వీనిని సమభాగములుగ చూర్ణముజేసి

తేనెతో మాత్రలుజేసి నీడనెండించి ఒకమాత్రను బుగ్గయందునిచికొని రసముమ్రింగు చుండిన కంఠరోగము హరించు.

## శ్లీపదచికిత్సా.

శ్లో॥ గోమూత్రేణనిశాచూర్ణంసగుడయఃపిబేత్సఖే ॥
వత్సరోత్థంశ్లీపదంతస్యదద్రుకుష్ఠంచనశ్యతి ॥

తా॥ పసపుచూర్ణమును బెల్లముతోజేర్చి గోమూత్రముతోకలిపి సేవించిన సంవత్సరమునుంచి ఉన్న శ్లీపదములు (అనగా కాళ్ళు చెదలుతినునట్టు తినేరోగములు) గజ్జి కుష్ఠురోగములు ఇవి మానును.

## విద్రధిచికిత్సా.

శ్లో॥ విద్రదౌరుధిరమోక్షణంహితంపంచవల్కలఘృతేనలేపనం ।
శిగ్రుమూలజరసేనంతరుత్థితేవిద్రధౌమధుయుతంప్రశస్యతే ॥

తా॥ విద్రధివ్యాధికి రక్తమునుతీసి పంచవల్కలములు (అనగా మఱ్ఱి అత్తి రావి జువ్వి చింత వీటియొక్క పట్టలు) వీటిని కషాయముపెట్టి అందు నెయ్యివేసి కషాయము ఇగిరేవరకుకాచి ఆఘృతమును పూసినను లేక మునగవేళ్ళయొక్క రసములో తేనెవేసి పుచ్చుకొనినను విద్రధివ్యాధులు (గర్భములోపుట్టె నాభిలోనికి బయలువెడలు వ్రణవ్యాధులు) మానును.

## వ్రణచికిత్సా.

శ్లో॥ పురప్రయుక్తస్త్రిఫలాకషాయోహితోనరాణాంవ్రణపీడితానాం ।
అభాత్వచాహోస్యమసమఃపురస్తుభగ్నస్యసంధానకరఃప్రదిష్టః ॥

తా॥ కరకతాండ్రవుశిరికలు కషాయముపెట్టి ఈకషాయములో శుద్ధిజేసిన గుగ్గిలపుచూర్ణమువేసి పుచ్చుకొనిన వ్రణములు మానును. మఱియు తుమ్మచెక్క శొంఠి పిప్పళ్ళు మిరియాలు వీటినిచూర్ణముజేసి ఈచూర్ణమునకు సమముగ శుద్ధిచేసిన గుగ్గిలపు చూర్ణమునువేసి అనుపానయుక్తముగ పుచ్చుకొనిన విరిగిపోయినట్టి యెముకలు కట్టుకొనును.

### నాడీవ్రణభగందరచికిత్సా.

శ్లో॥ ఫలత్రికవ్యోషసమఃపురస్తుల్యైః కృతేసనాడీవ్రణరోపిహారి ।
భగందరేపాగ్రుధిరస్యమోక్షస్తతోవ్రణోక్తైవిధిరేషయుక్తః ॥

తా॥ కరక తాండ్ర ఉసిరికలు శొంఠి పిప్పళ్ళు మిరియాలు వీటిని చూర్ణము చేసి ఈచూర్ణమునకుసమముగ శుద్ధిచేసిన గుగ్గిలపుచూర్ణము వేసి నేతితోపుచ్చుకొనిన నాడీవ్రణములు మానును. మఱియు భగందరమునకు ముందుగ రక్తమునుతీయించి వెనుక వ్రణమునకుచేయునట్టి చికిత్స చేయవలయు.

### ఉపదంశశూకదోషచికిత్సా.

శ్లో॥ మోచారసంపూగవిభూతికాంచనోలత్వచంనిర్మలశంఖజీరం ।
పిష్ట్వోపదంశేఖమనిష్టిపతేత్ర్యహేణరోగంసకలంనిహంతి ॥

తా॥ పోకబంక వక్కలు కాలిచినబూడిద రేసుచెక్క సీమ రాతినార వీటిని చూర్ణముచేసి ఉపదంశమునకు (అనగా మేఢ్రముయొక్క చర్మమునకులోగా కలుగునట్టికురుపులు మొదలగువాటికి) మూడుదినములు పట్టించిన లింగమునందుండు కురుపులు పొక్కులు మొదలైనవి మానును.

శ్లో॥ ఆదిత్యమూలదరదాల్లికమహామహానాత్ స్థాతుంబి ఘేతిసకలాపృ్యు దంశపీడా । శ్వేతశూజనైర్ద్భవహుతరంపరిబోధితాపిలక్ష్వియథా ప్రియతమారమణొసరంతుం ॥ హారమారజటాలేపాదుపదంశో వినస్యతి । శూకదోషేష్వసృక్ మోక్షోజలౌకాభిఃప్రశస్యతే ॥

తా॥ జిల్లేడువేరు ఇంగిలీకము అక్కలకర్ర వీటినిచూర్ణముచేసి పొగతాగిన ఉపదంశబాధ మానును. మఱియు గన్నేరుచెట్టు గంధముతీసిపట్టించినను ఉపదంశము మానును. శూకదోషమందు జలగలనంటించి రక్తమును తీయవలయు.

### కుష్ఠుచికిత్స.

శ్లో॥ పీత్వాసమగ్ధం[illegible] కుష్ఠావలీచంచలతాంఘ్రిధాత్రి
చకోరనేత్రా[illegible]మవదిత్రన్యత్తిః । గంధ

శూతంశిలాలా మరిచమపినిశాయుగ్మసిందూరతుత్థాద్రుమఘ్నో
భాకుచీతజ్జరణయుగమిదంనింబుతోయాజ్యయుక్తం। లౌహేలా
హేకమర్ద్యం ప్రహరమితమథోహంతిమాహేశ్వరాఖ్యం। దద్రూం
కండూంచపామాంహరఇవపటలీంసంస్మృతాపాతకానాం॥మూలం
సితాయాగిరికర్ణికాయాజలేనపిష్ట్వాకురుతేప్రలేపం। సుశ్వేతకుష్ఠం
కిలతస్యగంతుం మాసాత్ప్రయత్నంకురుతేనితాంతం॥

తా॥ శుద్ధిచేసిన గంధకమును చూర్ణముచేసి ఆవుపాలతో పుచ్చుకొనిన కుష్ఠములు మానును. మఱిన్ని శుద్ధిచేసిన గంధకము శుద్ధిచేసిన పాదరసము శుద్ధిచేసిన మణిశిల శుద్ధిచేసిన తాళకము మిరియాలు పసుపు మానిపసుపు సిందూరము మైలతుత్థము తగిరిసెవిత్తులు భావంచివిత్తులు జీలకఱ్ఱ నల్లజీలకఱ్ఱ వీటిని చూర్ణముచేసి ఇనుపపాత్రలోవునిచి నిమ్మపండ్లరసమునుపోసి ఇనుముతో ఒక ఝాముమర్దించి నేతితో కలిపి శరీరమునకు లేపనముజేసిన చురద గజ్జి ఇవిమానును. మఱిన్ని గం.టెనవేరు నీళ్లతోనూరి లేపనముచేసిన శ్వేతకుష్ఠములు ఒక మాసములోపల మానును.

ఉదర్దకోఠ చికిత్స.

శ్లో॥ గుడేనదీప్యంభజతేసరోయఃపథ్యేనయుక్తఃకిలసప్తరాత్రమ్ ।
ఉదర్దకోఠోవిలయంప్రయాతి నరస్యతస్యాపినకాపిశంకా ॥

తా॥ ఓమము బెల్లముతోచేర్చి ఏడుదినములు పుచ్చుకొనిన ఉదర్దకోఠములు (అనగా బుడ్డపుంజులు కరచిన దద్దురులు) మానును.

సిధ్మకుష్ఠమునకు గంధకాదిలేపనము.

శ్లో॥ గంధకస్సయవక్షార సిధ్మహృత్తోయలేపతః ।
అహీంత్వక్పయసాపిష్ట్వాలేపస్త్వక్శ్వేలకాపహః ॥

తా॥ గంధకము యవక్షారము వీటిని వుదకముతోనూరి లేపనముజేసిన సిధ్మకుష్ఠము నివర్తించు. మరియు పాముకూసమును పాలతోనూరి లేపనముచేసిన త్వగ్దోషము నివర్తించును.

కాసమర్దాదిలేపము.

శ్లో॥ కాసమర్దకమూలాని సౌవీరేణతుపేషయేత్ ।
దద్రుకటిభకుష్ఠానిజయేదేతత్రలేపనాత్ ॥

తా॥ తీటకసివిందువేరును కాంజికముతోనూరి లేపనముజేసిన దద్రు కటిభ కుష్ఠములు ఇవి నివర్తించు.

శ్వేతకుష్ఠమునకు తాళకాదిలేపము.

శ్లో॥ తాళకశ్శాణమాత్రస్స్యాచ్చతుశ్శాణాచవాకుచీ ।
గోమూత్రయుక్తంతచ్చూర్ణంలేపనాచ్ఛ్విత్రనాశనం ॥

తా॥ తాళకము 1 శాణము 4 శాణములు భావంచివిత్తులు వీటిని గోమూత్ర ..తోనూరి లేపనముజేసిన శ్వేతకుష్ఠము నివర్తించు.

అమ్లపిత్తచికిత్సా.

శ్లో॥ భూనింబనింబపత్రిఫలాపటోలవాసామృతాపర్పటమార్కవాణాం।
కషాయకోమాక్షికసంప్రయుక్తోనిహంతిసోపద్రవమమ్లపిత్తం ॥

తా॥ నేలవేము వేపచక్క కరక తాండ్ర వుసిరికలు చేదుపొట్ల అడ్డసరపాకు తిప్పతీగె పర్పాటకము గుంటగలగర వీటిని కషాయముపెట్టి తేనెతోపుచ్చుకొనిన మిక్కిలి బాధచేయునట్టి ఆమ్లపిత్తములు మానును.

ఆమ్లపిత్తమునకు అభయాదిలేహ్యము.

శ్లో॥ అభయాపిప్పలీద్రాక్షాసితాధన్వయవాసకం ।
మధురంకంఠహృద్దాహమూర్ఛాశ్లేష్మామ్లపిత్తజిత్ ॥

తా॥ కరకపలుపు పిప్పలి ద్రాక్ష చూలగొండి వీటినిచూర్ణించి చక్కెర తేనె చేర్చి పుచ్చుకొనిన కంఠము హృదయము వీటియందలి మంటలతోగూడి మూర్ఛ సహిత శ్లేష్మయుక్తామ్లపిత్తము నివర్తించు.

## పిప్పలీఘృతము.

శ్లో॥ పిప్పలీక్వాథకల్కేనఘృతంసిద్ధంమధుప్లుతం ।
పిబేత్ప్రాతస్సముత్థాయఅమ్లపిత్తనివృత్తయే ॥

తా॥ పిప్పలి కషాయముచేగాని లేక కల్కముచేగాని సిద్ధముచేయబడిన ఘృతమును పుచ్చుకొనునపుడు తేనెచేర్చి పుచ్చుకొనిన ఆమ్లపిత్తము నివర్తించు.

## నారాయణఘృతము.

శ్లో॥ జలేదశగుణేక్వాథ్యపిప్పలీనాంపలాష్టకం ।
పాదశేషంహరేత్క్వాథంక్వాథతుల్యంఘృతంక్షిపేత్ ।
ఆమ్లపిత్తహరంశ్రేష్ఠంఘృతంనారాయణంమహత్ ।
గుడక్షీరకణాసిద్ధంసర్పిశ్చాత్రాపియోజయేత్ ॥

తా॥ ఎనిమిదిపలముల పిప్పళ్లను 80 పలముల నీళ్లయందువైచి నాలవపాలు మిగులునటుల కషాయముకాచి ఆకషాయమునకు సమము ఘృతముచేర్చి కాచి పుచ్చుకొనిన ఆమ్లపిత్తము నివర్తించు. మరియు బెల్లము పాలు పిప్పళ్లు వీటి కల్కముతో సిద్ధముజేయబడిన ఘృతమును పానముజేసినను ఆమ్లపిత్తము నివర్తించు.

## విసర్పిచికిత్సా.

శ్లో॥ పిచుమందపటోలతోయదానాంక్వథితంసప్తదినంసఘేపిబత్వం ।
అలసంకురుమాత్రమందబుద్ధేయదితేసర్వవిసర్పనాశనేచ్ఛా ॥
నిశాద్వయంవ్యాఘ్రిశిరీషమాంసీయష్టీచతైలాజలచందనాద్యైః।
దశాంగలేపోజ్వరశోథకుష్ఠవిసర్పశుష్కేంధనజాతవేదాః ॥

తా॥ వేపచెక్క చేదుపొట్ల తుంగగడ్డలు వీటిని కషాయముపెట్టి 7 దినములు పుచ్చుకొనిన విసర్పవ్యాధులు (అనగా కరపాణి మొదలగునవి) మానును. మఱియు పసపు మానిపసపు చిన్నములక దరిశనపువిత్తులు జటామాంసి యష్టిమధుకము గ్రంధి తగరము ఏలకులు వట్టివేళ్లు శ్రీగంధము వీటిని చూర్ణముచేసి నేతిలోకలిపి శరీరమునకు పూసికొనిన జ్వరము వాపు కుష్ఠము ఇవిగల విసర్పములు మానును.

విస్ఫోటకచికిత్సా.

శ్లో॥ కీర్తనంశీతలాదేవిస్తోత్రమంత్రస్యయత్కృతం ।
ఇదమేవౌషధంముఖ్యంవిస్ఫోటకవినాశనమ్ ॥

తా॥ శీతలాదేవియొక్క స్తోత్రమంత్రపఠనచేసిన విస్ఫోటకము (అనగా మశూచిజాడ్యము మానును.

మసూరికాచికిత్సా.

శ్లో॥ పటోలతిక్తావృషనింబముస్తాఛిన్నారజోయాసకిరాతకానామ్ ।
ఆమాంమసూరింశమయేచ్చపక్వాం విశోధయేత్సత్యమయం
కషాయః ॥

తా॥ చేదుపొట్ల కటుకరోహిణి అడ్డసరపాకు వేపచక్క తుంగగడ్డలు తిప్పతీగె పర్పాటకము దురదగొండివేళ్ళు సీమనేలవేము వీటినికషాయముపెట్టి పుచ్చుకొనిన పక్వముకాని మసూరిరోగములు (అనగా మశూచిలో భేదములు) మానును.

క్షుద్రరోగచికిత్సా.

శ్లో॥ క్షుద్రరోగేషుసర్వేషుయథాదోషంచికిత్సకృత్ ।
చికిత్సకాఃప్రకుర్వంతుసుగమత్వాదుపేక్షితమ్ ॥

తా॥ క్షుద్రదోషములకన్నిటికిన్ని వైద్యులు దోషమునుకనిపెట్టి చికిత్సను చేయవలయు.

ముఖరోగచికిత్సా.

శ్లో॥ ద్రాక్షాదార్వీయాసపథ్యాఽక్షధాత్రీఛిన్నాజాతీపల్లవానాం
కషాయః । క్షౌద్రోద్రిక్తోహంతిగండూషయుక్త్యాపాకంవక్త్రాం
భోజసంస్థంమహాంతమ్ ॥

తా॥ నల్లద్రాక్షపండు మానిపసపు దురదగొండివేళ్ళు కరకతాండ్రవుసిరికలు తిప్పతీగె జాజిపూలచెట్టుయొక్క ఆకులు వీటిని కషాయముపెట్టి తేనెకలిపి గండూషముచేసినను లేక వెనకటిద్రవ్యములనుసూరి తేనెతోవుండలుచేసి బుగ్గనువుంచుకొనినను నోటిపుండ్లు మానును.

## గళరోగ చికిత్సా.

శ్లో॥ పాఠావిషాదారుకళింగముస్తాతిక్తాకషాయంమధుసంప్రయుక్తమ్ ।
గోమూత్రసిద్ధంమనుజాఃపిబంతు గళోద్భవవ్యాధిషుసర్వజేషు ॥

తా॥ అగలుశొంఠి అతివస మానిపసపు కొడిశవిత్తులు తుంగగడ్డలు కటుక రోహిణి వీటిని గోమూత్రముతో కషాయముపెట్టి తేనెకలిపి పుచ్చుకొనిన సమస్తమయిన కంఠవ్యాధులు మానును.

## దంతరోగచికిత్సా.

శ్లో॥ ఆఢక్యాదళమధ్యగాః సమతిమాః భల్లాతకాః మృణ్మయే
పాత్రేస్థాప్యవిధాయపావకమధః ప్రజ్వాలయేద్యుక్తితః । తదుద్భూ
తాఖిలదంతఘర్షణమిదంకుర్వంతు లోకాస్సదాయోగోయంకిల
దంతరోగమదభృన్మత్తేభకంఠీరవః ॥

తా॥ కుండలో గవ్వలతునకలువేసి వాటిపైన జీడిగింజలువేసి చమురు యిగిరేట్లువేయించి వాటినినూరి ఆపొడితో దంతములు తోమినయడల సమస్తమయిన దంతరోగములు మానును.

## అన్యచ్చ.

శ్లో॥ సోయంసుగన్ధిముకుళోవకుళోవిభాతివృక్షాగ్రణీఃప్రియతమేమదనైక
బంధుః । యస్యత్వచైవచిరచర్వితయాసుగాఢందన్తాభవన్తిచపలా
అపివజ్రతుల్యాః ॥

తా॥ ఓప్రియులారా! మన్మధునికి ముఖ్యబంధువైన సువాసనగల మొగ్గలతో ప్రకాశింపుచుండు పొగడచెట్టుయొక్క పట్టనునమిలిన చలింపుచుండు దంతములుసగా వజ్రతుల్యంబులగు.

## కర్ణరోగచికిత్సా.

శ్లో॥ పక్వోయస్మిన్వృశ్చికఃప్రాణహీనః కర్ణేతైలంతత్సఖేపూరయత్వం।
ఏతత్తైలస్పర్శమాత్రేణసత్యంసద్యోనాశంకర్ణరోగాఃప్రయాంతి ॥

తా॥ చచ్చినతేలును నూనెలోవేసి కాచి ఆనూనెను చెవులలో పోసికొనిన కర్ణరోగములు మానును.

## నాసారోగచికిత్సా.

శ్లో॥ విడంగయష్టీసురదారు సింధుకటుత్రికై స్సాధితమాశుతైలమ్ ।
నాసామయఘ్నం కధితంమునీంద్రైర్నస్యతేత్వమేతత్కురుశీఘ్రమేవ॥

తా॥ వాయువిడంగము యష్టిమధుకము దేవదారుచెక్క సైంధవలవణము శొంఠి పిప్పళ్లు మిరియాలు వీటినికషాయము పెట్టి ఆకషాయములో నూనెపోసి తైల పక్వముగాకాచి వడియకట్టి ఆనూనె ముక్కులోపోసిన నాసారోగములు మానును. (మరిన్ని దానిమ్మపూలరసమును ముక్కులోపోసినను ముక్కునుండి రక్తముపడునట్టి వ్యాధి మానును. మరిన్ని మినపపిండి పట్టుగుడ్డబూడిదె వీటిని నీళ్లలోకలిపి శిరస్సున బిళ్ళచేసి వుంచుకొనిన నాసారోగములు మానును.)

## నేత్రరోగచికిత్సా.

శ్లో॥ సిగ్రుపల్లవరసస్సమాక్షికోహంతిసర్వనయనామయాంస్తథా ।
గైరికాంజనహరీతకీపటుర్దార్వికాభవవిలేపనంబహిః ॥

తా॥ మునగాకురసమును తేనెతోకూడా కన్నులకువేసిన సమస్తమైన నేత్ర వ్యాధులు మానును. కురవిరాళ్ళు సూరతుకరక్కాయలు సైంధవలవణము మానిపసుపు వీటిని మంచినీళ్ళలోచాది కంటిచుట్టూపట్టువేసిన నేత్రరోగములు మానును.

శ్లో॥ పథ్యావిభీతధాత్రీణాంబీజైస్త్రిద్వ్యేకభాగికైః ।
వర్తిర్నేత్రాంజితాహంతిప్రకోపందారుణంధృశోః ॥

తా॥ కరకపిందెలు 3 భాగములు తాండ్రకాయలు 2 భాగములు వుసిరిక వొలుపు 1 భాగము వీటినిచూర్ణముచేసి నీళ్ళతోనూరి వుంటలుచేసి నీడనుయెండించి వుంచుకొని నీళ్ళలోచాది కన్నులకువేసిన కండ్లనొప్పులు మానును.

## నేత్రవ్యాధులకు రసకేశ్వరవటుకములు.

శ్లో॥ రసకంసైంధవంతుత్థంటంకణంకటుకత్రయం ।
మర్దయేన్నింబునీరేణవటీఛాయావిశోషితా ।
అంజితామధునానేత్రేనేత్రరోగవినాశినీ ॥
కూచత్వమర్బుదంపుష్పందుశ్శాంసంతిమిరార్జునే ।

పటలంనేత్రవాతంచకాచబిందూదకానిచ ।
అన్యానపిమహారోగాన్నాశయేద్రసకేశ్వరః ॥

తా॥ కల్‌కప్పురి సైంధవలవణము వేయించిన మయిలతుత్థము పేలిచిన వెలిగారము శొంఠి పిప్పళ్ళు మిరియాలు వీటిని చూర్ణముచేసి వస్త్రఘాలితముచేసి నిమ్మపండ్లరసముతోటి మర్దించి వటుకములుచేసి నీడనుయెండించి తేనెలో అరగతీసి కన్నులకువేసిన కన్నులయందుండు పుష్పము పులుసుకట్టడము పూలుపడడము దుర్మాంసము పెరగడము రేచీకట్లు తెలుపుపొరలు నేత్రవాతము కాచబిందువులు కన్నులనుంచి నీరుకారడము ఇంకా ఇతరమయిన నేత్రరోగములు మానును.

శిరోరోగచికిత్సా.

శ్లో॥ ఛిన్నాకిరాతత్రిఫలాత్రియామాతికాకషాయో గుడసంప్రయుక్తః ।
శిరశ్శిరోర్ధశ్రవణాక్షిదంతభ్రూశంఖశూలానినిహంతిసద్యః ॥
సూర్యాదివర్తద్విజపాతశుక్రనక్తాంధ్యచక్షుఃపటలానిచైవ ॥
నస్యంతుగుంజాభవమూలకస్యశిరోర్ధశూలేకిలరామబాణః ।
ఏరండమూలౌషధశిగ్రుమూలపటోలపాఠామయదద్రుమనిఘ్నైః ।
ధాన్యామ్లపిష్టైర్విహితఃప్రలేపస్సంపూర్ణమూర్ధామయకాళరాత్రిః॥

తా॥ తిప్పతీగె సీమనేలవేము కరకతాండ్రవుశిరికలు పసపు కటుకరోహిణి వీటినికషాయము పెట్టి బెల్లముకలిపి పుచ్చుకొనిన శిరశ్శూలలు ఒంటితలనొప్పులు కర్ణశూలలు నేత్రశూలలు దంతశూలలు కనుబొమలయొక్కపోటు కణతనొప్పులు. ఇవి మానును. మరిన్ని సూర్యోదయమున తలనొప్పిప్రారంభించి మధ్యాహ్నమునకు హెచ్చుగానుండి సాయంకాలమునకు క్రమక్రమముగా తగ్గునట్టి సూర్యావర్తము ద్విజపాతము కంటిపువ్వులు రేచీకటులు కంటిలో తెల్లపొరలు ఇవి మానును. మరిన్ని గురిగింజవేరు నీటిలో అరగతీసి నస్యముచేసిన ఒంటితలనొప్పులు మానును. మరిన్ని ఆముదపువేళ్ళు శొంఠి మునగవేరు చేదుపొట్ల అగరుశొంఠి చెంగల్వకోష్ఠు తంగేడువేరు వీటిని పుల్లనీళ్ళతో (తరవాణితో) నూరి, శిరస్సున మర్దనచేసిన శిరోరోగములు మానును.

తలపోట్లు కర్ణరోగములు వీనికి చికిత్స.

శ్లో॥ లేపఃపాఠాపటోలౌషధరుబుకజటాశిగ్రుదద్రఘ్నకుష్ఠైర్ధాన్యామ్లేన
ప్రపిష్టైఃప్రశమయతిమహామూర్ధరోగానశేషాన్ । పత్రంపక్వం

ఘృతాక్తంరవిభసమపలేతాపితంపీడయేత్తత్తోయంకర్ణేనిషిక్తం
దళయతిసకలంకర్ణశూలంసమూలమ్ ॥

తా॥ విషబొద్ది చేతిపొట్ల శొంఠి ఆముదపువేళ్ళు మునగవేరుచెక్క తగిరిక విత్తులు చంగల్వకోష్టు వీనిని సమభాగములుగ పులికడుగుతో నూరి తలకుకట్టిన తల పోట్లు హరించు. మఱియు పండుజిల్లేడాకులకు నెయ్యిపట్టించి నిప్పుమీదకాచి రసముపిండి కించిదుష్ణంబుగ నుండునపుడు చెవిలోవేసిన చెవిపోటు హరించు.

మొటిమలకు చికిత్స.

శ్లో॥ న్యగ్రోధాంకురకోష్ఠలోధ్రవికసాశ్యామామసూరారుణాశ్రీఖండైః
పయసాన్వితైర్విరచితంవ్యంగఘ్నముద్వర్తనమ్ । లిప్తంసప్తదినం
మసూరరజసాసర్పిఃపయశ్శాలినావక్త్రంశారదచన్ద్రసున్దరతరంవ్యం
గస్యభంగాద్భవేత్ ॥ ఇంగుద్యాఃఫలమజ్జకోజలయుతోలేపాన్ముఖే
కాన్తిదోరాధోగ్రాధనికానిహన్తి పిటకాస్తారుణ్యజాలేపనాత్ ।
హార్యంరక్తమయూషి కారుజిహితోమూత్రేణలేపోథవాపిణ్యాకస్య
పురాతనస్యశకృతఃపాదాయుధస్యధ్రువమ్ ॥

తా॥ మఱ్ఱివూడలకొనలు చంగల్వకోష్టు లొద్దుగచెక్క మంజిష్టి బూరుగ ముండ్లు చిరిశనగపిండి అతివస శ్రీగంధము వీనిని సమభాగములుగ ఆవుపాలతో నూరి 7 దినములు ముఖమునకు లేపనముచేసిన ముఖముమీది మొటిమలు మొదలగునవి హరించు. మరియు గారపంటిగుజ్జును శీతోదకముతోనేని లేక లొద్దుగచెక్క వస ధనియాలు వీనిని ఉదకముతోనేని నూరి ముఖమునకు పట్టించిన ముఖముమీది మొటిమలు మొదలగునవిహరించి కాంతికలుగు. మరియు ముఖముమీది మొటిమలు హరించుటకై జలగలనంటించి రక్తమునైనా తీయవలయు. లేక గోమూత్రములో ప్రాతనువ్వులపిండినికలిపిగాని లేక కోడిమలమునుగాని లేపనముచేయవలయును.

తీట గజ్జి మేహాజిల వీటికి చికిత్స.

శ్లో॥ రసద్విజీరద్వినిశామరీచసిందూరదైత్యేన్ద్రమనశ్శిలానామ్ ।
చూర్ణీకృతానాంఘృతమిశ్రితానాంత్రిభిఃప్రలేపైరపయాతిపామా ॥

తా॥ * పాదరసము జీలకఱ్ఱ నల్లజీలకఱ్ఱ పసపు కస్తూరిపసపు మిరియాలు గంగ సింధూరము గంధకము మణిశిల వీనిని సమభాగములుగ చూర్ణముచేసి ఇనపబాణలిలోవైచి నెయ్యిబోసి ఇనుపగుండుతో సన్నగనూరి ప్రతిదినము మూడావృత్తులు పట్టించిన సమస్తమయిన తీటలుమానును. మరియు పైదానిలో హరిదళము తగరపు విత్తులు తంగేడువిత్తులు భావంచివిత్తులు వేసి నూరి దినమునకు మూడుమార్లు పట్టించిన సమమయిన తీటలు మానును.

శ్లో॥ నఖముఖలాలనసుఖదాపామారామానితమ్బవిస్తారా ।
స్నేహాకనకరసగంధై ర్గచ్ఛతిపూర్వాపరావశంయాతి ॥

తా॥ స్త్రీ!లకుకలుగునట్టి ! రొండిగజ్జి మొదలగువానికి ఉమ్మెత్తవిత్తులు పాదరసము గంధకము వీనిని నూనె మొదలగుజిడ్డువస్తువులతో ఖల్వముననూరి లేపనము జేసిన అవి హరించు.

కాళ్లు చేతులు పగిలిన జాడ్యమునకు చికిత్స.

శ్లో॥ మదనసైంధవగుగ్గులుగైరికాజ్యమధురాజ్యగుడాగ్నివిలేపనాత్ ।
స్ఫుటితమప్యచిరంచరణద్వయంవికచతామరసప్రతిమంభవేత్ ॥

తా॥ మైనము సైంధవలవణము గుగ్గిలము కావిరాళ్లు నెయ్యి తేనె బెల్లము వీనిని సమభాగములుగ ఒక బాణలిలోవేసి కరిగించి పక్వముగవండి పగిలినకాళ్ళకు చేతులకు సాయంప్రాతఃకాలములయందు పట్టించిన పగుళ్లుమాని తామరరేకువలె నగు.

ఇతి శ్రీమదహమ్మదనగరస్థిత మాణిక భట్టవైద్యాత్మజ మోరేశ్వర విరచిత వైద్యామృతము తృతీయాలంకారము సమాప్తము.

---

* పాదరసము గంధకము వీటిని ముందుగామర్దించి పిదప తక్కినవస్తువుల ప్రత్యేకముగదంచి చూర్ణముచేసి అందు మిశ్రమము చేయవలయు.

! దీనిని పామరోగమనియెదరు.

శ్రీరస్తు.

# వైద్యామృతము.



## చతుర్థాలంకార ప్రారంభము

### స్త్రీరోగచికిత్సా.

శ్లో॥ వృషధారునిశాకిరాతభల్లీరసజాంభోధరబిల్వజఃకషాయః ।
మధునామధురీకృతోనిహంతివివిధానిప్రదరాణికామినీనామ్ ॥

తా॥ అడ్డసరపాకు మానిపసపు సీమనేలవేము రసాంజనము (అనగా మాని పసపు కషాయము పెట్టి అష్టమాంశముగ కాచిదించుకొని సమముగా మేకపాలుపోసి మూకుటికిఅంటకుండా కలియబెట్టుచు ముద్దచేసి పిమ్మట ఎండించివుంచినది) తుంగ గడ్డలు మారేడుపిందెలు వీటిని కషాయముపెట్టి తేనెతోపుచ్చుకొనిన స్త్రీలకుకలిగిన ప్రదరరోగములు మానును.

శ్లో॥ దుగ్ధంప్రయుక్తాఖుపురీషపానాదసృగ్దరంతిష్ఠనైవసత్యం ।
కందర్పరూపేపినితాంతషండేకాంతేయథామానసమంగనానామ్ ॥

తా॥ ఎలుకపెంటికలు ఆవుపాలలోవైచికాచి పుచ్చుకొనిన స్త్రీలయొక్క రక్తప్రదరరోగములు మానును.

శ్లో॥ విపుషాఘృతసంయుతామ్ర గాక్షీప్రదరంశూలయుతంనిరాకరోతి ।
ప్రథమేసురతేయథానవోఢాప్రియహస్తంబతసీవిషుప్రయుక్తమ్ ॥

తా॥ పెద్దసోపు చూర్ణముచేసి నేతితోపుచ్చుకొనిన పోటుకలప్రదరరోగములు మానును.

శ్లో॥ వంధ్యాఃస్త్రియోనైవసుఖాయయస్మాద్వదామితాసాంకమపిప్రయోగం । పలాశబీజస్యమషీజలేనపీత్వాసగర్భాలలనాభవంతి ॥

తా॥ లోకమునందు గొడ్డుపోతు లనేకమంది కలరు. కావున అట్టివారలు మోదుగవిత్తులను నల్లగభస్మముచేసి నీళ్ళలోకలిపి పుచ్చుకొనిని గర్భవంతులగుదురు.

శ్లో॥ పీత్వాతంపులతో యేనతంపులీయజటాంబుతా ।
పతద్గర్భాచయానారీస్థిరగర్భాప్రజాయతే ॥

తా॥ చిర్రికూరవేరును కుడిచేతితో నూరి స్త్రీలు బహిష్ఠయినకాలములో పుచ్చుకొనిన గర్భమునిలుచును.

శ్లో॥ మనోరమాయాఃకిలగర్భవత్యారక్తంస్రవేచ్చేద్బహులంతుయస్యాః ।
పారావతీయంసహసాపురీషంతాంపాయయేత్తంపులతోయమిశ్రమ్ ॥

తా॥ గర్భవతియయిన స్త్రీకి విశేషముగా రక్తము స్రవించుచున్నయెడల పావురపుపిట్టయొక్క మలమును, బియ్యపుకడితిలోకలిపి యిచ్చిన రక్తస్రావము మానును.

శ్లో॥ శర్కరాయవతిలైస్సమాంశకైర్మాక్షికేణసహభక్షితం స్త్రియః ।
నాస్తిగర్భపతనోద్భవంభయంపాపభీతిరివతీర్థసేవనైః ॥

తా॥ శర్కర యవలు నువ్వులు వీటిని సమభాగములుగా చూర్ణముచేసి తేనెతో పుచ్చుకొనిన గర్భపతనమనునట్టి వ్యాధి మానును.

శ్లో॥ వృషస్యమూలంయదినాభియోనౌప్రలేపితం స్త్రీర్ఝడితిప్రసూతే ।
తథాకటిస్థఃకదళీసుకందో వేగాత్ప్రసూతింకురుతేంగనానామ్ ॥

తా॥ అడ్డరసపువేరు గంధముతీసి స్త్రీలయొక్క నాభియందుగాని యోనియందుగాని లేపనముచేసిన శీఘ్రములో ప్రసవమగును.

శ్లో॥ బిడాలవణుంచవృషకోషకుల్యానదోషణప్రగ్రంథికనాగరాణాం ।
కల్కస్సుఖోష్ణేనజలేనపీతశ్శూలానియోనిప్రభవానిహంతి ॥

తా॥ బిడాలవణము శాపంచవిత్తులు అడ్డసరపువేళ్ళు పిప్పళ్ళు వస మిరియాలు మోడి శొంఠి నీటినికల్కముచేసి ఉష్ణోదకముతో సేవించిన యోనిశూలలు మానును.

శ్లో॥ శుంఠీరుబుకమూలాభ్యాంప్రలేపోభగశూలనుత్ ।
తథాసంకోచనంచూర్ణంమృత్స్నామాయాఫలోద్భవం ॥

తా॥ శొంఠి ఆముదపువేరు వీటినిగంధముతీసి యోనికి లేపనముజేసి యోని శూలలుమానును. మరిన్ని కరవిరాళ్ళు మాయఫలము వీటినిచూర్ణముజేసి నీళ్ళతో కలిపి యోనికి లేపనముజేసిన యోని సంకోచమగును.

రజస్వలవుటకు గర్భపాతమునకు చికిత్స.

శ్లో॥ మూలంగవాక్ష్యాఃస్మరమన్దిరస్థంపుష్పావరోధస్యవధంకరోతి ।
అభర్తృకాణాంవ్యభిచారిణీనాంయోగోయమేవద్రుతగర్భపాతే ॥

తా॥ రజస్వలకానివారు వెఱ్ఱిపుచ్చవేరును యోనియందొకదినము ఉంచుకొనిన రజస్వలగుదురు. మఱియు పతివిహీనులై వ్యభిచారమువలన గర్భముధరించినవారలు ఆదేప్రకారముచేసిన గరపాతకముగలుగు.

స్తనరోగచికిత్సా.

శ్లో॥ ఇంద్రవారుణికామూలలేపాద్వ్యాతిశుచవ్యథా ।
తథాకుమారికాకంతహరిద్రాలేపనాదపి ॥

తా॥ వెఱ్ఱిపుచ్చవేరు గంధముతీసి స్తనములకు పట్టించినను కలబందమూలమును పసపుచేర్చి నూరి లేపనముచేసినను చనుకుదురు మొదలగు స్తనరోగములు మానును.

శ్లో॥ విదారికాకందరసస్సుదుగ్ధశ్శతావరీవాకురుతేంగనానాం ।
సదుగ్ధభక్తాశనతత్పరాణాంపయోధరౌప్రాప్యపయస్సముద్రౌ ॥

తా॥ నేలగుమ్మడిగడ్డరసము పాలతోచేర్చియిచ్చినను చల్లగడ్డరసముకాని లేక చూర్ణమునుకాని పాలతోచేర్చియిచ్చినను స్తనములయందును విశేషముగపాలు కలుగును. ఇందుకు పాలు అన్నము పథ్యము.

బాలరోగచికిత్సా.

శ్లో॥ వాలకంధాతకీలోధ్రింబిల్వంచగజపిప్పలీ ।
మధుమిశ్రైఃకాష్ఠలేహాబాలాతీసారనాశనః ॥

తా॥ వట్టివేళ్ళు ఆరెపువ్వు లొద్దుగచెక్క మారేడుపిందెలు గజపిప్పలి వీటిని కషాయము పెట్టికాని లేక చూర్ణముచేసికాని తేనెతోయిచ్చిన బాలాతిసారములు మానును.

శ్లో॥ కృష్ణారుణాశృంగిపయోధరాణాంసచూర్ణితంమాక్షికసంప్రయుక్తం।
శిశోర్జ్వరఛర్ద్యతిసారకాసశ్వాసఘ్నమేతత్సముదాహరంతి॥

తా॥ పిప్పళ్ళు మంజిష్ఠ కరకపువ్వు తుంగగడ్డలు వీటిని చూర్ణముచేసి తేనెతో ఇచ్చిన పిల్లలకుకలిగిన జ్వరములు కక్కులు అతిసారములు శ్వాసకాసలు ఇవి మానును.

## విషచికిత్సా.

శ్లో॥ తుత్థంగంధరసరాత్రిటంకణైర్వేణితోయపరిమర్దయేద్దృఢం।
హంత్యయంవిషహరోనరాంబునాస్థావరంతదనుజంగమంవిషం॥

తా॥ మైలుతుత్తము గంధకము పాదరసము పసపు వెలిగారపుపేలాలు వీటిని చూర్ణముచేసి చేదుసొరకాయరసముచే భావనచేసి జొన్నగింజలంతమాత్రలు జేసి నరమూత్రముతోయిచ్చిన స్థావరజంగమవిషములు (అనగా వసనాభి పాషాణము నల్లమందు ఇవి మొదలగునవి స్థావరవిషములు పాము తేలు మొదలగువాటి విషములు జంగమవిషములు) నివారణమగును.

## విరేచనమునకు వటుకములు.

శ్లో॥ హింగూలటంకణవరాత్రికటూగ్రగంధాబాహ్లీకదీప్యయుగసైంధవ
వేల్లదంత్యః। సర్వైస్సమోనిగదితోజయపాలభాగస్సర్వంతు
నింబుసలిలేనవిమర్ద్యమేతత్॥ గుంజాప్రమాణవటుకోష్ణజలేనగుల్మ
పాండుక్షయస్వసనకాసబలాసమేహాన్। ఆధ్మానశూలగుదజోదర
వహ్నిమాంద్యవిష్టంభకుష్ఠక్రిమిరుక్ప్రభృతీన్నిహంతి॥

తా॥ ఇంగిలీకము వెలిగారపుపేలాలు కరక తాండ్ర వుసిరికలు శొంఠి పిప్పళ్లు మిరియాలు వస వేయించినయింగువ ఓమము అజామోదము సైంధవలవణము వాయువిడంగములు నేపాళపువేరు వీటికన్నిటికి శుద్ధిజేసిన నేపాళపుగింజలు సమభాగము

వీటినన్నియు నిమ్మపండ్లరసముచేత నూరి గురిగింజలంతమాత్రలుచేసి యెండపెట్టి వుంచుకొని ఉష్ణోదకముతో ఒక్కమాత్ర పుచ్చుకొనిన విరేచనములు అయినపిమ్మట గుల్మము పాండురోగములు క్షయలు కాసశ్వాసములు కఫము ప్రమేహము వుదర వ్యాధులు శూలలు మూలవ్యాధులు అగ్నిమాంద్యము మలబద్ధము కుష్ఠరోగము ఇవి మానును.

## జ్వరాదులకు అనుపానము.

శ్లో॥ ఘనపర్పటకంజ్వరేగ్రహణ్యాం మథితంహేమవిషేవమిశాఘ్నలాజాః।
కుటజోతిసృతౌవృషోస్రపిత్తేగుదకీలేష్వనలఃక్రిమౌక్రిమిఘ్నమ్ ॥

తా॥ జ్వరమున తుంగముస్తెలు పర్పాటకము గ్రహణిరోగమున మజ్జిగ విషమున సువర్ణభస్మము లేక పలచని బంగారురేకులు వాంతిరోగమున వరిపేలాలు అతిసారమున కొడిసెచక్క లేక కొడిసెవేరు లేక కొడిసెవిత్తులు రక్తపిత్తమున అడ్డసరపాకు రసము మూలరోగమున జీడిగింజలు క్రిమిరోగమున వాయువిళంగములు అనువానిని అనుపానములుగ గ్రహింపవలయు.

శ్లో॥ శూలేహింగుఘృతాన్వితంమధుయుతాకృష్ణా పురాణజ్వరేవాతేసా జ్వరసోనకశ్శ్వాసనకేక్షౌద్రాన్వితంత్ర్యూషణమ్। శీతేవ్యాలలతా దళంసమరిచంమేహేవరాసోపలాదోషాణాం త్రితయేనుపానముచితంక్షౌద్రమార్ద్రోద్భిదకమ్ ॥

తా॥ శూలరోగమునందు ఇంగువ నెయ్యి జీర్ణజ్వరమున తేనె పిప్పళ్లు వాతరోగమున నెయ్యి తెల్లగడ్డలు శ్వాసరోగమున తేనె శొంఠి పిప్పలి మిరియాలు శీతరోగమున అనగా శ్లేష్మరోగమున తమలపాకు మిరియాలు ప్రమేహరోగమున కరకతాంద్రయుసిరికెలు ఖండశర్కర త్రిదోషముల అల్లపురసము తేనె అనువానిని అనుపానములుగ గ్రహింపవలయు.

## గ్రంథకర్త్రాభిప్రాయము.

శ్లో॥ మోరేశ్వరేణభిషజానగరస్థితేన వైద్యామృతంకృతమిదంబహుధావిచార్య ।
వైద్యాస్తపమకృపయాపరిపాలయంతుసమ్యక్సనాతనవిచారవిశారదాయే ॥ అనుభవాత్కృతి చిత్కృతిచిద్గురోఃకతిచ

శాస్త్రైర్భిషగ్భిరాన్ను వమర్జితాః । ఇహమయాభిషజాహితమిచ్ఛతానిగదితాశుచియోగగణాఇమే । భ్రమాదశుద్ధంగదితంయదిస్యాద్దోషోనకశ్చిన్మమభావనీయః । భూలోకజన్మాఖిలలోకధర్మభ్రాంతేః పరందూషణమేతదస్తు ॥ భోభోవైద్యసుతాసుతాశ్శృణుధ్వమఘనాసౌభాగ్యదంకీర్తిదం । పాపఘ్నాశనమంత్రతంత్రవిహితంమాన్యంమదీయంవచః। యూయంసన్మనసాచికిత్సతవిధాహితాద్వదురాశాం పరాం శంభోవిశ్వపతేత్వదర్పణమిదంభూయాదితిధ్యాయత ॥ హుతాశనాకాశరసేందుయుక్తే సంవత్సరే దుర్మతినామ భాజి । వైద్యామృతంనామదధానఏషగ్రంథస్మరారేఃకృపయాసమాప్తః॥

తా॥ అహమ్మదనగరమునందుండు మోరేశ్వరుడను వైద్యవర్యుండు అనేకవైద్యగ్రంథముల నాలోచించి వైద్యామృతంబను ఈగ్రంథమును రచియించె కావున ఓవైద్యులారా ! మీరలందఱు ఈగ్రంథమును దయచేత పరిపాలింపుడు. ఇందు కొన్ని క్రియలను అనుభవముచేతను ఇంక కొన్ని క్రియలను గురువుయొక్క అనుగ్రహము వలనను మరికొన్ని క్రియలను శాస్త్రమువలనను సంపాదించి వైద్యులకు హితమును కోరి ఇందుచేర్చితి. పొరపాటువలన నేదైన నబద్ధమున్న నాకిసుమంతయును దోషము లేదు. భూమియందు పుట్టుట లోక ధర్మభ్రాంతికిని దూషణమునకును కారణమై యున్నది. ఈగ్రంథము పఠించిన ఐశ్వర్యము. కీర్తియుఁగలుగుటయేగాక పాపక్షయమున్ను అగును. కావున నేజెప్పిన ఈగ్రంథమునుచూచి మీరలు మంచిమనస్సుచే చికిత్సచేయువిషయములో దురాశనువదలి ఆఫలమును ఈశ్వరార్పణచేయుడు. నేను ఈగ్రంథమును 1603 శాలివాహన శకంబులుగడచిన దుర్మతినామ సంవత్సరంబున నీశ్వరకృపచేత చెప్పితి.

ఇతి శ్రీమదహమ్మదనగరస్థితమాణికభట్టాత్మజమోరేశ్వర
విరచిత వైద్యామృతము చతుర్థాలంకారము
సమాప్తము.

వైద్యామృతము
సంపూర్ణము.

---

శ్రీ ర స్తు.

# అ జీ ర్ణ మ ం జ రి.



శ్లో॥ అజీర్ణప్రభవారోగా స్తదజీర్ణంచతుర్విధం ।
ఆమంవిదగ్ధంవిష్టబ్ధంరసాజీర్ణంచతుర్థకం ॥

తా॥ అజీర్ణముఁవలన మనుజునికి అన్నిరోగములు పుట్టును. అట్టి అజీర్ణము ఆమమని విదగ్ధమని విష్టబ్ధమని రసాజీర్ణమని 4 విధములుగానున్నది.

### అజీర్ణచతుష్టయలక్షణము.

శ్లో॥ ఆమేచసద్యఉద్గారోవిదగ్ధేచోదరవ్యథా ।
విష్టబ్ధేచాంచభంగస్స్యాద్రసశేషేధిజృంభణం ॥

తా॥ ఆమాజీర్ణమునందు తేపులు విదగ్ధాజీర్ణమునందు కడుపునొప్పి విష్టబ్ధాజీర్ణమునందు ఒడలు విరగగొట్టినట్లుండడము రసశేషాజీర్ణమునందు ఆవలింతలు ఇవికలుగును.

### అజీర్ణచతుష్టయసామాన్యోపచారము.

శ్లో॥ ఆమేచోష్ణోదకంపేయందగ్ధేచోదరస్వేదనం ।
విష్టబ్ధేరేచనంచైవశయనంరసశేషకే॥

తా॥ ఆమాజీర్ణమునందు ఉష్ణోదకపానము విదగ్ధాజీర్ణమునందు వేడినీళ్లతో కడుపుపైన వొత్తడము వేయడము విష్టబ్ధాజీర్ణమునందు విరేచనమునకు మందు పుచ్చుకొనడము రసశేషాజీర్ణమునందు నిదురబోవడము వీటివలన అజీర్ణములు మానును.

### అజీర్ణపచనదినప్రమాణములు.

శ్లో॥ ఘృతాజీర్ణేదినాఃపంచతైలేద్వాదశకస్తథా ।
తిథిసంఖ్యాపయస్యుక్తాదధ్నివావింశతిస్మృతా ॥

తా॥ నేతివలనకలిగిన అజీర్ణము 5 దినములవరకును తైలాజీర్ణము 12 దినములవరకును పాలవలనకలిగిన అజీర్ణము 15 దినములవరకును పెరుగువలన కలిగిన అజీర్ణము 20 దినములవరకును వుండును.

## అజీర్ణపచన దినములు.

శ్లో॥ ఆమాన్నంసప్తరాత్రేణదధిషోడశభిస్తథా ।
క్షీరంవింశతిభిర్జ్ఞేయంమాంసంమాంసేనపచ్యతే ॥

తా॥ ఆమాజీర్ణము 7 దినములవరకును పెరుగుజీర్ణముకానియెడల 16 దినములవరకును పాలు జీర్ణముకానియెడల 20 దినములవరకును మాంసము జీర్ణముకానియడల 30 దినములవరకు అజీర్ణముగానేయుండి పిదప పక్వమగును.

## ఘృతాజీర్ణాదులకు చికిత్సా.

శ్లో॥ ఉదకంచఘృతాజీర్ణేతైలాజీర్ణేచకాంజికం ।
గోధూమేకర్కటిశ్చైర్భిషాకదల్యామ్రఫలేఘృతం ॥

తా॥ ఘృతాజీర్ణమునకు ఉష్ణోదకపానము తైలాజీర్ణమునకు పుల్లనీళ్ళు గోధుమలవలనకలిగిన అజీర్ణమునకు దోసకాయ అరటిపండు మామిడిపండు వీటివలన కలిగిన అజీర్ణమునకు నెయ్యియుత్రాగవలెను. ఇటులచేసిన ఈ అజీర్ణములు మానును.

శ్లో॥ నారికేళఫలేషుతండులమథక్షీరంరసాలేహితం ।
జంబీరోత్థరసోఘృతేసముచితస్సర్పిస్తుమోచాఫలే ।
గోధూమేషుచకర్కటీహితతమాచామాత్యయేకాంజికం ।
నారంగేగుడభక్షణంప్రకథితంపిండాలుకంకోద్రవే ॥

తా॥ టెంకాయవలనకలిగిన అజీర్ణమునకు బియ్యపుగింజలు మామిపండువలన కలిగిన అజీర్ణమునకు పాలు నెయ్యివలనకలిగిన అజీర్ణమునకు నిమ్మపండ్లపులును అరటిపండ్లవలనకలిగిన అజీర్ణమునకు నెయ్యి గోధుమలవలనకలిగిన అజీర్ణమునకు దోసకాయ ఆమాజీర్ణమునకు పుల్లనీళ్లు నారింజపండు కిచ్చిలిపండుయొక్క అజీర్ణమునకు బెల్లము ఆళ్ళవలనకలిగిన అజీర్ణమునకు తెల్లగెనుసుగెడ్డలు ఇవి పుచ్చుకొనవలయును.

శ్లో॥ పిష్టాన్నే సలిలం ప్రియాలఫలజే పథ్యాహితామాషజే ఖండం క్షీరభవే తు తక్రముచితం కోష్ణాంబుకాలింగజే । మత్స్యే చూతఫలం త్వజీర్ణశమనం మద్యాంబుపానాత్యయే తైలం పౌష్కరజే కటు ప్రశమనం శేషాస్తు బుద్ధ్యా జయేత్ ॥

తా॥ పిండివంటవలన కలిగిన అజీర్ణమునకు ఉదకము సారెపప్పువలనకలిగిన అజీర్ణమునకు కరకపిందెలు మినుములవలనకలిగిన అజీర్ణమునకు ఖండశర్కర లేక బిడాలవణము పాలవలనకలిగిన అజీర్ణమునకు మజ్జిగయును కరిబూజుపండువలన కలిగిన అజీర్ణమునకు ఉష్ణోదకమును మత్స్యమువలనకలిగిన అజీర్ణమునకు మామిడిపండును సారాయివలనకలిగిన అజీర్ణమునకు తేనెతోచేరినఉదకము పౌష్కరాజీర్ణమునకు ఆవనూనెయు ఇవ్వవలయును. తక్కినవిబుద్ధిచే నూహింపవలయును.

శ్లో॥ పనసే కదలం కదలే చ ఘృతం ఘృతపాకవిధావపి జంభరసః ।
తదుపద్రవశాంతికరం లవణం లవణేపి చ తండులవారిపరం ॥

పనసకాయయొక్క అజీర్ణమునకు అరటిపండు (అరటిపండుయొక్క అజీర్ణమునకు నెయ్యి నెయ్యియొక్క అజీర్ణమునకు నిమ్మపండ్లరసము నిమ్మపండ్లయొక్క అజీర్ణమునకు ఉప్పు ఉప్పుయొక్క అజీర్ణమునకు బియ్యపుకుడితి ఇటుల పుచ్చుకొనవలయును.

శ్లో॥ నారికేళఫలతాలమూలయోః పాచనం యదిహ తండులం విదుః ।
తేవదంతి మునయో థ తండులాః క్షీరవారి పరిపాచయత్యపి ॥

తా॥ టెంకాయ తాటిపండు తాటిగడ్డలు (తేగలు) వీటియొక్క అజీర్ణమునకు బియ్యము బియ్యముయొక్క అజీర్ణమునకు పాలతోచేర్చిన ఉదకమును పుచ్చుకొనవలయు.

శ్లో॥ దాడిమామలకతాలతిందుకీబీజపూరలవలీఫలాని చ ।
వాకులం ఫలమతీవ పాచయేత్పాకమేతి వకుళం స్వమూలతః ॥

తా॥ దానిమ్మపండు ఉసిరికెపండు తాటిపండు నల్లతుమికిపండు మాదీఫలము అరటిపండు వీటియొక్క అజీర్ణమునకు పొగడపండు పొగడపండుయొక్క అజీర్ణమునకు పొగడవేరును పుచ్చుకొనవలయును.

శ్లో॥ మధూకమాలూరనృపాదపానాంపరూషఖర్జూరకపిత్థకానాం ।
పాకాయపేయంపిచుమందబీజంసిద్ధార్థకోహంతిచబీజపూరం ॥

తా॥ ఇప్పపండ్లు లేక ఇప్పసారాయి మారేడుపండ్లు రాచమామిడిపండు ఫాలసాపండ్లు ఖర్జూరపుపండ్లు వెలగపండ్లు వీటియొక్క అజీర్ణమునకు వేపగింజలు నూరి పుచ్చుకొనవలయును. మాదీఫలముయొక్క అజీర్ణమునకు ఆవాలు పుచ్చుకొనవలయు.

శ్లో॥ మృణాళఖర్జూరకహారహూరాకశేరుశృంగాటకశర్కరాణాం ।
యథావిపాకాయచభద్రముస్తంతథారసోనేషుపయఃప్రశస్తం ॥

తా॥ తామరతూండు ఖర్జూరపుపండ్లు ద్రాక్షపండ్లు ములువెలగపండ్లు శింగాడీకాయలు శర్కర వీట్లయొక్క అజీర్ణమునకు తుంగముస్తెల చూర్ణమును వెల్లుల్లిగడ్డలయొక్క అజీర్ణమునకు పాలు పుచ్చుకొనవలయును.

శ్లో॥ ఆమ్రాతకోదుంబరపిప్పలీనాంఫలానిచప్లక్షవటాదికానాం ।
విశ్వౌషధంపర్యుషితోదకేనసౌవర్చలేహ్యామ్రఫలస్యపాకం ॥

తా॥ అంబాళపుకాయలు అత్తికాయలు పిప్పళ్ళు జువ్వి మర్రి మొదలగు పండ్లయొక్క అజీర్ణమునకు పాచినీళ్ళతో (అనగా నిన్నటినీళ్ళతో) శొంఠిచూర్ణమును పుచ్చుకొనవలయును. మామిడిపండుయొక్క అజీర్ణమునకు సౌవర్చలవణము లేక సైంధవలవణచూర్ణమునైనా పుచ్చుకొనవలయు.

శ్లో॥ సౌవీరంఫలముష్ణవారిహన్యాత్ప్రాచీనామలకంచరాజికైకా ।
ఖర్జూరంచపురూషకంస్త్రియాలతైలంతాలఫలంపచేన్మరీచం ॥

తా॥ రేగుపండుయొక్క అజీర్ణమునకు వుష్ణోదకము వుసిరికపండుయొక్క అజీర్ణమునకు ఆవాలు ఖర్జూరపండు ఫాలసాపండు సారెపప్పు వీటియొక్క అజీర్ణమునకు నువ్వులనూనె తాడిపండుయొక్క అజీర్ణమునకు మిరియాలు పుచ్చుకొనవలయు.

శ్లో॥ నాగరంహారటిబిల్వజాంబవంపాచయేన్మధురికాకపిత్థజం ।
సర్వథైవసకలామయహంత్రీప్రీతయేస్తిజననీగదితాసా ॥

తా॥ మారేడుపండు నేరేడుపండు వీట్లయొక్క అజీర్ణమునకు శొంఠి చూర్ణము వెలగపండుయొక్క అజీర్ణమునకు పెద్దసోపు పుచ్చుకొనవలయును. ఈపెద్దసోపు సమస్తరోగములను పోగొట్టుటయేగాక దీపనపాచనములను కలుగ జేయును.

శ్లో॥ పనసామలకీఫలంపక్తయేభజతసర్వతరోశ్చబీజకమ్ ।
సకలమప్యుదితంఫలంప్రపచతిప్రసృతంకపికచ్ఛుజమ్ ॥

తా॥ పనసపండు ఉసిరికిపండు వీట్లయొక్క అజీర్ణమునకు అందుకవిత్తులును సమస్తమయిన ఫలములవలనకలిగిన అజీర్ణమునకు దురదగొండివిత్తులును పుచ్చుకొన వలయును.

శ్లో॥ ఆర్ద్రాంమ్రబీజంపనసేవికారేగసాలపక్త్యైఘనరావమూలం ।
అపూపపక్తేస్సజలాయవానీసాకైశ్చిచుక్రాపృథుకస్యపక్త్యై ॥

తా॥ పనసపండుయొక్క అజీర్ణమునకు మామిడిపప్పు మామిడిపండుయొక్క అజీర్ణమునకు వరిపైరువేరుయొక్క కషాయము అతిరసములు (అనగా అరిశలు) అటుకులు వీటియొక్క అజీర్ణమునకు ఓమము లేక ఉదకము పుచ్చుకొనవలయును.

శ్లో॥ పాలంకీకాకింశుకకారవల్లీవార్తాకీవంశాంకురమూలకానాం ।
చుక్రీకికాలాబుపటోలకానాంసిద్ధార్థకోమేఘురవస్యపంక్త్యై ॥

తా॥ పాలంకికూర మోదుగచిగుళ్లు కాకరకాయలు వంకాయలు వెదురుమోటి కోలు ముల్లంగి చుక్కకూర సొరకాయలు పొట్లకాయలు మాంసము వీటియొక్క అజీర్ణమునకు ఆవచూర్ణము పుచ్చుకొనవలయును.

శ్లో॥ పిశితపనసయోస్స్యాదామ్రబీజేనపాకః కృసరమహిషయోపిక్షీ
రయోస్సైంధవేన । ద్విదలపరిణతిస్స్యాత్పిప్పలీదీప్యకాభ్యా
మపహరతితృషాంభోనైదలానామజీర్ణం ॥

తా॥ మాంసము పనసపండు వీటియొక్క అజీర్ణమునకు మామిడిపప్పు పెసలుపప్పుచేరిన పులగము ఎనుముపాలు వీటియొక్క అజీర్ణమునకు సైంధవలవణము కందులు మొదలయిన ద్విదలపదార్థములయొక్క అజీర్ణమునకు పిప్పళ్ళు లేక ఓమము లేక ఉదకము పుచ్చుకొనవలయు.

శ్లో॥ పటోలవవిశాంకురకారవల్లీఫలాన్యలాబూనిబహూనిజగ్ధ్వా ।
క్షారోదకంబ్రహ్మతరోర్నిపీతంభోక్తుంపునర్వాఛతితావదేవ ॥

తా॥ పొట్లకాయ వెదురుమోటికలు కాకరకాయలు సొరకాయలు వీట్ల యొక్క అజీర్ణమునకు మోదుగక్షారమును నీళ్ళలోకలిపి పుచ్చుకొనిన అప్పుడే భోజనముచేయుటకు ఇచ్ఛకలుగును.

శ్లో॥ వాసుకసిద్ధార్థకచంచుకశాకంప్రయాంతిసద్యఃఖదిరేణపాకం ।
యథాగుడసూరణనాగరంగైస్తథాలుకంతండులవారిహంతి ॥

తా॥ చక్రవర్తికూర ఆవకూర చంచలికూర వీట్లయొక్క అజీర్ణమునకు చండ్రచక్కపొడి పుచ్చుకొనవలయును. కందగడ్డలు నారింజపండ్లు వీట్లయొక్క అజీర్ణమునకు బెల్లము ఉరళగడ్లయొక్క అజీర్ణమునకు బియ్యపుకుడితి పుచ్చుకొన వలయును.

శ్లో॥ పత్రాణిపుష్పాణిఫలానియానిమూలానిపూర్వాణిమయోదితాని ।
శాకానిసర్వాణ్యుపయాంతిపాకంక్షారేణతాన్యేవతిలోద్భవేన ॥

తా॥ పూర్వోక్తములైన ఆకులు పువ్వులు పండ్లు దుంపలు మొదలగునవి కూరలు వీటియొక్క అజీర్ణమునకు నువ్వుచెట్లవలనతీసిన క్షారమును పుచ్చుకొనవలయును.

శ్లో॥ కాంజికంహిలవణాన్వితంశృతంపిష్టపాచనకమాదిశంతిహి ।
సర్పిరేవయవనూక్తసంయుతంమాంసపాచనమథోష్ణవారిణా ॥

తా॥ పిండివంటలయొక్క అజీర్ణమునకు ఉప్పును పుల్లనీళ్ళలోవేసి పుచ్చుకొనవలయును. మఱిన్ని నెయ్యి యవనూక్తను పుచ్చుకొనవలయును. మాంసాజీర్ణమునకు వేడినీళ్ళు పుచ్చుకొనవలయును.

శ్లో॥ శ్యామాజనీవారతిలాతసీనాంనిష్పావకంగూయవషష్టికానాం ।
మంథేనపాకోథకులుత్థచించాపాకాయవేయంతిలతైలమేకం ॥

తా॥ చామలు యవలు షష్టికములు వీటియొక్క అజీర్ణములకు (పేలపిండి నెయ్యి దాడిమపండురసము బెల్లము ఇవిచేర్చిన మంథమగును) అట్టి మంథమును పుచ్చుకొనవలయును. వులవలు చింతపండు వీటియొక్క అజీర్ణమునకు నువ్వులనూనె పుచ్చుకొనవలయును.

శ్లో॥ గోధూమమాషాహరిమంథముద్గాయవాః సతీనాః కితవో నిహంతి।
యన్మాతులుంగీఫలమేతిపాకంక్షణేనసోయంలవణానుభావః ॥

తా॥ గోధుమలు మినుములు శనగలు పెసలు యవలు బఠాణీలు వీటియొక్క అజీర్ణమునకు తెల్లవుత్తరేణియొక్క క్షారము మాదీఫలముయొక్క అజీర్ణమునకు లవణము పుచ్చుకొనవలయు.

శ్లో॥ ఖర్జూరికాబీసకశేరుమీనముద్గైర్యవాః త్తైలయుతాన్నిహంతి।
కర్పూరపూగీఫలనాగవల్లీకాశ్మీరజాతీఫలజాతిపత్రీ।
కస్తూరికాసేతుకనారికేళజలంపచత్యాశుసముద్రఫేనః ॥

తా॥ ఖర్జూరపుపండు తామరతూండ్లు ములువెలగపండు మత్స్యములు పెసలు యవలు వీట్లయొక్క అజీర్ణమునకు నువ్వులనూనె కర్పూరము వక్కలు తమలపాకులు కుంకుమపువ్వు జాజికాయలు జాపత్రి కస్తూరి గడుగాయలు యళనీరుకాయనీళ్లు వీట్లయొక్క అజీర్ణమునకు సముద్రపునురుగు పుచ్చుకొనవలయును.

శ్లో॥ నింబూఫలేనాప్యథచోషణేనతక్రేణవాసర్పిరుపైతిపాకమ్ ॥

తా॥ నేతియొక్క అజీర్ణమునకు నిమ్మపండ్లరసము లేక మిరియాలు లేక మజ్జిగ ఇవి పుచ్చుకొనవలయును.

శ్లో॥ తైలానిసర్వాణితిలాదికానాంప్రయాంతిపాకంకలకాంజికేన।
స్యాత్తద్వికారేలవణంసతక్రంతయోర్వికారేచపరస్పరంతే ॥

తా॥ నువ్వులు మొదలగు వాటినూనెలయొక్క అజీర్ణమునకు పుల్లనీళ్లు పుల్లనీళ్లయొక్క అజీర్ణమునకు ఉప్పుతోచేరినమజ్జిగ మజ్జిగయొక్క అజీర్ణమునకు ఉప్పు ఉప్పుయొక్క అజీర్ణమునకు మజ్జిగయు పుచ్చుకొనవలయును.

శ్లో॥ శృంగిబేరరసఏవకేవలంక్షారతోయమథవాఫలాశజం।
ఐక్షవంరశముదస్యతీక్షణాదగ్నివేశమునినేదమీరితమ్ ॥

తా॥ చెరుకుపాలయొక్క అజీర్ణమునకు అల్లపురసము లేక మోదుగక్షారము నీళ్ళతో పుచ్చుకొనవలయును. ఈక్రియను అగ్నివేశుడను వొకముని చెప్పెను.

శ్లో॥ మాహిషేపయసీసైంధవంయథాసైంధవంకృసరవజ్రయేతథా ।
కాంజికంచవిదలాన్నపక్తయేశీలయంతిజఠరాగ్నిశక్తయోః ॥

తా॥ ఎనుముపాలయొక్క అజీర్ణమునకు పెసరపప్పుతోచేరిన పులగము యొక్క అజీర్ణమునకు సైంధవలవణమును కందులు మొదలగువాటియొక్క అజీర్ణమునకు పుల్లనీళ్ళను పుచ్చుకొనవలయును.

శ్లో॥ కిమిత్రచిత్రంబహుమాంసమత్స్యభోజీసుఖీస్యాత్పరపీయసూక్తం
అత్యద్భుతం కేవలవహ్నిపక్వంమాంసేనమత్స్యఃపరిపాకమేతి ॥

తా॥ అనేకములగు మాంసములయొక్క అజీర్ణమునకు సూక్తమును పుచ్చుకొనవలయును. మత్స్యమాంసముయొక్క అజీర్ణమునకు అగ్నియందుకాల్చిన మత్స్యమును పుచ్చుకొనిన అజీర్ణము నశించును.

శ్లో॥ కపోతపారావతనీలకంఠకపింజలానాంపిశితానిజగ్ధ్వా ।
కాశ్మర్యమూలంవరిపీయపిష్టంసౌవర్చలంవాసహభుక్తమూలం ॥

తా॥ కపోతము పావురము నెమలి కపింజము గౌరవర్ణపు తిత్తిరిపక్షి వీటి యొక్క మాంసములవలనకలిగిన అజీర్ణమునకు గుమ్మిడిచెట్టుయొక్కవేరు చూర్ణము చేసి అందు సౌవర్చలవణమువేసి వుదకములో కలిపిపుచ్చుకొనవలయును.

శ్లో॥ కోష్ణేనమండేనగవాంపయస్తువ్యోష్ణాద్రసాలఃపరిపాకమేతి ।
శంఖస్యచూర్ణేనహయారినారీపయోదధిక్షీరముపైతిపాకం ॥

తా॥ ఆవుపాలయొక్క అజీర్ణమునకు వేడిమీగడయును మామిడిపండ్ల యొక్క అజీర్ణమునకు శొంఠి పిప్పళ్ళు మిరియాలు చూర్ణముచేసి పుచ్చుకొనవలయును. యెనుముపాలు పెరుగు మజ్జిగ వీటియొక్క అజీర్ణమునకు శంఖభస్మము పుచ్చుకొనవలయును.

శ్లో॥ శుంఠీసతీనస్యచనాగరంగజంబీరయోఃకోద్రవకోనిహంతి ।
జీరామిరాచందనగైరికాభ్యోహ్యాథ్యైతితజ్జాఅపియేవికారాః ॥

తా॥ బటానీలయొక్క అజీర్ణమునకు శొంఠియు నారింజపండు నిమ్మపండు వీటియొగ్క అజీర్ణమునకు అరికబియ్యము అరికబియ్యముయొక్క అజీర్ణమునకు జీలకఱ్ఱ మిరియాలు చందనము కురివిరాళ్లు వీట్లను పుచ్చుకొనవలయును.

శ్లో॥ శుంఠీసపథ్యాలవణేనసార్థం దేయాసకృత్తాద్విదళేవికారే ।
అజీర్ణమాత్రేవహితంభవేతజంబీరనీరేణయుతంప్రదద్యాత్ ॥

తా॥ కందులు మొదలగువాటియొక్క అజీర్ణమునకు శొంఠి కరకపిందెలు ఉప్పు వీటిని చూర్ణముచేసి పుచ్చుకొనవలయును. మఱిన్ని సమస్తఅజీర్ణములకున ఈచూర్ణమునే నిమ్మపండ్లరసముతో పుచ్చుకొనవలయును.

శ్లో॥ వటోవేసవారాల్లవంగేన ఫేణీతథాపర్పటశ్శిగ్రుబీజేజయాతి ।
కణామూలతోలడ్డుకాపూపశుంఠ్యావిపాకో భవేచ్ఛష్కులీ
మండయోశ్చ ॥

తా॥ మఱ్ఱివూడల కొనలయొక్క అజీర్ణమునకు వేసవారము ఫేణీయొక్క అజీర్ణమునకు లవంగములు అప్పడముయొక్క అజీర్ణమునకు మునగవిత్తులు లడ్డు అరిశలు (అనగా అతిరసములు) వీటియొక్క అజీర్ణమునకు మోడిచూర్ణము చక్కిలాలు మండిగలు వీటియొక్క అజీర్ణమునకు శొంఠిచూర్ణమును పుచ్చుకొనవలయును.

శ్లో॥ శ్వావిద్గోధాగండకాశ్చిత్రతైలాద్యావత్సారాతోక్కల కూమాణ్డ
దయోపి । మాద్గాపూపాత్పాయసంయాతిపాకంసాముద్రస్యా
ప్యారనాళంసుఖాయ ॥

తా॥ నక్క ఉడుము గాండామృగము చిరతపులి వీటియొక్క అజీర్ణమునకు మువ్వులనూనె పంది తాబేలు మొదలగువాటిమాంసముయొక్క అజీర్ణమునకు యవక్షారము క్షీరాన్నముయొక్క అజీర్ణమునకు పెసరపప్పు ఉప్పు మొదలగువాటియొక్క అజీర్ణమునకు పుల్లనీళ్ళు పుచ్చుకొనవలయును.

శ్లో॥ తప్తంతప్తంహేమతారమగ్నౌ వారంవారంక్షిప్తమంభస్యథైవ ।
పీత్వాతోయందీర్ఘకాలోపపన్నమంభోఽజీర్ణంశీఘ్రమేవంజ
హాతి ॥

తా॥ చాలాదినములనుంచివున్న అజీర్ణమునకు బంగారుగాని వెండిగాని యెఱ్ఱగాకాచి నీళ్ళలో 7 మార్లు అద్ది ఆవుదకము పుచ్చుకొనవలయును.

శ్లో॥ కూశ్మాండకంచిత్రపూగీఫలంచకర్కోటకీచత్రపుసీఫలంచ ।
నిహంతిసద్యోహికరంజబీజరసంతథావారుణిమూలమేకం ॥

తా॥ గుమ్మడుకాయ వక్కలు దోసకాయ ములుదోసకాయ వీటియొక్క అజీర్ణమునకు కానుగవిత్తులయొక్క రసముగాని వెర్రిపుచ్చవేరునుగాని అగ్నిశుద్ధిచేసి సేవింపవలయును.

శ్లో॥ పటోలబింబీఫలకారవేల్లంక్షుద్రాఫలానాంతుబృహత్ఫలాచ ।
సంవాతికంవారణిమూలమేకంఖట్వాచకర్కోటకకర్కటీచ ॥

తా॥ పొట్లకాయ దొండకాయ కాకరకాయ చిన్నములకకాయలు వీటియొక్క అజీర్ణమునకు పెద్దములకకాయలుగాని వెర్రిపుచ్చవేరునుగాని అడవి కాకరకాయలు గాని దోసకాయలుగాని పుచ్చుకొనవలయును.

శ్లో॥ పిచ్ఛిలాచఫలపత్రధోలికావత్సభక్షమథశిగ్రుపత్రికా ।
మేఘనాధభుజగోప్యరాజికాఫంజికాద్యశనజోహివికారః ॥
కాంజికేనతథాదధ్నాక్వాథేనఖదిరస్యచ ।
తాలాసవేనన శ్యేత్తుసంశయంమాస్తువోబుధాః ॥

తా॥ తోటేలుమాంసముయొక్క అజీర్ణమునకు బూరగబంకగాని పండ్లుకాని ఆకులుగాని పుచ్చుకొనవలయు. మఱిన్ని ములకకూరచిర్రికూర తమలపాకులు ఆవాలు వీటియొక్క అజీర్ణమునకు పుల్లనీళ్లు లేక పెరుగు లేక చండ్రచక్కకషాయము లేక తాటికల్లు వీటిని పుచ్చుకొనవలయును.

శ్లో॥ మృగస్యమాంసంశ్రమజారుకూలంవ్యవాయజాతేశయనంప్రవాతే।
క్షీరోక్షణోసైంధవసాధితంతుఛాగాండముక్తంతదిహైవయుక్తమ్॥

తా॥ శ్రమవలనకలిగిన అజీర్ణమునకు మృగమాంసభక్షణము స్త్రీసంగమనాజీర్ణమునకు గాలిగలయింటిలో పరుండుటయును లేక పాలు మిరియాలచూర్ణము సైంధవలవణము వీటితో పచనముచేసిన మేకవట్టలను పుచ్చుకొనవలయును.

శ్లో॥ స్నేహాజ్జీర్ణేరోగిణాంముద్గచూర్ణం హన్యాన్మస్తోహంతినైరేచకాణాం । మాషోనద్యానింబుమూలేనపాకంచించామూంచ స్వన్నాతాం మూర్ణయోగాత్ ॥

తా॥ చమురుకలద్రవ్యములయొక్క అజీర్ణమునకు పెసరపిండియు ... ద్రవ్యములయొక్క అజీర్ణమునకు తుంగముస్తెలచూర్ణము మినపప్పుయొక్క అజీర్ణ నకు నిమ్మవేరు చింతపండుయొక్క అజీర్ణమునకు సున్నమును పుచ్చుకొనవలయును.

శ్లో॥ కోష్ణాంబుపిష్టాన్నభవేహిదేయంప్రియాలమజ్జాస్విదమేవపథ్యం ॥
మాత్స్యేతుమాకందఫలంనిహంతిగోధూమకంకర్కటికానిహంతి

తా॥ పిండివంటయొక్క అజీర్ణమునకును మామిడిపప్పుయొక్క అజీర్ణమునకు వేడినీళ్లు మత్స్యమాంసా అజీర్ణమునకు మామిడిపండు గోధుములయొక్క అజీర్ణమునకు దోసకాయ పుచ్చుకొనవలయును.

శ్లో॥ సద్యఃప్రియాలంవినిహంతిపథ్యామధన్నజీర్ణేపివదంతిపథ్యాం ।
పిండాలుకఃక్షోద్రవపాకకారీఖండస్తుమాషాన్నవికారహారీ ॥

తా॥ సారపప్పుయొక్క అజీర్ణమునకును ద్రవ్యయుక్తమైన అజీర్ణమునకు కరక్కాయబెరడు ఆరికబియ్యముయొక్క అజీర్ణమునకు గెనుసుగడ్డ మాషాన్న యొక్క అజీర్ణమునకు ఖండశర్కర పుచ్చుకొనిన నివారణమగును.

శ్లో॥ ముఖంతపథ్యాతేచూర్ణకేనప్రమాదాద్యదానాగవల్లీదళైస్సైన్య...
సితాత్తైలసౌవీరకైస్తన్నివృత్తిఃపృథక్తస్యగండూషవోపదిష్టః

తా॥ తమలపాకులో సున్నము ఎక్కువైనయెడల నోరుపొక్కును అ... పొక్కులకు శర్కర నూనె పుల్లనీళ్లు వీటినిచేర్చి గండూషము చేయవలయును.

శ్లో॥ ఉష్ణేణశీతంశిశిరేకవోష్ణమమ్లేనచక్షారగణోగుణాఢ్యః ।
స్నేహేనతీక్ష్ణంవమనాతియోగేసితాహితాస్యాదితికాశిరాజః

తా॥ ఉష్ణాజీర్ణమునకు శీతము శీతాజీర్ణమునకు మందోష్ణము పులుసు... అజీర్ణమునకు క్షారము తీక్ష్ణాజీర్ణమునకు నువ్వులనూనె వమనాజీర్ణమునకు ఖండశ... ఉపయోగమగును. ఇట్లు కాశీరాజు మతము.

శ్లో॥ వమనవస్తివిరేచనభేషజంయదిహకర్మనిబంధురుతేఖిలం ।
తదిహవిశ్వేయవాసకసాధితంపిబతపాచనకంరజనీముఖే ॥

తా॥ వమనము వస్తివిరేచనములు వీటికి ఔషధమును పుచ్చుకొనేయెడల పూర్వరాత్రియందు కొంతి దురదగొండివేళ్ళు వీటిని కషాయముపెట్టి పుచ్చుకొని వుదయమునకు వమనవిరేచనాదులకు మందు పుచ్చుకొనవలయును.

శ్లో॥ శీతోదకంనస్యగదాపహారినారీపయశ్చాంజనరుక్షినారి ।
రాలోదకంధూమగదేషుశస్తంధాత్రీఫలంచాతివిరేచననార్తా ॥

తా॥ చన్నీళ్ళు ముక్కుయొక్క రోగములను స్త్రీలయొక్క చనుబాలు అంజనరోగములను మాన్పును. తెల్లగుగ్గిలముయొక్క చూర్ణమును వుదకములో కలిపి పుచ్చుకొనిన పొగయొక్క రోగములు మానును. అతివిరేచనములయందు వుసిరికకాయవరుగు యివ్వవలయును.

శ్లో॥ శ్రవణపూరణజేతిలతైలజంశ్రవణమేవసుఖంవిదుః ।
కవలజేషుగదేష్వథకారయేత్కవలమార్ద్రికజద్రవసంయుతం ॥

తా॥ చెవులయొక్క రోగములయందు చెవిలో నూనెకాచిపోయవలయును. దంతరోగములకు అల్లపురసమును దంతములయందు పిండవలయును.

శ్లో॥ మదయతినహిమద్యంజాతుచేత్త్రీతమద్యఃపిబతి ఘృతసమేతాం
శర్కరామేవసద్యః । అథఘనమధుకైలాకుష్ఠదార్వ్యేల్లవాలుప్ర
గదితకబలాస్యేమద్యగంధోపినస్యాత్ ॥

తా॥ మద్యపానము చేసినయెడల మత్తు కలుగకపోయినట్టయితే నేతిలో చక్కెరకలిపి పుచ్చుకొనవలయు. మద్యపానమువలన మత్తుయొక్కువైనయెడల తుంగముస్తెలు యష్టిమధుకము ఏలకులు చంగల్వకోష్టు సన్నరాష్ట్రకము మానిపసపు వీటిని చూర్ణముచేసి బుగ్గయందునుచుకొన్నయెడల మద్యపానమదమును మద్యవాసనయును నివారణమగును.

శ్లో॥ మాషాఘృతాంభోధరకట్ఫలానాంచూర్ణంయథాపూర్వవివర్ధి
తానాం । విమర్ద్యవక్త్రేఘృతమాసుహంతిసురారసోనాదిజ
ముగ్రగంధం ॥

తా॥ మినుములు 1 భాగము తిప్పతీగె 2 భాగములు తుంగగడ్డలు 3 భాగములు కాయఫలము 4 భాగములు వీటిని చూర్ణము చేసి నూరి వుంటలు చేసి బుగ్గను 1 మాత్ర వుంచుకొనిన మద్యము వెల్లుల్లి మొదలగువాటియొక్క దుర్వాసనపోవును.

శ్లో॥ కూశ్మాండకస్య స్వరసో గుడేనపీతో మదంకోద్రవజంనిహంతి ।
పయోనిపీతంసితయాసమేతముస్మత్తమత్తత్వమపాకరోతి ॥

తా॥ తెల్లగుమ్మడుయొక్క స్వరసమును గుడయుక్తముగా సేవించినయడల కోద్రవసంబంధమైన మదముపోవును. ఆవుపాలలో చక్కెరకలిపి పుచ్చుకొనినయడల ఉమ్మెత్తవిత్తులవలనకలిగిన మత్తు నిలచిపోవును.

శ్లో॥ ఘ్రాత్వాస్వకఠాంవిపినోపలంవాసంప్రాశ్యకించిల్లవణంనరోవా ।
శీతాంబుపీత్వాచులకేనవాపిప్రసహ్యపూగీమదముజ్జహాతి ॥

తా॥ వక్కలయొక్క వగరువలనకలిగిన సొక్కును తనచంకను వాసనచూచినను ఆరణ్యమునందుండు రాయిని వాసనచూచినను కొంచము వుప్పు పుచ్చుకొనినను చన్నీళ్లు పుచ్చుకొనినను మానును.

శ్లో॥ సైంధవంత్రికటుధాన్యజీరకైర్దాడిమీరజనీరామఠకాన్వితైః ।
పాచనోథజఠరాగ్నిదీపనోవేసవారఉదితోమనీషిభిః ॥

తా॥ సైంధవలవణము శొంఠి పిప్పళ్లు మిరియాలు ధనియాలు జీలకఱ్ఱ దాడిమకాయలతోలు పసపు ఇంగువ వీటిని చూర్ణమునుజేసి పుచ్చుకొనిన అగ్నిదీపనముకలిగి పాచనమగును. ఈచూర్ణమే వేసవారమనబడును.

## మధుసూక్తము.

శ్లో॥ గుడమధుకాంజికతక్రనిభాగాస్స్యుర్ద్విగుణాస్తుయథోత్తరమేతే ।
త్రీణిదినానిచధాన్యసమూహేస్థాపితమేతదుశంతిహిసూక్తం ॥

తా॥ బెల్లము 2 భాగములు తేనె 4 భాగములు పుల్లనీళ్ళు 8 భాగములు మజ్జిగ 16 భాగములు వీటిని వొకటిగాచేర్చి 3 దినములు ధాన్యమునందుంచిన సూక్తమని చెప్పబడును.

శ్లో॥ సూక్తముక్తమపీతద్బహుభేదంహంతిసర్వమిదమామజఖేదం ।
యన్మయాత్రగదితంమధుసూక్తంతద్భిషగ్భిరపిపాచనముక్తం ॥

తా॥ ఈసూక్తములు అనేకభేదములుగానున్నవి. ఈసూక్తము సమస్తరోగములను పోగొట్టును. నేను యిందుచెప్పిన మధుసూక్తమును వైద్యులు పాచనమునకు వుపయోగపరుచుదురు.

శ్లో॥ యావై మునీనామనవద్యపద్యా శ్రీ కాశిరాజేనశిశోస్సుఖాయ ।
స్ఫుటీకృదాజీర్ణవిషాపహంత్రీజీయాచ్చిరాయామృతమంజరీయం ॥

తా॥ కాశిరాజుచేత శిశువులకు సుఖముకలుగుటకై దోషరహితమైన శ్లోకములు కలిగి స్పష్టముగా అజీర్ణవిషరోగములను పోగొట్టునట్టుగా చెప్పబడిన ఈఅమృత మంజరి లోకమునందు ప్రసిద్ధిగానుండుగాత.

కాశిరాజకథితా అజీర్ణమంజరి

సమాప్తము.



శ్రీరస్తు.

# యుక్తాయుక్తములు.



## యుక్తావిచారము.

శ్లో॥ నవాన్యేవహిద్రవ్యాణీత్యాది ॥

తా॥ వైద్యవిషయమందన్నిటిలోను క్రొత్తవస్తువులను చేర్చుకొనవలయు. అందు వాయువిడంగములు పిప్పళ్లు బెల్లము ధనియాలు నెయ్యి తేనె వీటినిమాత్రము 6 మాసములక్రిందటివిగాని సంవత్సరముకుక్రిందటివిగాని చేర్చుకొనవలయు. మరియు తిప్పతీగె కొడిశెపట్టె అడ్డసరపాకు నేలగుమ్ముడు చల్లగడ్డ పెన్నేరుగడ్డ పెద్దసదాప వీటిని పచ్చివిగానే చేర్చుకొనవలయు. పచ్చివి చేర్చుకొన్నామని ద్విగుణముగా చేర్చుకొనకూడదు. ఇవిగాక పచ్చివిగా ఔషధములను చేర్చుకొనేయడల ద్విగుణముగాచేర్చవలయు.

## వైద్యలక్షణము.

శ్లో॥ దక్షస్తీర్థాత్తశాస్త్రార్థ ఇత్యాది ॥

తా॥ గురువునలన సమస్తవైద్యశాస్త్ర సంప్రదాయముల నభ్యసించినట్టియు రసాయనాద్యౌషధములను చేయునట్టి విషయములో నేర్పరియును, కీర్తినికోరునట్టియు ఆశలేనట్టియు ధైర్యవంతుడును దయాళువును సదాచారవంతుడును అహంకారరహితుడును ధార్మికుడును ఆలస్యరహితుడును అనేకచికిత్సలనుచూచినట్టివాడును అగు వైద్యుడు చికిత్సచేయుటకర్హుడు.

## ఔషధసేవనకాలము.

శ్లో॥ కాలేను క్తేప్రభాతంస్యాదిత్యాది ॥

తా॥ యెక్కడ నౌషధసేవనకాలము చెప్పలేదో అక్కడ ప్రాతఃకాలము నందు ఔషధమును పుచ్చుకొనవలయు.

## ఔషధప్రతినిధి.

కషాయములు చూర్ణాదులు వీటియందు లేక ఏప్రయోగమందైనా ఔషధము దొరకనియడల ఆఔషధమునకు సమానధర్మముకలవస్తువను చేర్చుకొనవలయు. (ఉదాహరణము) అతివస దొరకనియెడల తుంగముస్తెలు అమ్లవేతసము దొరకనియడల చుక్కకూర కస్తూరి దొరకనియడల శనగపులుసు లేక జాపత్రి ఈమొదలగునవి చేర్చుకొనవలయును గ్రంథవిస్తరమగునని విరమించితిమి.

## ఔషధప్రమాణము.

శ్లో॥ భాగేనుక్తేతుసామ్యంస్యాదిత్యాది ॥

తా॥ కషాయము చూర్ణము లేహము ఈమొదలగువాటియందు భాగము చెప్పనియడల అక్కడ అన్నిపదార్థములకు సమభాగము.

## కషాయాదులు.

శ్లో॥ పానీయంషోడశగుణమిత్యాది ॥

తా॥ 64 తులములయెత్తు నీళ్ళు కుండలోపోసి కషాయములో వేయవలసిన ద్రవ్యములను నలియగొట్టి తులము 4 యెత్తువేసి అష్టమాంశము అనగా తులము 8 యెత్తుగాకాచి హితోష్ణముగా అన్నరసము జీర్ణమయినపిమ్మట సురక్షితవైద్యోక్తప్రకారము పుచ్చుకొనవలయును. జీలకర్ర గుగ్గిలము శిలాజిత్తు క్షారములు ఇంగువ మొదలగునవి చేర్చుయడల తులము 1 చేర్చుది. మరిన్ని పాలు నెయ్యి బెల్లము నూనె కల్కము చూర్ణము మొదలయినవి తులము 1 యెత్తు చేర్చవలయు. కల్కఫాంటములకుకూడ ఇదేప్రమాణము.

పచ్చివికాని యెండినవికాని ద్రవ్యములను ఖల్వమునందునూరి పిండినట్టి రసము కల్కమనబడు. అట్టికల్కము తులము 1 యెత్తు పుచ్చుకొనవలయు. ఇందు తేనె నెయ్యి నూనె మొదలయినవి కల్కములకు ద్విగుణముగా చేర్చుకొనవలయు. శర్కర బెల్లముమాత్రము సమభాగము అట్టి కల్కములోచేర్చుటటువంటి ద్రవ్యము నాలుగింతలుగ వుండవలయు.

మిక్కిలి ఎండినట్టి ద్రవ్యములను చూర్ణముచేసి వస్త్రఘాలితముచేసినట్టి పొడిని చూర్ణమనబడు. అట్టి చూర్ణమును తులము 1 వరకు పుచ్చుకొనేది. ఇందు బెల్లము కలిపేయెడల సమభాగము. శర్కరద్విగుణము ఇంగువ వేయవలసినయెడల వేయించివేశేది. నెయ్యి మొదలగునవి చూర్ణమునకు అనుపానముగా వుంచుకొనే యెడల తులము 2 నీళ్ళు తులము 4 చూర్ణము లేహము ఘుటిక కల్కము ఇవియిచ్చి నీళ్లు త్రాగించేయెడల వాతపిత్తశ్లేష్మములయందు క్రమముగ తులము 12 - 8 - 4 ఇవ్వవలయు. ఉదకమునందు నూనెబిందువవ్యాపించునట్లు అనుపానయుక్తౌషధము దేహమంతయు వ్యాపించును. ద్రవ్యము తడియునంతవరకు రసము వుంచిన భావనయనబడు. మరిన్ని కషాయాదులకుపమానము చెప్పినను దేశకాలములు అగ్ని బలము ప్రకృతి వయస్సు వీటిని బాగుగ ఆలోచించి ప్రమాణముగా ఔషధమునీయవలయు. పాదరసము గంధకము తామ్రము వంగము తాళకము ఇంగిలీకము వసనాభి ఈమొదలగు ద్రవ్యములను ఈ గ్రంథమునందు ఔషధవిషయమై చెప్పియున్నాము. అవి శుద్ధిచేసినవిగాయుండవలయు. వీటియొక్క శోధనమారణములవిషయమై ఇతర గ్రంథములను చూచి తెలిసికొనవలయును.



## తప్పొప్పులు

| తప్పులు. | పేజీ. | ఒప్పులు. | పేజీ. |
|---|---|---|---|
| కఫప్రకోపమాసము | 75 | కఫప్రకోపమాసములు | 75 |
| మేఘములకు అభ్రభక యోగము | 152 | మేహములకు అభ్రభక యోగము | 152 |
| ఉపదంశూకదోష చికిత్సా | 161 | ఉపదంశశూకదోష చికిత్సా | 161 |

* పిత్తస్వరూపలక్షణము. అనునది, 29 వ పేజీలో హెడ్డింగు వుంచవలసినది వదలిపోయినది గనుక దీనిని అచ్చట (29 వ పేజీలో) చేర్చుకొనగోరినాను.



శ్రీరస్తు.

## సంస్కృతాంధ్రగ్రంథములు



### పురాణములు.

| | రూ. | అ. | పై. |
|---|---|---|---|
| అధ్యాత్మరామాయణము, మూలం | 1 | 0 | 0 |
| సుందరకాండము, మూలం | 1 | 0 | 0 |
| డిటో సవ్యాఖ్యానము | 1 | 8 | 0 |
| డిటో ఆంధ్రతాత్పర్యము | 1 | 8 | 0 |
| బాలకాండము ,, | 1 | 8 | 0 |
| వ్రతరత్నాకరం 1 వ భాగం | 0 | 8 | 0 |
| డిటో 2 వ భాగం | 1 | 0 | 0 |

### జ్యోతిషములు.

| | | | |
|---|---|---|---|
| కాలామృతము, సటీక | 0 | 12 | 0 |
| బృహజ్జాతకము తాత్పర్యము | 1 | 8 | 0 |
| లఘుతాచకము | 0 | 12 | 0 |
| జాతకాలంకారము | 0 | 8 | 0 |
| భీమేశ్వరజ్యోతిషామృతసారము, వ॥ కా॥ | 0 | 8 | 0 |
| యవనజాతకము | 0 | 8 | 0 |
| రెట్టమతశాస్త్రం తాత్పర్యము | 0 | 10 | 0 |
| ఆరూఢరత్నము అను సిద్ధాంజనము | 0 | 8 | 0 |
| జాతకచింతామణి | 1 | 0 | 0 |

## స్తోత్రములు.

| | రూ. | అ. | పై. |
|---|---|---|---|
| బృహత్ స్తోత్ర రత్నాకరము మొదటి భాగము | 2 | 0 | 0 |
| డిటో రెండవభాగము | 2 | 8 | 0 |
| డిటో మూడవభాగము | 3 | 8 | 0 |

## వైద్యము.

| | | | |
|---|---|---|---|
| వైద్యామృతము | 1 | 4 | 0 |
| చికిత్సారత్నము | 1 | 4 | 0 |
| నాడీనక్షత్రమాల, నాడీనిర్ణయము | 0 | 4 | 0 |
| నాడీజ్ఞానము | 0 | 3 | 0 |
| కాలజ్ఞానము | 0 | 4 | 0 |
| ధన్వంతరినిఘంటువు | 2 | 8 | 0 |
| గుణపాఠము | 3 | 0 | 0 |
| వైద్యచింతామణి 20 సం॥నుండి లోకప్రసిద్ధిజెందినది. 2 వాల్యూములు గల మేలుప్రతి | 10 | 0 | 0 |
| మాధవనిదానము | 2 | 0 | 0 |
| అనుపానరత్నాకరము | 1 | 0 | 0 |
| అనుపానమంజరి | 0 | 8 | 0 |
| వాజీకరణ కల్ప ద్రుమము | 1 | 8 | 0 |
| సద్వైద్యజీవనము | 0 | 8 | 0 |
| చికిత్సాసారము | 2 | 8 | 0 |
| సర్వౌషధి గుణకల్పము | 2 | 8 | 0 |
| ఘృతతరంగము | 1 | 0 | 0 |
| సుశ్రుతశారీరము ప్రాచీనము | 2 | 8 | 0 |

| | రూ. | అ. | పై. |
|---|---|---|---|
| బసవరాజీయము | 7 | 0 | 0 |
| అష్టాంగహృదయము సూత్రస్థానము | 6 | 0 | 0 |
| షడ్రసనిఘంటువు | 0 | 8 | 0 |
| వ్యాసప్రోక్త వైద్యశాస్త్రము | 1 | 8 | 0 |
| వశిష్ఠప్రోక్త వైద్యము | 1 | 8 | 0 |
| మానవధర్మ చంద్రిక | 2 | 0 | 0 |
| గదనిగ్రహము | 2 | 8 | 0 |
| శార్ఙ్గధరసంహిత ప్రాచీనము | 3 | 0 | 0 |
| కుమారతంత్రము | 0 | 6 | 0 |
| వైద్యశతశ్లోకి | 0 | 6 | 0 |
| భేషజకల్పము | 0 | 6 | 0 |
| అశ్వవైద్య శాస్త్రము | 2 | 8 | 0 |
| చక్రదత్త | 3 | 12 | 0 |
| రాజమార్తాండము | 0 | 10 | 0 |
| శార్ఙ్గధరకృతత్రిశతి | 0 | 8 | 0 |
| ~~వృక్షాయుర్వేదము~~ | ~~0~~ | ~~4~~ | ~~0~~ |
| విషవైద్యచింతామణి | 2 | 0 | 0 |
| బృహద్వైద్యరత్నాకరం | 2 | 8 | 0 |
| స్వరశాస్త్రము | 1 | 4 | 0 |
| అగస్త్యప్రోక్త వైద్యం | 1 | 8 | 0 |
| ఏకమూలికాప్రయోగరత్నావళి | 0 | 8 | 0 |
| వైద్యపదనిఘంటువు అచ్చగుచున్నది | 5 | 0 | 0 |

అష్టాంగహృదయము, చికిత్సాస్థానము ప్రత్యేకముగా అచ్చగుచున్నది.

వంధ్యాతంత్రము అచ్చగుచున్నది.

## నవలలు.

| | రూ. | అ. | పై. |
|---|---|---|---|
| తారాభాయి | 0 | 12 | 0 |
| దిలారామ | 1 | 4 | 0 |
| అస్తమయము | 1 | 8 | 0 |
| ఆనందమఠ | 0 | 12 | 0 |
| కపాలకుండల | 0 | 14 | 0 |
| దుర్గేశనందని | 0 | 8 | 0 |
| ఐవన్హో | 0 | 8 | 0 |
| మదాలస | 0 | 10 | 0 |
| సుజనంజనీ | 0 | 8 | 0 |
| కోపినార | 0 | 12 | 0 |
| వీరబాల | 0 | 8 | 0 |
| ఆంధ్రరాష్ట్రము | 0 | 14 | 0 |
| కళావతి | 0 | 12 | 0 |
| లలితాభాయి | 0 | 6 | 0 |
| లలిత | 1 | 0 | 0 |
| పాతాళభైరవి | 1 | 4 | 0 |
| ప్రళయభైరవము | 0 | 12 | 0 |
| బొబ్బిలి - బొబ్బిలి | 1 | 4 | 0 |

## సంగీతములు.

| | | | |
|---|---|---|---|
| త్యాగరాజస్వామిగారి కీర్తనలు. 718 కీర్తనలు | 1 | 12 | 0 |
| సంగీతసుధాంబుధి | 3 | 0 | 0 |
| సంగీతప్రదాయిని | 3 | 0 | 0 |
| గాంధర్వకల్పవల్లి వ్యాఖ్యాసహితము | 3 | 0 | 0 |